# ఆధునిక

# తమిళ సాహిత్య నిర్మాతలు

రచన :

డా. చల్లా రాధాకృష్ణ శర్మ

ప్రచురణ :

దక్షిణ భాషా పుస్తక సంస్థ

మద్రాసు - 31.

1978
Telugu

ADHUNIKA TAMILA
SAHITYA NIRMATALU

*By*
**Dr. C. RADHAKRISHNA SARMA**



**Price : Rs. 6-00**

*Published by*
Southern Languages Book Trust
Madras - 600 031.

*Printed at*
Bhagyam Quality Printers,
Madras - 600 021.

# పరిచయం

దక్షిణ భారత పుస్తక సంస్థ తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం అనే నాలుగు ప్రధాన దాక్షిణాత్య భాషలలోనూ 1955 నుంచీ పుస్తక ప్రచురణ కళాభివృద్ధి కోసం కృషి చేస్తూంది. అధిక సంఖ్యలో పేపర్‌బాక్ పుస్తకాలు ప్రచురించి పంపిణీ చేయడానికి ఈ సంస్థ ముందంజ వేసి, ఇతరులకు మార్గదర్శకమైంది. దేశీయ, విదేశీయ సుప్రసిద్ధ రచనల అనువాదాలతో ఈ సంస్థ ప్రచురణ కార్యక్రమం ప్రారంభమైంది. తరువాత దాక్షిణాత్య భాషలలో మౌలిక రచనలు కూడా కొన్ని ప్రకటించబడినయి. ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, రష్యన్, జపాన్, చైనా భాషలలోని ప్రముఖ రచనల అనువాదాలనేకం ఈ సంస్థ ప్రకటించింది. ఒక ప్రాంతీయ భాష నుండి మరొక ప్రాంతీయ భాషలోకి జరిగిన అనువాదాలు రాష్ట్రాల మధ్య సదవగాహనకు విశేష దోహదం చేసినయి.

సాహిత్యం, చరిత్ర, రాజనీతి, మతం, తత్త్వశాస్త్రం మొదలు విజ్ఞానశాస్త్రం, యాత్రా గ్రంథాలూ, సాహసిక గాథలూ, లలిత కళల దాకా అనేక విషయాలకు సంబంధించిన పుస్తకాలను ఈ సంస్థ ప్రచురించింది. బాల సాహిత్య ప్రచురణ పట్ల ఈ సంస్థకు మరింత మక్కువ. యూనెస్కో, అంతర్జాతీయ కార్మిక సంస్థ వంటి సంస్థల ప్రేరణతో కొన్ని పుస్తకాలు ప్రచురించే అవకాశం కూడా ఈ సంస్థకు లభించింది. మొత్తం 600 విలువ పుస్తకాలు ఇప్పటికి ప్రకటించబడినయి. దక్షిణ భారతదేశ పాఠక వర్గాలలో విజ్ఞాన, వివేక పరిపోషణ కోసం ప్రధానంగా ఈ సంస్థ కృషి చేస్తూంది.

దక్షిణాది రాష్ట్ర ప్రభుత్వాలూ, విశ్వవిద్యాలయాలూ అందజేసిన ఆర్థిక సహకారంవల్లా, ఆదరణవల్లా ఈ సంస్థ తన ప్రచురణ కార్యక్రమాలను నిర్విఘ్నంగా నిర్వహించగలుగుతూంది. ఆరంభంనుంచీ దక్షిణ భారతదేశ విశ్వవిద్యాలయా లన్నిటికీ ఈ సంస్థతో సంబంధం ఉండడం ముదావహం. ప్రస్తుతం వ్యవసాయ, సాంకేతిక విశ్వవిద్యాలయాలతో సహా దక్షిణ భారతదేశంలోని 21 విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులూ ఈ సంస్థ పాలక వర్గంలో సభ్యులు.

నిపుణ బృందాల సలహాల ననుసరించి ఈ సంస్థ పాలక వర్గం ప్రస్తుతం మరొక నూతన ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఈ కార్యక్రమంలో వెలువడే గ్రంథాల ప్రధాన లక్ష్యం: పాఠకులలో ఉత్తమ సాహిత్యాభిరుచినీ, ఉదాత్త విజ్ఞానాభిలాషనూ పెంపొందింప జేయడం, తార్కికమైన, మత రహితమైన దృక్పథాన్ని వారికి అలవరచడం. ఇటు ప్రజా సామాన్యం, అటు విద్వజ్జనం కూడా ఈ ప్రచురణల నాదరించ గలరని నేను నమ్ముతున్నాను.

5-5-1978

దక్షిణ భాషా పుస్తక సంస్థ,
మద్రాసు - 31.

మాల్కొం ఆదిశేషయ్య
చైర్మన్.

# మనవి మాటలు

భాషా విషయికంగా, చారిత్రకంగా తెలుగు వారికీ, తమిళులకూ మధ్య దగ్గరి చుట్టరికం నెలకొన్నా, వీరి నడుమ ఏర్పడవలసినంత అవగాహన ఏర్పడ లేదు. భావ సమైక్యానికి ఈ అవగాహన బహుధా ఉపకరిస్తుంది. ఈ సదవ గాహనను సాధించడమే ఈ రచనోద్దేశం.

తమిళ సాహిత్యం గురించి తెలుగు వారికీ; తెలుగు సాహిత్యం గురించి తమిళులకూ అంతగా తెలియక పోవడం శోచనీయం. అందులోనూ ఆధునిక సాహిత్యం గురించి యీ తెలియనితనం కొట్టవచ్చినట్లుగా తెలియ వస్తూంది.

ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలను గురించి స్థూలారుంధతీ న్యాయంగానైనా తెలుసుకోగలిగితే, ఆధునిక తమిళ సాహిత్యం గురించి కొంతవరకైనా తెలుసుకో వచ్చునని నా నమ్మకం. ఆ ప్రయత్నం ఈ పుస్త కంలో యథాశక్తిని చేయబడింది కనుక, ఈ రచనను సహృదయులైన సోద రాంధ్రులు తప్పక ఆదరించ గలరని నా నమ్మకం.

తమిళంలో మహా ప్రాణాక్షరాలు లేనందువల్ల సంబందముదలియార్, మాదవయ్య ఇత్యాదిగా 'ద' కారాన్ని అల్ప ప్రాణాక్షరంగానే పలుకుతారు. పేరులు మార్చడ మెందు కని ఆ వ్యవహారాన్నే యథా తథంగా తెలుగులో అనుసరించాను.

ఇందులో చోటు చేసుకున్న వ్యాసాలు (రెండు తప్ప) 'ఆంధ్రప్రభ' దినపత్రిక ఆదివారం సంచికలలో వెలువడి. ప్రస్తుతం దక్షిణ భారత పుస్తక సంస్థ వారి అధ్వర్యవంలో సర్వాంగ సుందరమైన పుస్తకంగా ముస్తాబు చేసుకున్నాయి. తమ ప్రచురణల ద్వారా ఆధునికాంధ్ర సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నది దక్షిణభాషా పుస్తక సంస్థ. ఈ పుస్తక ప్రచురణ జరగాలని సూచించిన తెలుగు సలహాసంఘ సభ్యులకూ, ఆ సూచనను ఆమోదించిన ఈ సంస్థ చైర్మన్‌కూ, పాలకవర్గ సభ్యులకూ నా కృతజ్ఞతను వినయపూర్వకంగా తెలుపుకొంటున్నాను. అలాగే సంస్థ డైరెక్టరు శ్రీ పి. దక్షిణామూర్తి, తెలుగు సంపాదకులు శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు ప్రభృతులకు కృతజ్ఞుణ్ణి. ఈ పుస్తకంపట్ల ఎంతో ఆదరభావం ప్రకటించిన మిత్రులు శ్రీ వి. వి. సింగరాచార్య (వెనుకటి తెలుగు సంపాదకులు) నేడు కీర్తిశేషులు కావడం దురదృష్టంగా భావిస్తున్నాను. ఈ వ్యాసాలు మొదట నాచేత వ్రాయించిన మిత్రులు శ్రీ వి. సి. కామరాజుకీ, రచనావసరంలో నేను సంప్రతించిన వివిధ గ్రంథ కర్తలకూ, వ్యాసకర్తలకూ, సూచనలు చేసి తోడ్పడిన మిత్రులకూ నా హృదయ పూర్వకమైన కృతజ్ఞత.

ఆధునిక తమిళ సాహిత్యపు తీరు తెన్నులను ఇంకా తెలుసుకునేందుకు ఈ రచన ఒక ప్రేరణ కాగలిగితే నా కృషి ఫలించినట్లుగా భావిస్తాను.

మదరాసు,
10-8-1978.

బుధ జన విధేయుడు,
చల్లా రాధాకృష్ణ శర్మ

# విషయ క్రమం

# మహా విద్వాన్
# మీనాక్షి సుందరం పిళ్లై

జననం: 6-4-1815; మరణం: 1-2-1876
ప్రధాన రచనలు: ఉరైయూర్ పురాణం మొ.

ఇతర భాషలలో వలె తమిళంలోనూ గడిచిన శతాబ్దిలో మహా విద్వాంసులు కొందరు ప్రభవించారు. వారిలో ప్రముఖులు మహా విద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై. ఆయన మూర్తీభవించిన పాండిత్యం; రూపు దాల్చిన సౌజన్యం; ఎంద రెందరికో తమిళ విద్యాదానం చేసి పుణ్యం మూట కట్టుకున్న మహనీయుడు; కన్నతండ్రి కంటె మిన్నగా శిష్యుల్ని ప్రేమించిన ఉత్తమ దేశికుడు. ఆ రోజుల్లో తెలుగు దేశంలో పంతులుగారంటే కందుకూరి వీరేశలింగం, నాయుడుగారంటే రఘుపతి వెంకటరత్నం ఎలా గుర్తుకి వచ్చేవారో, అలాగే తమిళనాడులో పిళ్లై యవర్‌గళ్ అంటే మీనాక్షి సుందరం గుర్తుకి వచ్చేవారు. ఆ మహా పండితుడు అంత ప్రసిద్ధు డన్నమాట :

## బాల్యం - విద్యాభ్యాసం

మీనాక్షి సుందరం పిళ్లై తిరుచిరాపల్లికి దగ్గరలో ఉన్న ఎణ్ణెయ్ అనే గ్రామంలో 1815 ఏప్రిల్ 6 న జన్మించారు. తండ్రి చిదంబరం పిళ్లై. ఆయన తమిళ పండితుడూ, అధ్యాపకుడూను. తల్లి అన్నత్తాచ్చి. వారు శైవులు. వారికి జన్మించిన మీనాక్షి సుందరం పిళ్లై పరమ శైవుడు.

తండ్రే ఆయన తొలి గురువు. ఆయన వద్ద లక్ష్య లక్షణాలు అభ్యసించారు. తీరిక వేళల్లో తాళపత్ర గ్రంథాలు పరిశీలించేవారు. కాలక్రమాన మీనాక్షి సుందరం పిళ్లైలో తమిళ భాషా తృష్ణ బలపడడమే కాక ఎక్కువయింది. అందుకు తోడు తండ్రి కాస్తా కాలధర్మం చెందాడు. అప్పుడు ఆయన పదిహేనేళ్ళ యువకుడు. స్వగ్రామం విడిచిపెట్టి తిరుచిరాపల్లి పట్టణం చేరుకున్నాడు. దీక్షగా తమిళ సాహిత్యాధ్యయనం చేయసాగాడు. తేవారం, తిరువాచకం మొదలైన గ్రంథాలను హృద్గతం చేసుకున్నాడు. ఆ తరవాత గ్రంధ రచనకు పూనుకున్నాడు.

## ఉరైయూర్ పురాణం

మీనాక్షి సుందరం పిళ్లై జీవిత చరిత్రలో 1851 వ సంవత్సరం విశిష్టమయింది. ఆ ఏడు ఆయన వ్రాసిన 'ఉరైయూర్ పురాణం' అనే పద్యకావ్యం దిగ్దంతుల వంటి పండితుల సమక్షంలో ఆవిష్కరించ బడింది. పండితులు నలుగురూ ఆయన కవితా శక్తిని ప్రశంసించారు; పాండితీ ప్రతిభను కొనియాడారు ఆయనకి 'విద్వాన్' అనే పట్టం ఇచ్చారు. ఆ తరవాత మీనాక్షి సుందరం పిళ్లై ప్రతిభ ఊరూ నాడూ వ్యాపించింది. తిరువావడుదురై మఠాధిపతులు ఆయన విద్వత్తుని గుర్తించారు. అప్పటి అధిపతి సుబ్రహ్మణ్య

దేశికుల్ని ఉద్దేశించి ఆయన ఒక కలంబకం రచించారు. వివిధ వృత్తములతో సాగే ఒక ప్రబంధ ప్రభేదమును కలంబకం అని వ్యవహరిస్తారు. అప్పుడు ఆయనకి 'మహా విద్వాన్' అనే పట్టం బహూకరించ బడింది. ఆ నాటినుంచీ అయన మహా విద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై యవర్‌గళ్ అని తమిళ నాడంతటా ప్రసిద్ధిలోకి వచ్చారు.

ఆ నాళ్లలో పాండిత్యానికి బ్రహ్మరథం పట్టేవారు. కాగా, మీనాక్షి సుందరం పిళ్లై గారి రచనలన్నీ పాండితీ స్ఫోరకములు. ఆయన పెక్కు స్థల పురాణాలు సంతరించారు. ఆయనచేత స్థల పురాణం వ్రాయించుకోవడం ఊరి పెద్దలకూ, ఆలయ ధర్మకర్తలకూ గొప్ప గౌరవ కారణంగా ఉండేది. అందు వల్ల ఎన్నో ఆలయాల చరిత్రలూ వాటికి సంబంధించిన గాథలూ ప్రచారం లోకి రాగలిగాయి. ఈ విధంగా మీనాక్షి సుందరం పిళ్లైగారు ఎన్నో స్థల పురాణాలు ప్రౌఢ గంభీరమైన కావ్యశైలిలో రచించి తమిళ వాఙ్మయాన్ని పరిపుష్టం చేశారు. 'మురుగన్ పిళ్లైత్తమిళ్', 'అఖిలాండనాయకిమాలై', 'తిరుప్పెరుందురై పురాణం', 'ఆదికుమర గురుపరస్వామి చరిత్ర', 'కుచేలో పాఖ్యానం' వంటి పెక్కు గ్రంథాలు ఆయన వ్రాశారు. కాని, ఇవన్నీ నేడు అంతగా ప్రచారంలో లేవు. 'సేక్కిళార్ పిళ్లైత్తమిళ్' మాత్రం ప్రచారంలో ఉంది. విద్వత్తుకి అంతగా విలువలేని ఈ రోజుల్లో, స్థల పురాణాలకు ప్రచారం లేని ఈ రోజుల్లో, పాండితీ ప్రధానములూ, పూర్వగాథా సంబంధములూ అయిన మీనాక్షి సుందరం పిళ్లైగారి రచనలకు ప్రాచుర్యం ఎలా లభిస్తుంది? అయినా, ఆయన నేటికీ సంభావించ బడుతున్నారు. అందుకు ముఖ్య కారణా లలోఒకటి : కథలూ గాథలుగా చెప్పబడుతున్న ఆయన అపారమైన శిష్య వాత్సల్యం.

## శిష్య వాత్సల్యం

మీనాక్షి సుందరం పిళ్లై గారి శిష్యులు అనేకులు. తన వద్దకు వచ్చిన వారి కందరికీ సహర్షంగా ఆయన విద్యాదానం చేశారు. వీలునుబట్టి వారికి వసతులు కూడా కల్పించారు. ఆయనకి అరకొరగా నేర్చుకోవడమంటే గిట్టేది కాదు. తన వద్ద చదువుకున్న వారు గొప్ప పండితులు కావాలని ఆయన ఉద్దేశం. మనస్సు విప్పి ఆయన తన ఛాత్రులకు బోధించే వారు. అది ఆయన వ్యక్తిత్వంలోని వైశిష్ట్యం. ప్రముఖ పండితుడూ, కుంభకోణం కాలేజిలో ప్రధాన తమిళోపాధ్యాయుడూ అయిన త్యాగరాజ చెట్టియారు, తొలి తమిళ నవలా రచయిత వేదనాయకం పిళ్లై, పండిత ప్రభాకరులు డాక్టర్ ఉ వే. సామి నాదయ్యరు ప్రభృతులు పిళ్లైగారి శిష్యకోటికి చెందినవారే! మరొక గొప్పతనం కూడా ఆయనలో ఉండేది. పిళ్లైగారు పరమశైవు డైనప్పటికీ, పూర్వాచార పరాయణు డైనప్పటికీ, ఆయన శిష్యులలో వివిధ వర్ణముల వారూ ఉండే వారు. వేదనాయకం పిళ్లై, శవరినాథ పిళ్లై మొదలైనవారు రోమన్ కాథ లిక్కు క్రైస్తవులు.

పిళ్లైగారి శిష్యులలో తలమానికం సామినాదయ్యరుగా రనవచ్చు. ఆయనవద్ద అయిదేళ్ళే చదువుకున్నా, అయ్యరుగారు తమ గురుదేవుని పట్ల ప్రదర్శించిన భక్తి భావం అపూర్వమైంది. ఈ ముచ్చటను పరికిస్తే చాలు. ఆ గురు శిష్య ప్రభావం ఎంత వాత్సల్య పూరితమో తెలియవస్తుంది.

ఒక రోజు తిరువావడుదురై శైవ మఠంలో భోజనాలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. మొదటి పంక్తిలో మొదటి పీట పిళ్లైగారిది—అందరూ భోజనానికి కూర్చున్నారు, పిళ్లైగారు చివాలున పైకి లేచారు, అలా చేయడం

సభ్యతా కాదు, సంప్రదాయమూ కాదు. ఆ మాత్రం ఆయనకి తెలియదా? అందరూ ఆశ్చర్య పోయారు. అప్పుడు ఆ మఠాధిపతి-'పిళ్లైగారూ! ఏమిటిది ?' అని అడిగారు. 'ఏం లేదు – సామినాదయ్యరు ఎక్కడ భోజనం చేస్తున్నాడో ఏమిటో!' అని ఆయన అన్నారు. 'ఆయనకి మరో చోట భోజనం ఏర్పాటు చేశాం. ఈ పాటికి ఆయన భోజనం పూర్తయి ఉంటుంది కూడా' అని మఠాధిపతి సమాధానం చెప్పారు. అప్పటికీ తృప్తి చెందని పిళ్లైగారు ఎలాగో భోజనం ముగించి, చేతులైనా కడుక్కోకుండా సరాసరి సామినాదయ్యరు రున్న చోటికి వెళ్ళి ఆయన భోజనం చేసినట్టు తెలుసుకుని అప్పుడు తృప్తిచెందారు. అదీ మీనాక్షిసుందరం పిళ్లై శిష్య వాత్సల్యం! ఇటువంటి ముచ్చటలు చాలా ఉన్నవి. 'శ్రీ మీనాక్షి సుందరం పిళ్ళై అవర్‌గళ్ చరిత్తిరం' అనే ఉద్గ్రంథం వ్రాశారు సామినాదయ్యరు. ఇది చక్కని జీవిత చరిత్ర గ్రంథం.

పిళ్లైగారికి ఎందుకో కీర్తన లంటే అంత సదభిప్రాయం ఉండేది కాదు. వాటిలో లక్షణ విరుద్ధములైన ప్రయోగాలు ఉంటా యని ఆయన నమ్మకం. ఆ రోజుల్లో గోపాలకృష్ణ భారతి అనే సుప్రసిద్ధ గేయ రచయిత ఉండేవారు. ఆయన 'నందనార్ కీర్తనై' అనే రచన చేశారు. ఇది నేటికీ ప్రచుర ప్రచారంలో ఉంది. కాని, ఇందులో లక్షణ విరుద్ధములైన ప్రయోగాలున్నా యని మీనాక్షి సుందరం పిళ్లై ఈ రచనను మెచ్చుకోలేదు కాని, ఆయన ప్రశంసా పద్యం లభిస్తే తనకు గౌరవ కారణమని భారతి అభిప్రాయం. ఒకనాడు భారతి 'నందనార్ కీర్తనలు' గానం చేస్తూ ఉండగా, అవి విని తన్మయత్వం చెందిన మీనాక్షి సుందరం పిళ్లై గోపాలకృష్ణ భారతిని ప్రశంసిస్తూ ఒక పద్యం చెప్పారు.

ఆర్థికంగా ఇబ్బందులకు లోనైన వేళల్లో గూడా మీనాక్షి సుందరం పిళ్ళై సహనం ప్రదర్శించే వారు. సహజంగా శాంత స్వభావులైన ఆయన అటువంటి సమయాలలో సైతం శిష్యుల సందేహాలు తీర్చేవారు.

ఆ రోజుల్లో ప్రముఖ విద్వాంసుడుగా, ఉత్తమ దేశికుడుగా, పద్య రచనలలో అందె వేసిన చేయిగా, శ్రోతృ ప్రపంచమును మైమరపించే వక్తగా, ప్రౌఢ కవిగా ఎనలేని పేరు పెంపులు గడించిన మహా విద్వాన్ మీనాక్షి సుందరం పిళ్ళై 1876 లో ఫిబ్రవరి 1 న శివసాయుజ్యం చెందారు.

# తమిళ వచన పితామహుడు
# ఆరుముగ నావలర్

జననం : ?-12-1822; మరణం : ?-?-1879
ప్రధాన రచనలు : పెరియ పురాణ వచనం మొ.

కడమ భారతీయ భాషలలో వలె తమిళంలోనూ ఆధునిక యుగం వచన యుగం. కథానిక, నవల, విమర్శ మొదలైన సాహిత్య ప్రక్రియలు వచన రచనలుగానే వెలువడుతున్న విషయం సర్వ విదితం. తుదకు కవిత కూడా వచన రూపంగా వెలువడుతూ ఉన్నది.

గత శతాబ్దిలో వచన రచనలకు అంత ప్రచారమూ లేదు; ప్రాధాన్యమూ లేదు. ఆ రోజులలో ఆరుముగ నావలర్ వంటి ప్రసిద్ధ విద్వాంసులు వచన రచనలు వెలయించి, ఆధునిక తమిళ సాహిత్యంలో క్రొత్త బాటలు వేశారు. నావలర్ చేతిలో వచనం క్రొత్తదనం సంతరించు కోవడమే కాక, అందాలు కూడా దిద్దుకుంది. ఆరుముగ నావలర్ తమిళ వచన పితామహులుగా ప్రసిద్ధి కెక్కారు. నావలర్ అనగా పండితుడని అర్థం.

ఆరుముగ నావలర్ తమిళుడే అయినా ఆయన జన్మభూమి భారతదేశం కాదు; సింహళదేశం (శ్రీలంక)లోని జాఫ్నాలో 1822 లో మార్గశిర మాసంలో

జన్మించారు. తండ్రి కందపిళ్లై; తల్లి శివకామి అమ్మై. వాళ్ళది ప్రసిద్ధమైన శైవ వేళాళ కుటుంబం. ఆరుముగ నావలర్ కొంతకాలం మద్రాసులో నివసించారు. తమిళనాడులోని తిరువావడుదురై అనే మఠంవారు ఆయనకి 'నావలర్' అనే బిరుదు ప్రసాదించారు. అప్పుడు ఆయనకు 27 ఏళ్ళు. ఆనాటినుంచీ ఆయన ఆరుముగ నావలర్‌గా తమిళ సాహితీ లోకానికి చిర పరిచితు లైనారు.

ఆయన చదువు ఒక వీధిబడిలో మొదలయింది. తర్వాత ప్రసిద్ధ విద్వాంసులవద్ద తమిళ భాషాధ్యయనం చేశారు. ఆ తర్వాత పర్సివాల్ అనే పాదిరీ వద్ద ఆంగ్లం అభ్యసించారు. ఆయనలో నిగూఢంగా ఉన్న తమిళ, ఆంగ్ల భాషల పాండిత్యాన్ని పసికట్టి ఆ పాదిరీ తన పాఠశాలలోనే ఆరుముగ నావలర్‌ని ఆంగ్ల, తమిళ భాషా బోధకుడుగా నియమించారు. బైబిలు తమిళ సేతకు పురికొల్పారు కూడా!

బైబిలును తమిళం చేసే రోజుల్లో శైవ మత రహస్యాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలనే ప్రగాఢమైన వాంఛ ఆరుముగ నావలర్‌కి కలిగింది. కలగడమేమిటి శైవమత గ్రంథాలను శ్రద్ధగా అభ్యసించడమేమిటి—అన్నీ అచిర కాలంలోనే సాగాయి. ఆ కారణంగా ఆయన సంస్కృతం కూడా నేర్చుకున్నారు. చిన్నప్పటినుంచి ఆయన దేవాలయాలలో పురాణ పఠనం కావిస్తూ ఉండేవారు. అది కూడా ఆయన వాంఛకు దోహదకారి అయింది.

ఆ రోజుల్లో పాదిరీలు అవలంబించిన మతాంతరీకరణ పద్ధతులు ఆరుముగ నావలర్ మనస్సుని కలవర పెట్టాయి. తత్ఫలితంగా ఆయన జీవితం కొత్త మలుపు తిరిగింది. గృహస్థ జీవితంలో అడుగిడక, శైవమత ప్రచారంకోసం తన జీవితాన్ని మీదు కట్టారు. పరమ శైవుడుగా మార్పు చెందారు. విభూతిరేఖలతో వెలుగొందే ఆ నెన్నుదురూ, రుద్రాక్ష మాలాలం

కృతమైన గళమూ, శిరస్సూ, ఆ వేషమూ ఆయన శైవమతాభిమానాన్ని వ్యక్తం చేసేవి. కొందరు విద్యార్థుల్ని చేరదీసి ఆయన ఉచితంగా శైవగ్రంథాలు వివరించారు. ప్రసంగాలు చేయసాగారు. జాఫ్నాలో శైవ ప్రకాశ విద్యాలయం ఒకటి స్థాపించారు. ఆ తర్వాత బాల బాలికలకూ, వయోజనులకూ ఉపయోగపడేలా సులభ సుందరమైన వచనంలో శైవ మత సంబంధములైన రచనలు చేయసాగారు. పురాణాలను వచన గ్రంథాలుగా వెలయించారు. ఆ ఉద్యమ ఫలితమే ఆయన సంతరించిన పెరియపురాణ వచనం, తిరువిళైయాడల్ పురాణ వచనం మొదలైన వచన రచనలు. ఆ విధంగా ఆయన తమిళ భాషా సేవకు ఒక నిర్దిష్టమైన రూపం ఏర్పడింది. నిస్స్వార్థమైన సేవకు దిగినప్పుడు ఎదురయ్యే ఇబ్బందుల్ని ఆయన విజయవంతంగా ఎదుర్కొన్నారు.

శ్రద్ధాసక్తులతో చాలామంది తమిళ గ్రంథాలు చదివే నిమిత్తం పాఠశాలను స్థాపించడంతో అరుముగ నావలర్ పని తీరిపోలేదు. వారికి ఉపయోగపడే పుస్తకాలు లేకపోతే వాటిని వ్రాశారు. వాటిని అచ్చు వేసేందుకుగాను ఒక అచ్చుకూటం స్థాపించవలసి వచ్చింది. అది సక్రమంగా పని చేయాలన్నా, పుస్తకాలు ముద్రించవలె నన్నా డబ్బు కావాలి గదా ! అందుకోసం ఆయన ఇంటింటికీ వెళ్ళి బియ్యం సేకరించారు. తమిళ భాషకోసం భిక్షాటనం చేసిన భాషాభిమాని ఆయన !

ఆరుముగ నావలర్ ప్రముఖ వచన రచయిత వ్యాకరణ దోషాలు లేని పరిశుద్ధ సుందరమైన తమిళంలో వ్రాశారు. అచ్చు తప్పులు లేకుండా పుస్తకాలు ముద్రించిన ఘనత కూడా అయనకే దక్కింది. ఈ విషయంలో ఆయన మార్గదర్శకు లన్నా సాహసం కాదు.

అయన భాషా సేవ పెరియ పురాణం వంటి పద్య కావ్యాలకు వచన రూపాలు వెలయించడంతో ఆగిపోలేదు. ఈ వచన రచనలు బాగా వ్యాప్తిలో

రావడంవల్ల ప్రాచీన పద్య కావ్యాల పట్ల పాఠకులకు ఆదరభావం కూడా కలిగింది. ఆయన రచనలవల్ల శివ భక్తుల గాథలను అభివర్ణించే ప్రశస్త కావ్యమైన పెరియ పురాణానికి తమిళ పాఠక లోకంలో విశేష ప్రచారం లభించింది.

లక్షణ శాస్త్రానికి సంబంధించిన రచనలు కూడా ఆరుముగ నావలర్ సంతరించారు. వయోజనుల్ని ఉద్దేశించి ప్రశ్నోత్తర వ్యాకరణం వ్రాశారు. వ్యాకరణ సంగ్రహ మనే రచన చేశారు. ప్రశస్త లక్షణ శాస్త్రంగా భావించబడుతున్న నన్నూలుకి వ్యాఖ్య వ్రాశారు. ఈ వివిధ రచనలవల్ల లక్షణ శాస్త్రానికి సంబంధించిన ప్రధాన విషయాలను సామాన్య పాఠకుడు కూడా గ్రహించే ఒక వాతావరణం ఏర్పడింది.

భారతం, కంద పురాణం, తిరుక్కురళుకి పరిమేలళగర్ అనే ప్రాచీన పండితుడు వ్రాసిన వ్యాఖ్య, పెరియ పురాణం మొదలైన వాటిని ఆయన చక్కగా ముద్రించారు.

శైవ మత సంబంధ రచనలు కూడా ఆయన చేశారు. మిథ్యావాద నిరసనం, శైవదూషణ పరిహారం వంటి రచనలు వెలయించారు ఇవి కాక ఎన్నో వ్యాసాలు రచించారు. కీర్తనలు కూడా ఆయన లేఖినినుంచి వెలువడక పోలేదు. మరి ఆయన చేసిన ప్రసంగాలు, పురాణ వ్యాఖ్యానాలు ఎన్నెన్నో ! అవి గ్రంథస్థం కాలేదు. అయి వుంటే ఆయన పాండిత్యమూ, రచనా వైశద్యమూ మరింతగా నలుగురికీ తెలిసి ఉండేవి.

ఆరుముగ నావలర్ రచనల్ని నిశితంగా కనక పరిశీలిస్తే మన కొక విషయం స్ఫురించకపోదు. ఆయనకి శైవమత మంటే ఎంత అభిమానమో, సంస్కృతి అంటేనూ తమిళ భాషా సాహిత్యా లంటేనూ అంతే అభిమానం. ఈ అభిమానాన్ని పురస్కరించుకుని, శైవ మతస్థులు తమ మతం గురించీ, సంస్కృతిని గురించీ అన్ని విషయాలూ తెలుసుకోవా లనే అభిలాషను పురస్క-

రించుకుని ఆయన శైవమత పరాలైన రచనలు వెలయించారు. కాని, ఆయనకి అన్యమతస్థు లంటే ద్వేషభావం లేదు. నలుగురికీ చక్కగా అర్థం కావాలన్న దృష్టి ప్రబలం కావడంవల్ల ఆయన బాల బాలికలకు సైతం అర్థమయ్యే శైలిలో వ్రాయడానికి ప్రయత్నించారు. వయో భేదానికి తగినట్లుగా కూడా వ్రాయడానికి యత్నించారు. ఇది ఆయనకి గల నవ్య దృష్టి.

ప్రాచీన గ్రంథాలు ప్రకటించీ, పద్య కావ్యాలను వచన రచనలుగా వెలయించీ, తమిళ గ్రంథాలను ఆంగ్లంలోకి, ఆంగ్ల రచనలను తమిళంలోకి అనువదించడానికి సారథ్యం వహించీ, పాఠ్య గ్రంథాలను వయో భేదాలకు తగినట్లుగా సంతరించీ, వచన రచనలకు ప్రాధాన్య మిచ్చీ తమిళభాషకు సేవ చేసిన ఆరుముగ నావలర్ 1879 లో కాలధర్మం చెందారు.

# తొలి తమిళ నవలా రచయిత
# వేదనాయకం పిళ్లై

---

జననం : 11-10-1826; మరణం : 21-7-1889
ప్రధాన రచనలు : ప్రతాప ముదలియార్ చరిత్రం మొ.

తమిళంలో నవల అనగా వేదనాయకం పిళ్లై పేరు గుర్తుకి వస్తుంది. ఆయన తొలి తమిళ నవలా రచయిత. 1876 లో వెలువడిన ఆయన 'ప్రతాప ముదలియార్ చరిత్రం' తరవాతి తమిళ నవలలకు మార్గదర్శక మైంది. 1887 లో 'సుగుణ సుందరి' అనే మరొక నవలను కూడా ఆయన సంతరించారు. కాని, 'ప్రతాప ముదలియార్ చరిత్రము'నకు వచ్చిన ఖ్యాతి ఈ నవలకు రాలేదు. తమిళంలో వచన కావ్యాలు లేని కొరతను తీర్చే అభిలాషతో తాను నవల వ్రాసినట్లు ఆంగ్ల భాషాభిజ్ఞుడూ, తమిళ పండితుడూ అయిన వేదనాయకం పిళ్లై పేర్కొన్నారు.

## సాంఘిక నవల

ప్రతాప ముదలియార్ చరిత్రం' సాంఘిక నవల. కథానాయకుడే కథను వివరించినట్లుగా నవల తీర్చి దిద్దబడింది. నాయికా నాయకుల తల్లి దండ్రుల మధ్య వచ్చిన పోట్లాట వల్ల కథా నాయకుడు ఇల్లు విడిచిపెట్టి వెళ్ళి పోతాడు. అతని తల్లీ, భార్యా ఎంతో వివేకంతో ప్రవర్తిస్తారు. విద్యుల్లతల వలె వాళ్ళు ఈ నవలలో ప్రకాశిస్తారు. పాత్ర చిత్రణ ఉదాత్తంగా సాగిన ఈ రచనలో సుభాషితాలు ఎన్నో ఉదాహృతము లవడంతో పాటు మధ్య మధ్య హాస్యరసం చిప్పిలుతూ ఉండడం ఒక విశేషం. 'సుగుణ సుందరి'లో రచయితే కథను వివరించడం జరిగింది. ఈ రచనకు సాహిత్యపు విలువ లేదని విమర్శ కుల విశ్వాసం. 'ప్రతాప ముదలియార్ చరిత్రం' ఆంగ్లంలోకి అనూదిత మయింది.

వేదనాయకం పిళ్లై కాథలిక్ క్రైస్తవుడు. అయినా ఆనాటి శైవ మతానుయాయులైన పండితులు పలువురు ఆయన మిత్రకోటిలోని ప్రముఖులు. మహా విద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై వద్ద ఆయన తమిళ కావ్యాలు అధ్యయనం చేశారు. మీనాక్షి సుందరం పిళ్లై మహా పండితుడు. పరమ శైవుడు. ఆయన 16 స్థల పురాణాలూ, 14 అంతాదులూ వెలయించిన విద్వాంసుడు. వేదనాయకం పిళ్లైలోని సౌజన్యాన్ని ప్రశంసిస్తూ 'కుళత్తూర్ కోవై' అనే రచన చేసిన సహృదయుడు మీనాక్షి సుందరం పిళ్లై. ప్రణయ భరితమైన కావ్య భేదం కోవై. గురువు వలె ప్రాచీన సంప్రదాయాను సారంగా శిష్యుడూ రెండు అంతాది రచనలు చేశాడు. కాని, కాలక్రమాన శిష్యుని మనస్సు వచన రచనల మీద కేంద్రీకృత మయింది. ఛందోబద్ధమైన పద్య రచన నలుగురికీ సుబోధకంగా ఉండదనే ఉద్దేశంతోనే వేదనాయకం పిళ్లై నవలా రచనకు పూనుకున్నాడు.

తిరుచిరాపల్లి జిల్లాలోని కుళత్తూర్ అనే గ్రామంలో వేదనాయకం పిళ్లై 1826 లో అక్టోబరు 11 న జన్మించారు. తండ్రి శవరిముత్తు పిళ్లై, తల్లి ఆరోగ్య మరియమ్మ.

చదువు పూర్తి అయిన తరవాత, వేదనాయకం పిళ్లై తిరుచిరాపల్లి లోని కోర్టులో రికార్డు కీపరుగా చేరారు. ఆ తరవాత జిల్లా మునసబు కోర్టులో అనువాదకు డయ్యారు. ముప్ఫయ్యవ ఏట ఆయన జిల్లా మునసబుగా నియమితు లయ్యారు. తమిళనాడులోని చాలా చోట్ల జిల్లా మునసబుగా సమర్థంగా పనిచేసి 1872 లో ఉద్యోగ విరమణ చేశారు. అనంతరం మాయూరం పురపాలక సంఘాధ్యక్షులుగా కొంతకాలం పనిచేసి, 1889 జూలై 21 న శాశ్వతంగా కన్ను మూశారు

ఒకసారి మాయూరంలో గొప్ప క్షామం సంభవించింది అప్పుడు ఆయన పలుచోట్ల గంజి కేంద్రాలు తెరిచి అన్నార్తులైన వేలాది ప్రజలకు సేవ చేశారట !

గద్య, పద్య రచనలే కాక సంగీత శాస్త్రంలో ప్రవేశం కలిగిన వేద నాయకం పిళ్లై ఎన్నో కీర్తనలు వెలయించారు. తిరువరుళ్‌మాలై, దేవతోత్తిర మాలై అనే క్రైస్తవ ప్రార్థనాగీత సంపుటాలు సంతరించారు. సర్వ సమయ సమరస కీర్తన వ్రాశారు. ఇది ఆయన సర్వ మత సామరస్య భావాన్ని వ్యక్తం చేస్తున్నది. నీత్యుద్బోధక మైన నీతి నూల్ అనే పాటల పుస్తకం కూడా వ్రాశారు.

ఆయన జిల్లా మునసబు పని చేసినా, ఆయన మనస్సు భక్తి భరితమై ఉండేది. ఆయన హృదయం అన్యాయాలను సహించేదికాదు, వేదనాయకం పిళ్లై

వ్రాసిన ఈ క్రింది పాటను పరిశీలిస్తే ఆయన మానసిక వేదన వ్యక్త మవుతుంది.

"గొంతు చించుకొనుచు
కీచులాడెడి వకీళ్ళు
చెంత కూర్చుండి, మనల
చిత్రవధ చేయుచుండ
చింతించుట వీలగునా
చిన్మయ రూపుని గురించి
చింతింప ఖరమా – మనసా!
చేతులు లేని వాడు వాదిని పట్టుకొనె నట
రెండు కాళ్ళు లేని వాడు తన్నె నట
శిరసు లేని వాడు కొరికె నట
పాట పాడు వేదనాయకన్ వినె నట!"

మరొక పాటలో కూడా ఆయన మనోవేదన వ్యక్తమవుతుంది. సులభ సుందరమైన భాషలో సాగిన ఈ పాటలో అంత్య ప్రాసలు అనాయాసంగా చోటు చేసుకున్నవి.

"పోదుం పోదుం ఉద్దియోగ గనమే—ఇదిల్
ఏదు సుకం నమక్కు మనమే
ఎన్న నేరముం ఓయాద వేలై —ఇదిల్
ఎన్న పెట్రోం ముత్తుమాలై ....
చాలు చాలు నీ ఉద్యోగ భోగం—ఇందులో
మన కేమి సుఖం మనసా!
ఎల్ల వేళల తీరని పని—ఇందులో
మన కేమి లభించిం దని ?

ఆ ఉద్యోగం ఒక యంత్రం—అందులో
నలిగే చెరకు గడలం మనం
సుబ్బయ్య రేమో అబద్ధాల పుట్ట—ఆ
సుందరయ్యరు కేసు దోషాల గుట్ట !''

కనుక వేదనాయకం పిళ్ళై పాపభీతీ, దైవభక్తీ కలవా డనడం స్పష్టం. న్యాయ సమ్మతంగా తీర్పు ఇచ్చే వరం నాకు ప్రసాదించు. వచ్చే కక్షిదారుల మనస్సుని మాటలతో గాయ పరచకుండా, కింది ఉద్యోగస్థులతో అనవసరంగా గొడవ పడకుండా, కేసు విచారణలో అలసట కలగకుండా ఉండేటట్లు అనుగ్రహించ మని ఆ ప్రభువుని ఆయన అర్థించాడు

## తొలి నవలా కర్త

ఇటువంటి పాటలే కాక హాస్య రస ప్రధానములైన నలుగు పాటలు మొదలైనవి కూడా వ్రాశారు వేదనాయకం పిళ్ళై. లంచగొండి ఉద్యోగస్తుల్ని తూర్పార పట్టారు. జాతి భేదాలు అర్థరహితము లని ఆయన అభిప్రాయం. ఆయన వ్రాసిన కొన్ని లేఖలు పద్య రూపంలో నడిచాయి. ఆ శైలి వచన శైలి కంటె సరళంగా ఉండడం గమనించదగిన అంశం. వేద నాయకం పిళ్ళై శైలి సర్వ సాధారణంగా సులభ సుందరంగా ఉంటుంది. సంస్కృత శబ్దాలను విరసించలేదు ఆయన. స్త్రీల కోసం 'పెణ్‌మతి మాలై' అనే పద్య సంపుటి ఒకటి ప్రచురించారు. ఇది నీతి ప్రధాన మని వేరే చెప్ప నవసరం లేదు. 1862 ప్రాంతాన ఇంగ్లీషులో ఉన్న కొన్ని చట్టాలను ఆయన తమిళం చేశారు.

ఇలా ఎన్నో విధాలుగా ఆధునిక తమిళ సాహిత్యాన్ని వేదనాయకం పిళ్ళై సుసంపన్నం చేసినా, తొలి తమిళ నవలా కర్తగానే ఆయన చరిత్రలో నిలిచిపోయారు !

# తమిళ త్రాత
# ఉ. వే. సామినాదయ్యరు

జననం : 19-2-1855; మరణం : 28-4-1942
ప్రధాన రచనలు : జీవక చింతామణి వ్యాఖ్య మొ.

తమిళ సాహిత్యానికి ప్రాచీనత, ప్రత్యేకత చేకూర్చిన ఘనత సంగ కాలపు కృతులకు చెందుతుంది. స్వతంత్రము, సంస్కృత భాషా సాహిత్యముల ప్రభావం అంతగా లేనిదీ అయిన సంగ యుగపు సారస్వతం తమిళ సాహిత్య చరిత్రకు శ్రీకారం చుట్టింది. అయితే, సంగ కాలపు రచనలు వెలుగు చూసింది 19 వ శతాబ్దిలోనే ! అంతవరకు అవి తాళపత్ర గ్రంథాలుగా చీకటి గదులలో తల దాచుకున్నవి. తరతరాలుగా వాటి మీద పేరుకుపోయిన దుమ్ము దులిపి, వాటిని లెస్సగా పరిష్కరించి, చక్కగా ప్రచురించి, ఆ విధంగా ఆ కృతులకు ప్రచుర ప్రచారం కల్పించిన కర్మవీరుడు, అపర భగీరథుడు, పండిత ప్రభాకరుడు ఉ. వే సామినాదయ్యరు. మహా మహోపాధ్యాయ, దాక్షిణాత్య కళానిధి, ద్రావిడ విద్యా భూషణం, డాక్టర్ ఇత్యాది బిరుద విరాజితుడు ఆయన. ఆ నాళ్ళలో సంస్కృత విద్వాంసులకే లభ్య మవుతున్న మహా మహో

పాధ్యాయ బిరుదం ఒక తమిళ పండితునికి లభించిం దంటే అది సామినా దయ్యరు శేముషీ వైభవానికి ప్రబల నిదర్శనం. కృతజ్ఞత మరవని తమిళులు ఆయన తమిళ పండితుడుగా పనిచేసిన మదరాసు రాజధానీ కళాశాలలో 1947 లో అయ్యరు గారి శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. అంతే కాక, ఆయన్ని ''తమిళ తాతా'' అని ఆదరాభిమానములతో వ్యవహరిస్తారు. ఆయన కారణ జన్ముడు! తమిళ భాషా సాహిత్యా లున్నంతవరకూ ఆయన చిరంజీవి.

సంగీత విద్వాంసుల వంశంలో పుట్టి పెరిగినా, సామినాదయ్యరు మనస్సు సంగీతం మీదికి ప్రసరించలేదు. తమిళ భాషాధ్యయనానికి ఆయన మనస్సు ఉరకలు వేసింది. తమిళం తప్ప మరొక భాష తెలియదు. తండ్రి వేంకట సుబ్రహ్మణ్యం అయ్యరు మొదటి గురువు. తంజావూరు జిల్లాలో పాపనాశం తాలూకాలోని ఉత్తమ దానపురం అనే కుగ్రామం అయ్యరు జన్మస్థలం. 1855 లో ఫిబ్రవరి 19 న ఆయన జన్మించారు. 1942 లో ఏప్రిల్ 28 న ఆ పరిశోధక విద్వాంసుడు కన్నుమూశారు. ఉత్తరాషాఢ నక్షత్ర జాతకులకు మరణయోగం ఉండ దని మన విశ్వాసం. సాహిత్యానికే తన యావజ్జీవితాన్ని మీదుకట్టిన అయ్యరు గారి పట్ల ఇది మూఢ విశ్వాసం కాదుకదా, అక్షరాలా నిజ మయింది. సుమారు నూరు తమిళ గ్రంథాలను అద్భుతావహంగా, అతి సమర్థంగా పరిష్కరించి ప్రకటించారు సామినా దయ్యరు. తమిళ సాహిత్య సరస్వతిపట్ల ఆయనకు గల అభిమానం అనల్పం; భక్తిభావం నిరుపమానం. చదువంటే ఆంగ్ల భాషాధ్యయనమే అనుకునే ఆ రోజుల్లో స్వచ్ఛమైన భాషాభిమానం కల సామినాదయ్యరు తమిళ క్షేత్రంలో దిగి కృషి సలపడం తమిళ సాహిత్యం చేసుకున్న అదృష్టం.

## జీవిత ఘట్టాలు

తండ్రివద్ద చదువు ముగిసిన తరువాత మరి కొందరివద్ద అధ్యయనం సాగించి, ఆ తర్వాత అయ్యరు మహా విద్వాంసు లనీ, అపర కంబ డనీ ప్రసిద్ధ

కెక్కిన మీనాక్షి సుందరం పిళ్లై గారి అంతేవాసి అయినారు. అశైవోపా ధ్యాయిక అయిదేళ్ళే సాగినా, పిళ్లైగారే అయ్యరు గారి గురుదేవులు; ఆయన గురుభక్తి మాటల కందనిది. తమ గురుదేవుల్ని పేరుతో పిలవక పిళ్లైగా (పిళ్లై యవర్‌గళ్) రని మాత్రం సభక్తికంగా ఆయన పిలిచేవారు. పిళ్లై గారి జీవిత చరిత్రను 800 పుటలలో ఆయన వ్రాశా రంటే సామినాదయ్యరు గారి గురు భక్తికి ఇంతకంటె మంచి నిదర్శనం మరొకటి లేదు. పిళ్లై గారి మరణానంతరం ఆయన తిరువావడుదురై మఠాధిపతుల వద్ద అధ్యయనం సాగించారు.

1880 లో అయ్యరు కుంభకోణంలోని ప్రభుత్వ కళాశాలలో తమిళ పండింతుడుగా చేరారు. ఆ రోజుల్లో సేలం రామస్వామి ముదలియా రనే సహృదయుడైన సాహితీవేత్తతో ఆయనకు పరిచయం కలిగింది. ఆ పరిచయం ఏ సుముహూర్తంలో ప్రారంభ మయిందో కాని, అయ్యరు తరువాతి గ్రంథ పరిష్కరణోద్యమానికి శ్రీకారం చుట్టడమే కాక, గట్టి పునాది వేసింది. ఆయన ప్రేరణతో సామినాదయ్యరు జైన మత సిద్ధాంతాలు తెలియజేసే ప్రశస్త కావ్యమైన 'జీవక చింతామణి'ని గురించి పరిశోధించ సాగారు. ఇది తమిళ కావ్య పంచకంలో ఒకటి, అంతేకాదు. కంబ మహాకవి అంతటివాణ్ణి ప్రభావితుణ్ణి చేసిన కమనీయ కావ్యం.

ఆ కావ్యంలోని మత సిద్ధాంతాలూ, కొన్ని పద బంధాలూ మొదలైనవి చాలా కొత్తవి. శైవమతంలో పనిచేసే అయ్యరు జైన సిద్ధాంతాలు తెలిపిన వారి నందరినీ సంప్రతించారు. ఎంతో కష్టపడి కఠిన శబ్దాలకు అర్థాలు కను గొన్నారు. కావ్యకర్త అయిన తిరుత్తక్కదేవరుని గురించి పుక్కిటి పురా ణాలు తప్ప ఖచ్చితములైన విషయాలు ఆనాటి పండిత లోకానికి తెలియవు. కాగా, కవిని గురించి ప్రామాణికమైన జీవిత చరిత్ర తయారు చేశారు.

పరిష్కరించిన కావ్య ప్రతిని అచ్చువేసేందుకు కావలసిన ధనం పోగు చేశారు. కొందరు పండితులు నిరుత్సాహ పరిచారు. అయినా ఆయన వెనుకంజ వెయ్యలేదు. సామినాదయ్యరు గారి నిర్విరామ కృషి ఫలితంగా సవ్యాఖ్యానంగా 'జీవక చింతామణి' 1887 లో వెలుగు చూసింది. పండిత లోకం హర్షించింది. పలువురు మిత్రులు ఆయన్ని అభినందిస్తూ లేఖలు వ్రాశారు. పారిస్ నగరం నుంచి జూలియన్ విల్సన్ అనే తమిళ పండితుడు ఒక ఉత్తరం వ్రాశాడు. అలాగే ఫౌన్ సెనూ అనే మరో ఫ్రెంచి తమిళ భాషాభిమాని కూడా అభినందిస్తూ లేఖ వ్రాశాడు. ఈ లేఖల వల్ల—"నాకు తమిళ గ్రంథ పరిశోధనలో గాఢమైన ఆసక్తి కలిగింది" అన్నారు అయ్యరు. 'జీవక చింతామణి' ముద్రిత ప్రతులకు లభించిన గౌరవాన్ని ఆయన మాటలలోనే తెలియజేస్తున్నాను. "....కట్టువిప్పి, పుస్తకాలు బయటికి తీసి, ముగ్గులు వేసిన ఒక పీట మీద అమర్చి, పూలదండలతో అలంకరించి, కర్పూర హారతి పట్టి పసుపు నీరు చుట్టి పోసి, ఆ పుస్తకాలను మా అమ్మగారు నా చేతికి అందించారు. అప్పుడు మా నాయనగారి కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లినవి."

## జీవక చింతామణి

'జీవక చింతామణి' ప్రచురణతో సామినాదయ్యరు గారి యశశ్చంద్రికలు తమిళనాడంతటా వ్యాపించ సాగినవి. కాని, అసూయాపరులైన కొందరు ఆ ముద్రణలోని తప్పులు వెలికి తీసి ఆయన్ని విమర్శించ సాగారు. కాని, అందుకు ఆయన విచారించలేదు. అయ్యరు గారి నిజాయితీ ఎటువంటిదో గ్రహించడానికి ఈ క్రింది వాక్యాలు తోడ్పడతాయి :

"నా అజ్ఞానంవల్ల 'చింతామణి' ముద్రణలో కొన్ని దోషాలు దొరలినవి. తిరుత్తక్కదేవర్ మధురకు వెళ్ళి సంగ కాలపు పండితుల్ని చూసినట్లు మొదటి ముద్రణలో వ్రాశాను. ఇది తప్పని ఆ తరవాత తెలుసుకున్నాను. జైన పండితుల్ని చూసినట్లు ఆ తరవాత పరిశోధన వల్ల వ్యక్తమయింది.

అలాగే – కావ్యనామం కవి పేరు మొదలైన విషయాల్లోనూ కొన్ని దోషాలు దొర్లినట్లు 'చింతామణి' మొదటి ముద్రణలో చూడవచ్చు. వాటిని కాల క్రమాన సవరించాను. రేపు దొరకే కొత్తపాఠం వల్ల నేడు ప్రచారంలో ఉన్న పాఠం అసమంజసంగా కనిపించవచ్చు. తన స్వల్ప జ్ఞానంతో మానవుడు తాను అనుకొన్న దాన్ని పరమ సిద్ధాంత మని ఎలా చెప్పగలడు?''

కాలక్రమాన సామినాదయ్యరు గారు 'పత్తుప్పాట్టు' (పది కృతులు), తమిళ పంచ కావ్యాలలోని 'మణిమేకల', 'సిలప్పదికారం' కావ్యాలు మొదలైన అనర్ఘ రత్నాలను సంశోధించి ప్రచురించారు. ఆయన కేవలం గ్రంథ సంపాదకులు, పరిష్కర్తలు మాత్రమే కాదు; ప్రసిద్ధ వ్యాఖ్యాతలు; టీకా కర్తలు; బహు గ్రంథ కర్త కూడా. 'మణిమేకల' కథా సంగ్రహం వంటి కొన్ని ప్రాచీన కావ్యాల కథలను సంగ్రహంగా వ్రాసి ప్రకటించారు. వాటిలో 'ఉదయణన్ చరిత్ర' అమూల్యమైన రచన. మీనాక్షి సుందరం పిళ్లై గారి జీవిత చరిత్రనే కాక, గోపాలకృష్ణ భారతి, విద్వాన్ త్యాగరాజ చెట్టియార్ మొదలైన ప్రముఖుల జీవిత చరిత్రలను కూడా వెలయించారు. 'నాన్ కణ్డదుం, కేట్టదుం' (నేను కన్నదీ, విన్నదీ) వంటి వచన రచనలు సంతరించారు. తమ జీవితానుభవాలను రెండు సంపుటాలలో ''నినైవు మంజరి'' (స్మృతి మంజరి)గా ప్రకటించారు.

## స్వీయ చరిత్ర

తాళ దళ గ్రంథాలకోసం, వ్రాత ప్రతులకోసం ఊరూరా, వీధి వీధీ, ఇల్లిల్లూ తిరిగి తిరిగీ, కనిపించిన పండితుల్ని సంప్రతించీ, కంట బడిన గ్రంథాన్ని సంశోధించీ, కావ్య సంపాదన చేసీ పరిష్కరించి ప్రకటించిన సామినాదయ్యరు తమిళంలో స్వీయచరిత్ర రచనకు అంకురార్పణ చేశారు. ఆయన వ్రాసిన 'ఎన్‌చరిత్తిరం' (నా చరిత్ర) తమిళంలో వెలువడిన మొదటి స్వీయ చరిత్ర. అయితే, ఇది అసమగ్ర రచన. అయ్యరు జీవితంలోని తొలి 44

సంవత్సరాల విశేషాలే ఇందులో చోటు చేసుకున్నవి. కాని, కడమ 43 సంవత్సరాల ఆయన జీవిత వృత్తాంతం—ముఖ్యంగా సాహిత్య విషయాలు — ఆయన ముఖతః మనకు తెలియక పోవడం దురదృష్టం!

అయ్యరు కృషివల్లనే 'పత్తుప్పాట్టు' వెలుగు చూడగలిగింది. 'ఎట్టుత్తొగై'లోని అయిదు కృతులు ప్రచారంలోకి వచ్చినవి. తమిళ పంచ కావ్యాలలో మూడు ముద్రణ భాగ్యం అందగలిగినవి. ఇవికాక రెండు కావ్యాలు, 13 పురాణాలు, 42 లఘు ప్రబంధాలు, నాలుగు లక్షణ గ్రంథాలు, 19 వచన రచనలు మొదలైనవి ఆయన పరిశ్రమ ఫలితాలు. 'కంబ రామాయణం', శైవుల పారాయణ గ్రంథం 'తేవారము' చక్కగా పరిష్కరించి ప్రకటించాలని ఆయన ఆశించారు. కాని, అది ఆయన జీవిత కాలంలో నెరవేరలేదు. అయినా - ఆయన సేకరించిన పాఠాంతరాలు వ్రాసుకున్న లఘుటీక మొదలైనవాటిని ఆధారంగా చేసుకొని మదరాసులోని డాక్టర్ ఉ. వే. సామినాదయ్యరు గ్రంథాలయంవారు 'కంబ రామాయణం' ప్రకటించారు. హర్షించ దగిన విషయ మిది!

పరిశోధక విద్వాంసుడికి పెట్టని భూషణంగా ఉండవలసిన సత్యాన్వేషణ దృష్టి అయ్యరుకు వెన్నతో పెట్టిన విద్య. 'మణిమేకల' కావ్యంలో బ్రాహ్మణ దూషణ (అపుత్రుని కథ) ఉన్నది. దానిని యథాతథంగా తమ ముద్రణలో ఉంచడం అయ్యరు సత్యైకదృష్టికి ఒక మచ్చుతునక. అలాగే ఆయన కృతజ్ఞతా గుణం బహుధా ప్రశంసార్హం. ఎవరు ఏ కొత్త అంశం తెలియజేసినా దానిని కృతజ్ఞతతో స్వీకరించడం ఆయన అలవాటు. 'మణిమేకల'ను పరిష్కరించే సందర్భంలో కుంభకోణం కళాశాలలో ఆయన సహోద్యోగులైన రావుబహదూర్ మళూర్ రంగాచారి అనే సహృదయుడు చక్కని పాఠాంతరాలూ అవీ సూచించి సహాయం చేశారు. బౌద్ధమత సిద్ధాంతములను తెలియజేసే 'మణిమేకల' కావ్యంలోని అంద చందాలు మున్నగు వాటిని

సుమారు అయిదారు సంవత్సరాలు రంగాచారి అయ్యరుకు తెలియజేశారు. "ఆయన నాకు ఉపాధ్యాయులై అవి తెలియజేశా రనడం సమంజసంగా ఉంటుంది" అని అయ్యరు గారు ఒకచోట పేర్కొన్నారు. ఇంకా ఇలా పేర్కొన్నారు :

"తమిళ సరస్వతి తన 'మణిమేకల'ను కోల్పోయింది. దానిని కను గొనే అదృష్టం నాకు దక్కింది. కాని, అందులో పొదగబడి ఉన్న రత్న ముల సొగసులు నాకు మొట్టమొదట ఇదమిత్థ మని తెలియలేదు. వాటిని రంగా చారి తెలియజేశారు. మళ్ళీ 'మణిమేకల' తమిళ సరస్వతి కటిసీమను అలంక రించి ప్రతిభాసిస్తున్నది

"ఇది వ్రాసేటప్పుడు నా మనస్సులోని కృతజ్ఞతా గుణమును పరిపూర్ణంగా వ్యక్తం చేయగల శక్తి నాకు లేదు. దాన్ని ముఖాముఖీ అర్థం చేసుకునేందుకు రంగాచారి లేరు. అయితే నేం? ఆయన పేరు నేను కృతజ్ఞతా గుణంతో స్మరించుకుంటున్నాను. నా మనస్సులో ఆయన ఎప్పుడూ ఉంటారు"

పాత రోజుల్లో పుట్టిన నవ్యదృష్టి కల పండితుడు సామినాదయ్యరు. ఒక చిన్న గదిలో బల్ల ముందు కూర్చుని పైలట్ సిరాతో ఆయన వ్రాసినారట ; ఒక కావ్యాన్ని పరిష్కరించేటప్పుడు దానికి ముందు వెలసిన కావ్యాలూ, ఆ కావ్యమూ, సమకాలిక కావ్యాలూ ఆయన పరిశీలిస్తూ అపూర్వ పదములను చిన్న చిన్న కాగితాలమీద వ్రాసుకుంటూ, వాటిని అరలు కలిగిన పదకోశం పెట్టెలో వేసి, ఆ తరువాత అయ్యరు పాత నిర్ణయానికి పూనుకునేవా రని ఆయన శిష్యులలో ప్రముఖులు, సుప్రసిద్ధ రచయిత అయిన కి వా. జగన్నా థన్‌గారివల్ల నేను తెలుసుకున్నాను. ఆ విధంగా అయ్యరు తాము పరిశీలించిన వివిధ కావ్యాలకు పద సూచికలు తయారు చేశారు. ఉదాహరణకి - 'దక్క యాగప్పరణి' అనే కావ్యాన్ని ఆయన ఎలా ప్రచురించారో చూడండి :

సామినాదయ్యరుగారి పీఠిక : 13 పుటలు.

కావ్యకర్తృ జీవిత చరిత్ర : 6 పుటలు.

కావ్యపరిశోధన వివరాలు : 10 పుటలు.

ప్రాచీన వ్యాఖ్యాత వివరాలు : 12 పుటలు.

కావ్యభర్త రెండవ రాజరాజచోళుని చరిత్ర : 4 పుటలు.

అధోజ్ఞాపికలలో సూచింపబడిన కావ్యనామములు మొదలైనవి : 3 పుటలు.

'దక్కయాగప్పరణి' మూలమూ, టీకా : 253 పుటలు.

విశిష్ట సూచనలు : 114 పుటలు.

పాఠాంతరాలు : 9 పుటలు.

వ్యాకరణ విశేషాలు : 5 పుటలు.

పదసూచిక : 13౹ పుటలు.

ఈ వివరాలను అలవోకగా పరిశీలించినా, సామినాదయ్యరుగారి పాండిత్యమూ, పరిశ్రమా, కావ్య పరిష్కరణయందలి ఆసక్తి మొదలైన విశిష్ట గుణాలు వ్యక్తము అవుతాయి.

రూపు గట్టిన పాండిత్యం, మూర్తీభవించిన పరిశ్రమ, నరనరాల జీర్ణించిన తమిళ భాషాభిమానం సామినాదయ్యరు గారి అంతర రూపం. విభూతి రేఖలతో ప్రతిభాసించే లలాటమూ, శరీరమూ, రుద్రాక్షమాలతో వెలుగొందే కంఠమూ ఆయన బాహిర రూపం.

తమిళ సాహిత్య సరస్వతికి ఉత్తమదానపురం చేసిన ఉత్తమ దానం మహా విద్వాన్, మహామహోపాధ్యాయ సామినాదయ్యరు !

# సాహిత్యపు విలువ సంతరించుకున్న నాటక కర్త
# సుందరం పిళ్లై

జననం : 5-4-1855; మరణం : 26-4-1897
ప్రధాన రచనలు : మనోన్మణీయం మొ. నాటకాలు.

గత శతాబ్దిలో వెలువడిన తమిళ నాటకాల సంఖ్య అత్యల్పం. ఆ వెలువడినవి కూడా రంగస్థలాన్ని ఉద్దేశించి వ్రాసినవే; కాగా, సాహిత్యపు విలువ కల తమిళ నాటకాలు ఆ రోజుల్లో లేవని చెప్పడం సత్య సన్నిహితం. ఈ కొరతను తీర్చిన ఘనత ఆచార్య పి. సుందరం పిళ్లైకి దక్కింది. ఇలా చరిత్రను సృష్టించిన ఆ నాటకం పేరు 'మనోన్మణీయం.'

కావ్య శైలిలో సంతరించిన నాటకం 'మనోన్మణీయం'. నాటకమే అయినప్పటికీ ఇది ముమ్మూర్తులా ఉత్తమ శ్రవ్య కావ్యం. 1891 లో ఇది వెలుగులోకి వచ్చింది. నాటినుంచి నేటిదాకా ఇది బహుళ ప్రచారంలో ఉంది; కర్తకు నాటక కవిగా చిర యశస్సు సమకూర్చి పెట్టింది. ఈ నాటకంలో రచయిత కావించిన తమిళ దైవ ప్రశంసను ఈ నాడూ తమిళ భాషా ప్రశంసగా

భావిస్తున్నారు. పైగా తమిళనాడులో జరిగే ముఖ్యమైన ప్రతి సమావేశం లోనూ మొదట్లో ఆలపిస్తున్నారు.

లార్డ్ లిట్టన్ ఆంగ్లంలో రచించిన 'ది సీక్రెట్ వే' ని అనుసరించి 'మనోన్మణీయం' రూపొందింది. ఆ అనుసరణ కథ వరకే పరిమితం. కడమ వన్నీ రచయిత పాండితీ ప్రతిభలకు నికషోపలాలు. నాటకం మధ్య మధ్య కానవచ్చే భాగాలలో తమిళ దేశపు ప్రశస్తి, తమిళ సంస్కృతి ప్రశంసా అందాలు దిద్దుకున్నాయి. నాటక సంభాషణలలో ఎన్నో తమిళ లోకోక్తులు తమంత తాము ప్రవేశించాయా అన్నంత సహజంగా చోటు చేసుకున్నాయి. రచయితకు గల తమిళ భాషాభిమానం, ప్రాచీన సంస్కృతి పట్ల గల ఆదర భావం నాటకంలో ప్రదర్శితములు.

సుందరం పిళ్లై కేరళ రాష్ట్రంలోని అలెప్పీ పట్టణంలో 1855 లో ఏప్రిల్ 5 న గౌరవనీయమైన వేళాళ కుటుంబంలో జన్మించారు. తండ్రి పేరు పెరుమాళ్ పిళ్లై. ఆయన గుడ్డల వ్యాపారి, ఆధ్యాత్మిక చింతన కలవాడు. ఆయన శిక్షణలో పెరిగిన సుందరం పిళ్లై తమిళ భక్తి సాహిత్యంలో నిష్ణాతు డనిపించుకున్నారు. తిరువనంతపురంలోని మహారాజా వారి కళాశాలలో బి. ఏ. పట్టభద్రు లయ్యారు. రాజధాని కంతటికీ నాలుగవ వాడుగా, తిరువనంతపురం విద్యార్థులలో మొదటివాడుగా పరీక్షలో కృతార్థు లయ్యారు. విద్యార్థిగా ఉన్న రోజుల్లోనే ఆయన తమిళ భాషా పాండిత్యమూ, తత్త్వశాస్త్ర వైదుష్యమూ నలుగురికీ తెలియవచ్చాయి. బి.ఏ. లో ఆయన ప్రధాన విషయం తత్త్వ శాస్త్రం.

ఆ తర్వాత తాను చదువుకున్న కళాశాలలోనే సుందరం పిళ్లై అధ్యాప కుడుగా నియమితు లయ్యారు. ఎఫ్. ఏ., బి. ఏ. విద్యార్థులకు చరిత్ర, తత్త్వ శాస్త్రం బోధించేవారు. ఉపాధ్యాయుడుగా మంచి పేరు సంపాదించారు. ఆయన

ప్రతిభను గుర్తించిన అప్పటి విద్యాధికారులు సుందరం పిళ్లైని తిరునెల్వేలి లోని పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగా నియమించారు. తరువాతి కాలంలో ఆయన హయాములోనే ఆ పాఠశాల హిందూ కాలేజిగా మార్పు చెందింది.

సుందరం పిళ్లై జీవిత చరిత్రలో తిరునెల్వేలి నివాసం ఒక చిరస్మరణీయమైన ఘట్టం. ఆ పట్టణంలో ఉన్న ఆ రోజుల్లో కోడగనల్లూర్ సుందర స్వామిగళ్ అనే ప్రముఖ వేదాంతితో సుందరం పిళ్లైకి సన్నిహిత పరిచయం ఏర్పడింది. తత్ఫలితంగా ఆయనకు తత్త్వశాస్త్రం మీద అభిమానం ప్రగాఢమైంది. 'మనోన్మణీయం'లో సుందరముని అనే ఒక ప్రముఖ పాత్ర ఉంది. ఆ పాత్ర సుందరస్వామిగళ్ రూప చిత్రణమే అని విజ్ఞుల విశ్వాసం. ఆయన మీద సుందరస్వామిగళ్ వేసిన ముద్ర ఎంత బలవత్తరమైనదో మనకు ఈ విషయం స్పష్టం చేస్తుంది.

అనంతరం సుందరంపిళ్లై స్కాట్లాండు వెళ్ళి, అక్కడ పాశ్చాత్య తత్త్వశాస్త్రం అభ్యసించారు. అక్కడినుంచి తిరిగి వచ్చిన తర్వాత తిరువనంత పురం కళాశాలలో తత్త్వశాస్త్ర ఆచార్య పదవి ఆయనకి లభించింది. ఎమ్ ఏ. డిగ్రీ కూడా తీసుకున్నారు. తదాదిగా ఆ మరణాంతం ఆ పదవిలోనే పని చేశారు. గొప్ప పండితుడూ, ఉత్తమ దేశికుడూ కావడంవల్ల తత్త్వ శాస్త్రం పట్ల విద్యార్థి లోకంలో ఉన్న నిరసన భావం అదృశ్యమైంది. పై పెచ్చు ఆ ఏటి కా ఏడు ఆయన తరగతులలో విద్యార్థుల సంఖ్య పెరిగింది. ప్రముఖ దార్శనికుడుగా పేరు పెంపులు గడించినా సుందరంపిళ్లై యశస్సుని నేటికీ నిలబెట్టింది ఆయన 'మనోన్మణీయ' నాటక మే అని నిస్సంశయంగా పేర్కొన వచ్చు ఆయన తన 42 వ ఏట, అనగా 1897 లో ఏప్రిల్ 28 న కన్ను మూశారు. ఆయనకి బుద్ధిబలం ఉన్నంతగా శరీ బలం ఉండేది కాదు. మధు మేహానికి లోనై ఆయన మరణించారు.

చాలాకాలం జీవించక పోయినప్పటికీ తమిళ సాహిత్యం, తత్త్వ శాస్త్రం, దక్షిణ భారతదేశ చరిత్ర – ఈ మూడు రంగాలలోను ఆయన విశిష్ట మైన సేవ చేశారు. ముఖ్యంగా సాహిత్య క్షేత్రంలో ఒక కొత్త పుంత తొక్కి, ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలలో ఒకరుగా చరిత్రలో నిలిచి పోయారు.

'మనోన్మణీయం' ప్రణయ కావ్య మనీ దేశభక్తి ప్రబోధక రచన అనీ విమర్శకులు చెబుతారు. మనోన్మణి కథానాయిక. ఆమె పాండ్య మహారాజు జీవకుని కుమార్తె. మలిన మనస్కుడైన కుటిలన్ అనే అతడు మంత్రి. పాండ్య రాజ్యానికి సరిహద్దులో ఉన్నది చేరరాజ్యం. ఆ రాజ్యాధిపతి పురు షోత్తముడు. అతనిని పరిణయ మాడాలని మనోన్మణి అభిలాష. పాండ్యుల కులగురువైన సుందరముని ఆమె అభిలాషను గుర్తించి సమర్థించాడు. ఆమెకు వివాహం పురుషోత్తమునితో జరిపించాలని ఆయన ఉద్దేశించాడు. దురదృష్ట వశాత్తు పాండ్య – చేర రాజ్యాధిపతుల నడుమ రవరవలు ఏర్పడ్డాయి. కుటిలుడి కుట్రవల్ల ఆ రవరవలు కణకణలాడే నిప్పులయినాయి. యుద్ధం అనివార్య మయింది. మనోన్మణిని తన కోడలుగా చేసుకుని, పాండ్యరాజ్యాన్ని తన వశం చేసుకోవాలని ఆ దుష్టబుద్ధి దురాలోచన. ఈ విషయాన్ని పైకి రవ్వంతైనా పొక్కనీయకుండా అతడు జీవక రాజుని తన వలలో వేసుకున్నాడు. అతడు చెప్పినట్లు రాజు ఆడసాగాడు.

యుద్ధంలో విజయం తనకు లభించ దని పాండ్యుడు గ్రహించాడు. అప్పుడు గత్యంతరం లేక, కూతురు పెళ్ళిని మంత్రి అభీష్టానుసారం చెయ్యా లనుకున్నాడు. ఆ పరిస్థితిలో మనోన్మణి తనకు ఇష్టం లేకపోయినా తండ్రి కోరికకు తల ఒగ్గింది. అర్ధరాత్రి వేళ వివాహం నిశ్చయమైంది. సుమ హారంతో మంత్రి కుమారుడు మనోన్మణి ముందు ప్రత్యక్ష మయ్యాడు. సరిగ్గా ఆ సమయానికి కుటిలుని చేతులకు శృంఖలాలు బంధించి చేరరాజు

అక్కడికి వస్తాడు. వెంటనే మనోన్మణి తన చేత నున్న పూలమాలను పురుషోత్తముని గళసీమను అలంకరిస్తుంది. కథ సుఖాంత మవుతుంది. ఇదే 'మనోన్మణీయం'లోని ప్రధాన కథ.

పై పాత్రలే కాక, నాటకంలో వాణి, నటరాజన్ అనే మరి రెండు పాత్రలు కూడా ఉన్నాయి. ఇవి కూడా ప్రధాన పాత్రలే! అంతేకాక ఉదాత్త పాత్రలు కూడా. మనోన్మణి ప్రియసఖి వాణి. ఆమె ప్రియుడు నటరాజన్. ఈ రెండు పాత్రలద్వారా నాటక కర్త ఎన్నో తాత్త్విక రహస్యాలు తేటతెల్లం కావించారు. వాణి వీణావాదన చేస్తూ కమ్మని పాటలు కొన్ని ఆలపిస్తుంది. ఈ పాటలలో శివకామి చరిత్ర అందాలు దిద్దుకుంది. ఇది ఒక లఘు కావ్య మన్నా సాహసం కాదు. నటరాజన్ మంచి అందగాడు. సద్గుణముల ప్రోవు. సహన శీలి. ఏ విషయము నైనా చక్కగా ఆలోచించి చేసే మనస్తత్త్వం కలవాడు.

సుందరముని పాత్రలో కోడగనల్లూరు సుందర స్వామిగళ్ కనిపించి నట్లే, నటరాజన్ పాత్రలో మనం సుందరం పిళ్లైని చూడవచ్చు నని విమర్శకుల అభిప్రాయం. పాత్రల పేర్లు సాభిప్రాయంగా పెట్టారు. సుందరంపిళ్లైకి తమిళకావ్య పంచకంలో ఒకటి అయిన జీవక చింతామణి అంటే పరమాదరం. కనకనే పాండ్యరాజుని జీవకుడుగా పేర్కొన్నాడు. సుందర ముని శిష్యు లిద్దరూ తాత్త్వక విషయాలు చర్చిస్తారు. అవి నాటక కర్తకు గల తాత్త్వక విజ్ఞానమును వ్యక్తం చేస్తాయి. అవి నాటకానికి అంతగా అవసరం కావు.

'మనోన్మణీయం'లోని కొన్ని సంభాషణలు దేశభక్తి ప్రబోధకాలు. ఈ క్రింది సంభాషణ ఇందుకు ప్రబలోదాహరణం: 'బ్రాహ్మణులు చేసే యజ్ఞాలలోని అగ్నిహోత్రం కంటే దేశభక్తి గల హృదయంలో ప్రజ్వరిల్లే

అగ్నిహోత్రాన్నే దేవతలు అభిలషిస్తారు. యుద్ధం వల్ల ఏర్పడిన పుండు గాయమే కీర్తియొక్క గాయం. అది పుండు కాదు. కీర్తి నేత్రం.'

ఇక నాటకంలో దొరలిన కొన్ని సూక్తులను పరిశీలిద్దాం. 'జనవాక్యం జనార్దనుని వాక్య మని పెద్దలు చెపుతారు.' 'మన కెన్ని కష్టాలు సంభవించినా అవి మనలోని మాలిన్యాన్ని దహింపజేసి స్వచ్ఛమైన పసిడిని వెలికి తీసేందుకు తోడ్పడే అగ్ని అని భావించడం మన ధర్మం.'

మనోన్మణీయమును న్యాయమూర్తి కె.జి. శేషయ్యరు, ప్రసిద్ధ రచయిత వి. రాజం అయ్యరు ప్రభృతులు బహుధా ప్రశంసించారు. శేషయ్యరు ఇలా అన్నారు : ''తమిళంలోని ఉత్తమ రచనలలో 'మనోన్మణీయం' ఒకటి. ఉదాత్త భావాలు మనోజ్ఞంగా వివరించారు రచయిత. శాశ్వతమైన విలువ కల అన్ని ఉత్తమ రచనల వలె ఇది కూడా మన హృదయాలలో వెలుగులు వెదజల్లుతున్నది.''

'మాత్రొాగై విళక్కం' అనే రచన కూడా చేశారు సుందరం పిళ్లై. అది ఆయన తాత్త్విక ప్రసంగాల సంకలనం. ఇది చక్కని వచన రచన. తమిళ సాహిత్య పరిశోధనకు సంబంధించిన రచన ఒకటి ఆయన ఆంగ్లంలో వెలయించారు. శైవాచార్యులలో ప్రథముడైన జ్ఞాన సంబంధుని కాలాన్ని అందులో చర్చించారు ఆయన అభిప్రాయం ప్రకారం జ్ఞాన సంబంధుడు క్రీస్తు శకం 7 వ శతాబ్ది తొలి భాగంలో జీవించినట్లు చెప్పవచ్చు. ఈ అభిప్రాయాన్నే చాలామంది పండితులు సమర్థించారు

సంగ యుగంలో వెలసిన 'పత్తుప్పాట్టు'కి చెందిన నెడునల్‌వాడైని, మరి రెండు కృతులను సుందరం పిళ్లై చక్కని ఆంగ్లంలోకి అనువదించారు. ప్రశస్తమైన పీఠిక కూడా దానికి వ్రాశారు.

తమిళ సాహిత్యానికీ, తత్త్వశాస్త్రానికీ, తమిళ చరిత్రకూ యథోచితంగా సేవచేసిన సుందరం పిళ్లైని పిహెచ్. డి. డిగ్రీతో సత్కరించడానికి ఒక జర్మను విశ్వవిద్యాలయం ముందుకు వచ్చింది. ఆయన్ని రాయల్ హిస్టారికల్ సొసైటీ వారు ఫెలోగా ఎన్నుకున్నారు. (ఎఫ్.ఆర్.హెచ్.ఎస్.). మదరాసు విశ్వవిద్యాలయం వారు 1891 లో ఫెలోగా ఎన్నుకున్నారు. అప్పటి ఆంగ్ల ప్రభుత్వం ఆయన్ని రావు బహదూర్ బిరుదంతో గౌరవించింది. ఇలా వివిధ సంస్థలచే సమ్మానితుడూ, ప్రముఖ పండితుడూ, నాటక కర్తా, తాత్త్వికుడూ అయిన సుందరం పిళ్లై చాలా కాలం జీవించక పోవడం దురదృష్టం.

శతావధాని

# సెయ్‌గుత్తంబి పావలర్

జననం : ?-7-1867; మరణం : 13-2-1950

ప్రధాన రచనలు : సీతాప్పురాణ వ్యాఖ్య మొ.

ఆధునిక తమిళ సాహిత్యంలో మహావిద్వాన్ అనగానే మీనాక్షి సుందరం పిళ్లై, మహా మహోపాధ్యాయ అనగానే ఉ. వే. సామినాదయ్యరు, కవి మణి అనగానే దేశిక వినాయకం పిళ్లై స్ఫురణకు రావడం సహజం. అలాగే పావలర్ అన్న వెంటనే అల్లామా, మహామతి, దేవామృత ప్రసంగ క్క-శంజియం, శతావధాని కా. ప. సెయ్‌గుత్తంబి స్ఫురణకు రావడం పరిపాటి. పావలర్ అన్న మాటకు కవి అని అర్థం.

తెలుగునాడులో నేటికీ అవధాన ప్రక్రియ ప్రచారంలో ఉన్న అంశం సర్వ విదితం. కాని ప్రస్తుతం ఈ ప్రక్రియ తమిళనాడులో వాడుకలో అంతగా లేదనడం సత్య సన్నిహితం. అంత మాత్రాన అష్టావధానులు కాని శతావధానులు కాని తమిళులలో లేరనుకోవడం పొరపాటే అవుతుంది.

అవధాన కళకు వన్నె చిన్నెలే కాక పేరు పెంపులు కూడా సమకూర్చిన తమిళ కవి సెయ్‌గు త్తంబి.

అవధాన విద్య కవితా వినోద మని కొందరు భావించవచ్చు. కాని ఇది కేవల వినోదం మాత్రం కాదు. అవధాని ఏకాగ్రత గల పండితుడై ఉండాలి. ధారణాశక్తి, సమయస్ఫూర్తి, శాస్త్ర పరిచయం, బహు విషయ పరిజ్ఞానం మొదలైనవి అతనిలో ఉండాలి. ఈ వివిధ గుణముల సమాహారమే అవధానం. ఈ గుణము లన్నీ సెయ్‌గు త్తంబిలో నెలకొన్న కారణంగా ఆయన ప్రసిద్ధ పండిత కవిగానే కాక ప్రముఖ శతావధానిగా కూడా కీర్తి సముపార్జించారు.

సెయ్‌గు త్తంబి పేద ముస్లిం కుటుంబంలో జన్మించారు తండ్రి పేరు ఫకీర్ మిరాన్ సాహిబ్. తల్లి అమీనా. ఆ దంపతుల అయిదవ సంతానం సెయ్‌గు త్తంబి. ఆయన కన్యాకుమారి జిల్లాలోని కోట్టారు (నాగర్‌కోవిల్) అనే పట్టణంలో 1867 జూలైలో జన్మించారు. నేత వృత్తిని ఆధారంగా చేసుకుని తండ్రి సంసార యాత్ర సాగించేవాడు.

ముస్లిం సంప్రదాయానుగుణంగా సెయ్‌గు త్తంబి తమ అయిదవ యేట అరబ్బీ భాష అభ్యసించ సాగాడు. మూడేళ్ల అరబ్బీ నేర్చుకున్నాడు. కురాను కూడా పఠించాడు. ఆ తర్వాత బాల సెయ్‌గు త్తంబి ఒక పాఠశాలలో చేరాడు. అక్కడ మలయాళం బోధించేవారు. ఆ రోజుల్లో ఆ ప్రాంతంలో మలయాళం చదువుకున్నవారికే ప్రభుత్వోద్యోగాలు లభించేవి. పాఠశాలలో చేరిన కొన్నాళ్ళ కల్లా సెయ్‌గు త్తంబి తెలివితేటలూ, చదువు సంధ్యలలో గల ప్రజ్ఞ బహిర్గతము లైనాయి. చేరింది మొదటి తరగతిలోనే అయినా, ఆ మొదటి సంవత్సరంలోనే పై తరగతులు దాటుతూ చివరికి మొదటి ఫారంలో కృతార్థుడయ్యాడు. అంత కుశాగ్రబుద్ధి అన్న మాట సెయ్‌గు త్తంబి. కాని దురదృష్టం :

పేదరికం కారణంగా చదువు అంతటితోనే ఆగిపోయింది. ఆ తరవాత తండ్రికి తోడుగా నేత వృత్తిలో ప్రవేశించాడు. అయినా చదువుమీద ఆసక్తి మాత్రం అణుమాత్రమైనా తగ్గలేదు తీరిక వేళల్లో తమిళం నేర్వసాగాడు. అనతికాలంలోనే తమిళ పుస్తకాలు చదివి అర్థం చేసుకునే శక్తి సంపాదించాడు.

ఆ రోజుల్లో శంకర నారాయణ ఉపాధ్యాయు లనే ప్రసిద్ధ తమిళ విద్వాంసుడు ఉండేవాడు ఆయన వద్ద సెయ్గు త్తంబి తమిళం అభ్యసించ సాగాడు. క్రమక్రమంగా నన్నూల్, తొల్కాప్పియం మొదలైన లక్షణ గ్రంథాలూ, తిరుక్కురళ్ వంటి నీత్యుద్బోధక రచనలూ, పెరియ పురాణం, భారతం మొదలైన కావ్యాలూ అధ్యయనం చేశాడు. ఒక రోజు గురువుగారి కోరికమీద ఒక పద్యం అప్పటికప్పుడు చెప్పాడు. అప్పుడు సెయ్గు త్తంబి వయస్సు పదమూడు సంవత్సరాలు. తరువాత తిరునాగూర్ తిరువన్తాది మొద లైన లఘు రచనలు చేసి పండితుల ఆదరమునకూ, అభిమానమునకూ పాత్రు డయ్యాడు.

ఇలా ఉండగా - సెయ్గు త్తంబికి మదరాసు వెళ్ళే సదవకాశం లభించింది. ఆయన ఇట్టా పార్థసారథి నాయుడు గారి శ్రీ పద్మనాభ విలాసం అనే అచ్చు కూటంలో పండితుడుగా చేరిన నాటినుంచీ ఆయన పాండిత్యమూ, ప్రతిభా నలుగురికీ తెలియ వచ్చాయి. ఇతరుల గ్రంథాలను నిర్దుష్టంగా ప్రకటించడంతో పాటు ఆయనే పెక్కు ప్రాచీన గ్రంథాలను చక్కగా పరిష్కరించి ప్రకటించారు. ఆ కోవకు చెందిన వాటిలో ఆయన సవ్యాఖ్యానంగా ప్రచురించిన సీఱాప్పురాణ మనే 5027 పద్యాల గ్రంథం ఒకటి. ఉమరు పండి తుడు వెలయించిన యీ కావ్యం తమిళ ముస్లిములకు పారాయణ గ్రంథం. ఈ ఉద్గ్రంథానికి సెయ్గు త్తంబి వెలయించిన వ్యాఖ్య బహు ప్రశస్తమైనదిగా పండితులు భావిస్తున్నారు. ఆయన పాండిత్యమునకూ తాత్త్విక విషయ పరిజ్ఞానమునకూ ఇది నికషోపల మన్నా అత్యుక్తి కాదు.

గ్రంథ పరిష్కరణతో తృప్తి చెందని సెయ్‌గు త్తంబి 'యథార్థవాది', 'ఇస్లామియ మిత్తిరన్' అనే పత్రికలు కూడా నిర్వహిస్తూ వుండేవాడు. ఆయన వ్యాఖ్యానాలూ, కవితలూ, ప్రసంగాలూ మదరాసు పౌరుల్ని బహుధా ఆకర్షించాయి. తత్ఫలితంగా ఆయన్ని 'పావలర్' అని వ్యవహరించ సాగారు. తదాదిగా సెయ్‌గ్గు త్తంబి పావలర్ అనే ఆయన ప్రచారంలోకి వచ్చారు.

పావలర్ ప్రతిభను ఇంకా పలువురు గుర్తించేందుకు ఆ రోజుల్లో మదరాసులో జరిగిన ఒక సంఘటన బాగా తోడ్పడింది. భక్త కవి అయిన జ్యోతి రామలింగస్వామి సంతరించిన గీతికా సందోహాన్ని అరుట్పా అనే పేరుతో ఆయన భక్తులు వెలుగులోకి తెచ్చారు. అరుట్పా అంటే దైవాను గ్రహంచే చెప్పబడిన కవిత లని అర్థం చెప్పవచ్చు. కాని ప్రముఖులు కొందరు అరుట్పా అనడం భావ్యం కాదనీ మరుట్పా (మోహ గీతాలు) అనడం సమంజస మనీ పేర్కొన్నారు. ఇది చివరికి పెద్ద వివాద విషయంగా పరిణ మించింది. ఈ వివాదంలో పావలర్ పాల్గొని పండితుల సమక్షంలో అది అరుట్పా అనే సహేతుకంగా వాదించారు. ఆయన వాదం సహృదయులకు నచ్చింది. అప్పు డాయన్ని 'దేవామృత ప్రసంగ కళంజియం' (నిధి) అని పండితలోకం ప్రశంసించింది. అరుట్పా - మరుట్పా వివాదం తెర మరుగున పడిపోయింది.

సెయ్‌గు త్తంబి జీవిత చరిత్రలోనే కాక తమిళ అవధాన చరిత్రలో సైతం 1907 మార్చి 10 మరపునకు రాని ఒక సుదినం. ఆ నాడు మదరాసు లోని విక్టోరియా హాలులో పండితులూ, పత్రికా సంపాదకులూ, పుర ప్రముఖులూ మొదలైన వారి సమక్షంలో ఆయన శతావధానం చేశారు. శ్లేషతో దైవ ప్రార్థన చేయ మని ఒక పృచ్ఛకుడు అవధానిని కోరగా, అప్పు డాయన 'సిరమాఱుదైయాన్........' అనే పద్యం చెప్పి సిరమాఱు దైయాన్ అనే పదబంధాన్ని యిలా వివరించారు:

సిరం ఆఱుడైయాన్ : శిరస్సున నది కలవాడు (గంగాధరుడు).

సిరం ఆఱు ఉడైయాన్ : ఆరు తలలు కలవాడు (షణ్ముఖుడు, మురుగన్).

సిరం మాఱు ఉడైయాన్ : తల మార్పు పొందినవాడు (గణపతి).

సిరం ఆఱు ఉడైయాన్ : కావేరికి మధ్యగా శిరస్సు ఉంచిన విష్ణువు.

సిరం ఆఱు ఉడైయాన్ : సన్మార్గములను చూపే అల్లా.

నాటి శతావధానం దిగ్విజయంగా జరిగింది. అవధానం ఏర్పాటు చేసిన ఇట్టా పార్థసారథి నాయుడు పావలర్ రెండు చేతులకూ స్వర్ణకంకణాలు తొడిగి తన హర్షాన్ని ప్రకటించారు. శతావధాని సుబ్రహ్మణ్య అయ్యరు అవధానికి 'మహామతి' అనే బిరుదం ఇచ్చారు. సభా మందిరం 'శతావధాని సెయ్‌గుత్తంబి పావలర్ వర్ధిల్లాలి' అనే నినాదంతో మారుమోగింది.

అంతకు ముందు పావలర్ షోడశావధానం చేశారు. ఆ విధంగా ఆయన అవధాన విద్యకు తమిళనాడులో ప్రచారం కల్పించారు.

నబినాయక మాన్మియ మంజరి, తిరుక్కోట్టార్రు పృదిర్రు పృత్తంతాది, సీతి వెణ్బా మొదలైన పద్య రచనలు పావలర్ చేశారు. వేదాంత వ్యవహార క్రిమినల్ కేసు, దేవలోక క్రిమినల్ కేసు అనే వచన రచనలు కూడా చేశారు. వీటిలో వేదాంత విషయాలు ఒక కథగా హాస్య రసం జోడించి చెప్పడం జరిగింది. మొత్తంమీద ఆయన రచనలలో సిఱాప్పురాణానికి వ్రాసిన వ్యాఖ్యానం మిన్న అనడం సమంజసం.

పావలర్ జాతీయవాది. ఆయన ఖద్దరు టోపీ దాల్చేవారు. ఖద్దరు వస్త్రధారణను ఆయన ప్రోత్సహించారు. పెక్కు సభలలో మద్యపాన నిషేధావశ్యకతను గురించి ప్రసంగించడమే కాక గేయాలూ ఆలపించారు.

సంభాషణా చతురుడుగా కూడా పావలర్ పేరు గడించారు. ఆయన మాటలలో శ్లేష అందాలు దిద్దుకునేది. ఆయన చివ్వరిసారిగా తంజావూరులో ప్రసంగించారు. ఉపన్యాసం మధ్యలో నేను తం చావూరుకి (నా మరణ ప్రదేశానికి-తంజావూరుకు) వచ్చానని అయన పేర్కొన్నారట. ఆయన చివరి రోజుల్లో ఒకాయన ఆయన్ని చూసి ''ఇప్పుడు కూడా మీరు శతావధానం చెయ్యగలరా ?'' అని అడిగాడు. అందుకు ఆయన తడుముకోకుండా ''నేను శతావధానిని- సదా అవధానిని" అని ప్రత్యుత్తర మిచ్చారు (తమిళ లిపిలో 'శతావధాని'ని చతావతాని అని వ్రాస్తారు. కాని ఉచ్చారణలో అది శతావధానీ అవుతుందీ, సదా అవదానీ అవుతుంది; త, దలకు ఒకే అక్షరం).

అవధాన ప్రక్రియకు ప్రచుర ప్రచారం కల్పించిన శతావధానీ, పండిత కవీ అయిన సెయ్గు త్తంబి పావలర్ 1950 ఫిబ్రవరి 13 న కాలధర్మం చెందారు.

## తమిళ భాషా చరిత్రకారుడు

# సూర్యనారాయణ శాస్త్రి

---

జననం : 7-7-1870; మరణం : 2-11-1903

ప్రధాన రచనలు : కళావతి మొ. నాటకాలు.

ప్రభుత్వాధినేతలు పరదేశీయులు. వారి భాషను నేర్చుకున్న వారికి ఉన్నతోద్యోగాలు లభిస్తూ ఉండేవి. అందువల్ల చాలా మంది ఆంగ్ల భాషాధ్యయనం చేసేవారు అయినా, ఆ నాళ్ళలో దేశ భాషలకోసం తమ జీవితాలు మీదుకట్టిన మహనీయులు కొందరు లేకపోలేదు. వారి కృషివల్ల మన దేశ భాషలు సుసంపన్నము లైనవి. అలా కృషిచేసిన ప్రముఖులలో సుప్రసిద్ధుడు వి. కో. సూర్యనారాయణశాస్త్రి గారు. స్వచ్ఛమైన తమిళ భాషాభిమాని ఆయన. ఇయల్ (లక్షణబద్ధమైన సాహిత్యం), ఇశై (సంగీతం), నాటకం అనే మూడు రకాల తమిళంలోనూ ఆయన ప్రముఖ పండితుడు.

మధురకు సమీపంలో ఉన్న విళాచ్చేరి అనే గ్రామంలో గోవింద శివన్ అనే శివభక్తునికి 1870 జూలై 7 వ తేదీన సూర్యనారాయణ జన్మించాడు. తండ్రివద్ద ఆయన సంస్కృతం అభ్యసించాడు. మదురై సభాపతి ముదలియార్ అనే సుప్రసిద్ధ తమిళ విద్వాంసుని వద్ద తమిళం నేర్చుకున్నాడు. ఈ భాషా

ద్వయంలోనూ తగినంత విద్వత్తు ఆయన ఆ రోజుల్లోనే గడించడమే కాక 'మాలా పంచకం' అనే పుస్తకం కూడా వ్రాశాడు.

మద్రాసులోని క్రైస్తవ కళాశాలలో సూర్యనారాయణ బి. ఏ. విద్యార్థిగా చేరడం ఆయన భావి జీవితానికి గట్టి పునాది వేసింది. ప్రసిద్ధ విద్యావేత్త అయిన డాక్టర్ మిల్లర్ దొర అప్పట్లో కళాశాలాధ్యక్షులుగా ఉండే వారు. ఆయన షేక్స్పియర్ నాటకాలు బోధించేవాడు. ఒకనాడు తరగతిలో హాజరు పట్టీ చదువుతూ, 'నీ పేరు పలకడానికి కొంచెం ఇబ్బందిగా ఉంది - మార్చుకో కూడదా?' అని ఆయన ఛలోక్తిగా అన్నారు. అందుకు యువకు డైన సూర్యనారాయణ 'సరే' అన్నాడు. మరునాడు హాజరుపట్టీ చదువుతూ ఆ దొర - 'మునుపటికంటె ఇప్పుడు మరీ కిష్టంగా ఉందే!' అన్నారు. సూర్యనారాయణ అన్న పేరు సూర్యనారాయణ శాస్త్రి అని పొడిగించబడింది. జంకు లేకుండా - 'మీరు నా పేరు మార్చుకో కూడదా అన్నారు కాని. కుదించాలని ఆదేశించ లేదుగా!' అని ఆయన అన్నాడు. తరువాతి కాలంలో సూర్యనారాయణ శాస్త్రియార్ (గారు) అన్న పేరే తమిళ సాహిత్యంలో నిలిచిపోయింది.

విద్యార్థిగా ఉన్న రోజుల్లోనే సూర్యనారాయణశాస్త్రి తమిళ పాండిత్యం, తమిళ భాషాభిమానం మొదలైనవి వ్యక్తం కాసాగినవి.

ఒకరోజు ఆల్ఫ్రెడ్ టెన్నిసన్ కవి కృతమైన 'మార్ట్ డి ఆర్థర్' (ఆర్థర్ అంతిమయాత్ర) పాఠం చెబుతూ, డాక్టర్ మిల్లర్ ఈ క్రింది రెండు పాదాలను మాటి మాటికీ చదివి మరీ మరీ మెచ్చుకున్నా రట!

So said he, and the barge with oar and sail
Moved from the brink like some full-breathed swan.

(సో సెడ్ హి, అండ్ ద బార్జ్ విత్ ఓర్ అండ్ సెయిల్ మూవ్డ్ ఫ్రమ్ ద బ్రింక్ లైక్ సమ్ ఫుల్ బ్రీత్డ్ స్వాన్).

సతీ సమేతంగా ఆర్థర్ పయనించే పడవ రెక్క లల్లార్చుకుంటూ పయనించే అందమైన హంసలా ఉన్న దని ఇందులో చెప్పబడింది.

''ఇటువంటి మనోహర మైన కల్పన తమిళ సాహిత్యంలో ఉన్నదా?'' అని మిల్లర్ శాస్త్రిగారిని చూచి ప్రశ్నించారట। "లేకేమి పెన్నిసనుకి తొమ్మిది వందల ఏళ్ళకు పూర్వం నివసించిన కంబ కవి సంతరించిన 'రామాయణం'లో రామ లక్ష్మణుల్ని గుహుడు గంగను దాటించిన ఘట్టంలో ఇటువంటి కల్పన ఉన్నది''—అంటూ ఆయన ఆ పద్యమును అప్పటి కప్పుడు ఉదాహరించడమే కాకుండా, అందలి సొగసును కూడా తెలియజేశాడు. శాస్త్రి గారి తమిళ భాషా పాండిత్యమునూ, అద్భుత జ్ఞాపకశక్తినీ ఆకళించుకున్న మిల్లరు దొర ఎంతగానో మురిసిపోయారు. అటువంటి శాస్త్రిగారు అప్పటి మదరాసు రాజధాని కంతా బి. ఏ. లో తమిళంలోనూ, తత్త్వ శాస్త్రంలోనూ సర్వ ప్రథముడుగా ఉత్తీర్ణు లైనారు. భాస్కర సేతుపతి స్వర్ణ పతకమును బహుమతిగా పొందారు. తాను చదువుకొన్న ఆ కళాశాలలోనే తమిళ పండి తుడుగా నియుక్తులైనారు. విద్యార్థి దశలోనే ఆయన ఎన్నో వ్యాసాలు 'వివేక చింతామణి' అనే పత్రికలో ప్రకటించారు. శాస్త్రిగారిని పండిత పదవి ఎలా వరించిందో ఆ వైనం తెలుసుకుంటే ఆయన ప్రతిభ కళ్ళకు కట్టినట్లు తెలియ వస్తుంది.

**తమిళ పండితుడు :**

ఆ రోజుల్లో వర్ధిల్లిన తమిళ పండితులలో సి. వై. దామోదరంపిళ్లై అగ్ర గణ్యులు. ఆయన శాస్త్రిగారికి ఒక పరీక్ష పెట్టారు. అందులో నెగ్గిన తరువాత లిఖిత పరీక్ష ఒకటి జరిగింది. ఒక గంటలో వ్రాయవలసిన ప్రశ్న పత్రానికి ఆయన అరగంటలోనే సమాధానాలు వ్రాశారు. వాటిని పరిశీలించిన దామోదరంపిళ్లై గారికి సూర్యనారాయణశాస్త్రిగారి తమిళ భాషా వైదుష్యం

ఆశ్చర్యం కలిగించింది. ఆ సంతోషం కొద్దీ 'ద్రావిడ శాస్త్రిగా'రనే బిరుదు ఆయన కిచ్చారు. ఆ తరువాత షేక్స్పియర్ రచించిన 'వెనీస్ వర్తకుడు' నాటకంనుంచి ఒక భాగాన్ని తమిళం చేయ మనగా. ఆయన కొన్ని నిమిషా లలో పద్య రూపంలో అనువదించారు. ఆయన తమిళ భాషాభిమానము నకు, విద్వత్తుకీ ముగ్ధులైన కళాశాలాధ్యక్షులు శాస్త్రిగారిని 1895 లో తమిళ పండితులుగా నియమించారు ఆ తరువాత అచిరకాలంలోనే తమిళ శాఖా ధ్యక్షు లైనారు. శాస్త్రిగారి తమిళ భాషాభిమానం ఎంతటి దంటే, చివరికి తన పేరుని 'పరిదిమార్ కలైజర్' అని శుద్ధ ద్రావిడంలోకి మార్చుకున్నారు. తమిళంలో పరిది అనగా సూర్యు డని అర్థం. శాస్త్రి కలైజర్గా మార్పు చెందింది.

శాస్త్రిగారి రచనావళిలో పేర్కొనదగినది 'తమిళ్ మొళియిన్ వరలాఱు' తమిళ భాషా చరిత్రకు సంబంధించిన ఈ గ్రంథం ఆ కోవకు చెందిన రచన లలో మొదటిది ఆయన పరిశోధనకు ఫలితంగా వెలువడిన గ్రంథ మిది. 'తమిళ కవుల చరిత్ర' అనే గ్రంథం కూడా ఆయన వ్రాశారు.

## సంగీత రచనలు:

సంగీత ప్రధానములైన రచనలు కూడా చేశారు శాస్త్రి గారు. పరిది మార్ కలైజన్ అనే పేరుతో 'తని ప్పాశుర త్తొగై' అనే రచన కావించారు. ఆక్స్ఫర్డు విశ్వ విద్యాలయంలో తమిళ భాషాచార్యులుగా ఉండిన డాక్టర్ జి. యు. పోప్ ఈ పుస్తకమును ఆంగ్లములోనికి అనువదించారు, 'పావలర్ విరున్దు' అనే మరొక పుస్తకం కూడా ఆయన లేఖినినుంచి వెలువడింది. ఈ రెండూ సంగీత ప్రధానమైన తమిళంలో సంతరింపబడిన రచనలు.

## కలావతి :

నాటక తమిళంలో సైతం శాస్త్రిగారు రచనలు చేశారు. అంతేకాక, నాటక లక్షణములను తెలియజేసే గ్రంథం కూడా వ్రాశారు. దాని పేరు

'నాటక వియల్'. తమిళ నాటక లక్షణాలు వివరించే రచనలలో అదే మొదటిది. అంతకు మునుపు నాటకాలు కొన్ని వెలువడినవే కాని, నాటక లక్షణములు తెలిపే రచన మాత్రం వెలువడలేదు.

సూర్యనారాయణశాస్త్రి గారిలోని ప్రత్యేకత ఏమిటంటే, నాటక లక్షణ శాస్త్రం రచించి అంతటితో ఊరుకోలేదు. దానికి లక్ష్యప్రాయంగా 'కలావతి' అనే నాటకమూ వ్రాశారు. 1897 లో ఏప్రిలు 1 న విద్వన్మనోరంజని సభ వారు మదరాసులోని వి. పి హాలు (విక్టోరియా పబ్లిక్ హాలు)లో ఆ నాటకం ప్రదర్శించారు. అంతేకాదు—ఆ నాటకంలో కళావతి పాత్రను శాస్త్రిగారే ధరించారు. నాటకశాల పట్ల ఆయనకు గల అభిరుచినీ, ఆసక్తినీ మాత్రమే కాక ఆయన బహుముఖమైన ప్రతిభను కూడా ఈ విషయాదికం తెలియ జేస్తున్నది

అయితే శాస్త్రిగారి మొదటి నాటకం 'కలావతి' కాదు. అంతకు మునుపే ఆయన 'రూపావతి' అనే నాటకం వ్రాశారు. 'కనిపించని కుమార్తె' అనే నామాంతరం కూడా ఉంది ఈ నాటకమునకు. ఆ రోజుల్లో వ్యాప్తిలో ఉన్న తమిళ నాటకములు సంగీత ప్రధానములు; గేయాత్మకములు. వచన నాటకాలు లేవు. ఆ కొరతను తీర్చవలె ననే అభిలాషతో ఆయన 'రూపావతి' నాటకం పంతరించారు. అది గ్రంథ రూపంలో వెలువడి నప్పుడు ప్రతిఘటన వచ్చింది. అయినా, జీవితంలో జంకూ గొంకూ ఎరగని శాస్త్రిగారు 1895లో ఆగస్టు 15 న మదరాసులో విద్యాభిమాన సంఘం ఆధ్వర్యవంలో దానిని ప్రదర్శించారు. ఈ నాటకంలోనూ శాస్త్రిగారు రూపావతి భూమికను నిర్వహించారు. ఆయన 'మాన విజయం', 'మదివాణన్' అనే నాటకములు కూడా వ్రాశారు. కాగా, నాటక రచనలోనూ, నాటక ప్రదర్శనలోనూ ఎంతో ఆసక్తి ప్రదర్శించిన శాస్త్రిగారు నాటకాలు చూడడంలోనూ అంత ఆసక్తి ప్రదర్శించే వారట. ఆయనకి అంత అభిమానం నాటకాలంటేను! ఆయన వెలయించినవి పూర్తి వచన నాటకాలు కాదు. 'రూపావతి', 'కలావతు'లలో పాటలూ, పద్యాలూ

ఉన్నవి. 'మాన విజయం' పద్య నాటకం. స్త్రీ గొప్పవనం, శీల సంపద మొదలైన వాటిని ఆయన తన నాటక రచనల ద్వారా వ్యక్తం చేశారు.

నాటక ప్రాదుర్భావం గురించి శాస్త్రిగారు ఇలా తెలియ జేశారు: "తమ అభిప్రాయాలనూ, భావాలనూ వ్యక్తం చేయా లని మానవులు సహజంగా ఆశిస్తారు. ఈ ఆశను వారినుంచి వేరుచేయడం అసాధ్యం కాగా, మానవులు తమ తలపులనూ, మనో వికారములనూ మాటల ద్వారా, హావ భావాల ద్వారా, లేదా ఆ రెండింటి ద్వారా వ్యక్తం చేస్తున్నారు. ఇలా వ్యక్తం చేసేందుకు ఆటకూ, పాటకూ అనుగుణంగా వాటిని మలచుకునే విధానమును మానవులు బాల్యంనుంచీ నేర్చుకుంటున్నారు. ఇతరులను అనుసరించే నైపుణి సహజంగా అలవడుతున్నది. మానవు లందరూ సంతోషించ వలసిన విషయ మిది ఇతరుల్ని అనుసయించేందుకు అభి నయమూ, మాటలూ తోడ్పడే ఉపకరణాలు .... అభినయం మానవులకు సహజమైన కోరిక. ఒక పనిని తలపించే మరొక పని నిజమునకు ఒక విధంగా నాటకమే అవుతుంది ..."

పగటివేళలో కళాశాలలో విధ్యుక్త ధర్మ నిర్వహణ, రాత్రి వేళల్లో నాటక రచన, లేదా నాటక ప్రదర్శన. సూర్యనారాయణ శాస్త్రిగారి జీవితం లోని చాలాభాగం నాటకం కోసమే అంకితమైపోయింది. అలా నిర్విరామంగా శ్రమించడంతో శాస్త్రిగారి ఆరోగ్యం దెబ్బ తిన్నది. దగ్గుతో బాధపడేవారు. అయినా, ఆయన తన రచనా వ్యాసంగమును మానుకోలేదు మూడు రకముల తమిళంలోనూ విద్వాంసు డని పేరు గడించిన సూర్యనారాయణ శాస్త్రిగారు 1903 లో కాలధర్మం చెందారు. అప్పటికి ఆయన 33 ఏళ్ళ యువకుడు. నిండు జవ్వనంలోనే ఆ తమిళ భాషాభిమానికి నూరేళ్ళు నిండడం దురదృష్ట- కరమైన విషయం. లేకపోతే తమిళ సరస్వతికి ఇంకా ఎన్నో పట్టు సెల్లాలు కప్పి ఉండేవారు శాస్త్రిగారు.

"తమిళం విశిష్టత కల చక్కని భాష. అది వడమొళికి (సంస్కృతం) ఏమాత్రమూ తక్కువైనది కాదు. పైగా, ప్రచారంలో ఉన్న భాష. కాగా, ఒక విధంగా చూస్తే వడమొళి కంటె అది విశిష్టమైనదని భావించవలె"- తమిళ భాషను గురించి సూర్యనారాయణశాస్త్రిగారి అభిప్రాయ మిది.

ఆయన కొంత కాలం 'జ్ఞాన బోధిని' అనే పత్రికకు సంపాదకత్వం వహించారు. 'ముద్రా రాక్షసము' ను సంస్కృతంనుంచే అనువదించారు. సంస్కృతాంగ్ల భాషలలో మంచి పండితుడు. ఆయన తమిళ శైలి ప్రౌఢ గంభీరమైనది

తీర్చి దిద్దిన కనుముక్కు తీరు, విశాల నయనాలు, గుండ్రని ముఖం, జరీ తలపాగా, కోటు - ఇవన్నీ శాస్త్రిగారి బాహ్య స్వరూపానికి నిండుదనం చేకూర్చినవి. ఆయన గుండె పొరలలో, ఆయన వ్రాతలలో కానవచ్చే స్వచ్ఛమైన తమిళ భాషాభిమానమును మాటలలో చెప్పడం అనుకున్నంత సులభం కాదు. వాలా చిన్న వయస్సులోనే కన్ను మూసినా, తమిళ సాహితీ లోకంలో వి. కో. సూర్యనారాయణ శాస్త్రిగారు చిరంజీవి!

బహుముఖ ప్రజ్ఞాశాలి

# రాజం అయ్యరు

జననం : 25-1-1872; మరణం : 13-5-1898

ప్రధాన రచనలు : కమలాంబాళ్ చరిత్రం మొ.

సాధారణంగా జీవితరంగంలో ప్రవేశించే వయస్సులో ఒక ప్రముఖ రచయితకు నూరేళ్ళూ నిండడం నిజంగానే దురదృష్టకరమైన విషయం. ఆ రచయిత కనుక మరి కొన్నాళ్ళు ఉంటే, సరస్వతికి ఇంకా అమూల్యాలైన పట్టు సెల్లాలు చుట్టి ఉండేవా డనే అభిప్రాయం పఠితకు సహజంగా కలుగుతుంది. అప్పుడే కన్ను విప్పిన కుసుమం సువాసనలు పూర్తిగా వెలార్చకుండానే భూపతనం కావడం గుండెను రంపపుకోత పెడుతుంది. సహృదయుడైన పాఠకుడు 'సుకృతీ గతాయుః' అని తన్ను తాను ఓదార్చుకుంటాడు. తొలి తమిళ నవలా రచయితలలో ప్రముఖులైన బి. ఆర్. రాజం అయ్యరుని సంస్మరించగానే ఈ విషయాదికం స్ఫురణకు రాక తప్పదు. శాశ్వతంగా కన్ను మూసే నాటికి ఆయన ఇరవై ఆరేళ్ళ యువకుడు!

తమిళ నవలా సాహిత్యానికి వేదనాయకం పిళ్లై, రాజం అయ్యరు, మాధవయ్యలు 'కవిత్రయం' వంటివారు. తమిళ నవలకు వీరు ముగ్గురూ

గట్టి పునాదులు వేశారు; రూపు రేఖలు తీర్చి దిద్దారు. కొందరు విమర్శకుల దృష్టిలో రాజం అయ్యరు నిజమైన నవలా రచయిత. ఆయన సంతరించిన 'కమలాంబాళ్ చరిత్తిరం' పేర్కొనదగిన మొదటి తమిళ నవల. అంత కీర్తి గడించాడు ఆయన.

అయితే, రాజం అయ్యరు తమిళంలో రచించిన పుస్తకం 'కమలాంబాళ్ చరిత్తిరం' ఒక్కటే. అది గొప్ప రచన కావడం వల్ల ఆయన నేటికీ సజీవుడు. జీవించింది కొద్ది కాలమే అయినప్పటికీ విశేషానుభవం కల రచయితగా ఆయన ఆ నవలలో మనకు దర్శన మిస్తాడు; పైపు. వాటము లెరిగిన రచయితగా కనిపిస్తాడు. ఆ నవలలోని పాత్ర చిత్రణ ఆయనకు మహా రచయిత అనే పేరు పెంపులు సమకూర్చి పెట్టింది. ఆ నవలా రచనకు దారి తీసిన సంఘటన కూడా కొంచెం విచిత్రంగా కనిపిస్తుంది.

మధురలో చదువు సంధ్యలు పూర్తయిన పిమ్మట రాజం అయ్యరు మదరాసులోని క్రైస్తవ కళాశాలలో చదువు సాగించి చరిత్రలో బి. ఏ. పట్టం తీసుకున్నారు. అనంతరం న్యాయశాస్త్రం అధ్యయనం చేయసాగారు. అంతిమ పరీక్షలో కృతార్థులు కాలేకపోయారు. అలా జరగడం తమిళ సాహిత్యానికి మంచి దయింది. లేకపోతే మళ్ళీ పరీక్షకు కూర్చుని, కృతార్థులై న్యాయవాదిగా స్థిరపడి ఉండేవారు.

పరీక్ష పోయిన తర్వాత రాజం అయ్యరుకి ఎందుకో ఉత్సాహం తగ్గింది. అలా అని కాలాన్ని దుర్వినియోగమూ చేయలేదు. తమిళంలో రచనా వ్యాసంగానికి ఉపక్రమించారు. తత్ఫలితమే తమిళంలో వెలసిన రెండవ నవలగా భావింపబడుతున్న 'కమలాంబాళ్ చరిత్తిరం'. అది తొలుదొలుత 'వివేక చింతామణి' అనే పత్రికలో 1893-95 లలో ధారా వాహికంగా వెలువడింది. ఆ తర్వాత, అనగా 1897 లో పుస్తక రూపం దాల్చింది. ఆ మరు

సంవత్సరమే ఆయన కాల ధర్మం చెందారు. 'వివేక చింతామణి'కి ఆయన 'సీత' అనే పెద్ద కథను వ్రాయడం మొదలు పెట్టారు. అది పూర్తి కాలేదు.

వేదనాయకం పిళ్లై వలె కాక, రాజం అయ్యరు తన నవలకు నాయిక పేరు పెట్టడం, ఆయనకి మహిళల పట్ల గల సానుభూతిని తెలియజేస్తున్నది. 'కమలాంబాళ్ చరిత్రం' ఒక ప్రణయ గాథ. అందులో తరుణ వయస్కుల ప్రేమా కనిపిస్తుంది; ఎగుడు దిగుడులకు పాల్పడిన నడి వయస్సు వారి ప్రేమా కనిపిస్తుంది. వివిధ మానవుల మనస్తత్వాన్ని బాగా గ్రహించిన వాడవడంవల్ల ఆయన పాత్ర చిత్రణ సజీవంగా కానవస్తుంది. కనుకనే ఆయన శిష్టునిలోని చెడునీ, దుష్టునిలోని మంచినీ పక్షపాత రహితంగా వర్ణించ గలిగారు. సాధారణంగా ప్రతి మానవుడూ మంచివాడనే భావం ఆయన రచనలో కానవస్తుంది. ఇందుకు కారణం రాజం అయ్యరుకి గల ఆధ్యాత్మిక దృక్పథం. ఈ దృక్పథం ఆయనకి అజన్మసిద్ధం అన్నా సాహసం కాదు.

ఆ నాళ్ళలో మదరాసు నుంచి 'బ్రహ్మవాదిన్' అనే వేదాంత పత్రిక ఒకటి ఆంగ్లంలో వెలువడుతూ ఉండేది. దానికి ఆయన 'మానవుడు: అతని ఎక్కువ తక్కువలు' అనే వ్యాసం వ్రాశారు. అది పాఠకుల ప్రశంసలు అందుకుంది. వేదాంత విషయాలను గురించి ఆయన అంత చక్కగా వ్రాస్తారా అనుకున్నారు పాఠకులు. 'కమలాంబాళ్ చరిత్రం' ప్రేమ కథయే అయినా ముఖ్యంగా నవల చివరలో వేదాంత విషయాలూ, తాత్త్విక రహస్యాలూ చర్చించబడినవి. రచయితకు వేదాంత మంటే అభిమానం అనే విషయం ప్రవ్యక్త మవుతుంది. విచిత్ర మేమిటంటే, రకరకాల మానవులూ మనకు నవలలో కనిపించడమే కాక, ఆ యా పాత్రలు యథార్థ జీవితానికి చెందిన వారా అనే భ్రమ కూడా కలిగిస్తాయి. లోకాభిరామాయణంతో ముప్పొద్దులూ గడిపే పనీ పాటులు లేని పల్లెటూరి స్త్రీలు, గయ్యాళి భార్యకు లోబడిన నిస్స

హాయుడైన భర్త, దారి దోపిడీ దొంగల నాయకుడు మొదలైన వారెందరో నవలలో చోటు చేసుకున్నారు. కాగా, తాత్త్వికుడైనప్పటికీ రచయిత వాస్తవ జీవితంతో గాఢమైన పరిచయం కలవాడని నిస్సంశయంగా చెప్పవచ్చు. అందువల్లనే కాబోలు వాస్తవికతకు అద్దం పట్టిన తొలి తమిళ నవలగా 'కమలాంబాళ్ చరిత్తిరం' విమర్శకుల మన్ననలు అందుకోగలిగింది. అంతే కాదు; అందులో 'నవలా రూపం' కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది కూడా.

సుప్రసిద్ధ తమిళ విద్వాంసులూ, రచయితా అయిన టి. పి. మీనాక్షి సుందరన్ గారు 'కమలాంబాళ్ చరిత్తిరం' ముమ్మూర్తులా నవల అని పేర్కొన్నారు. జీవన సముద్రపు ఆటు పోటులకు తట్టుకొని నిలబడిన కమలాంబాళూ, ఆమె భర్తా గడించిన ఆంతరిక వికాసమును రాజం అయ్యరు బహు రమణీయంగా చిత్రించినట్లు విజ్ఞుల విశ్వాసం. 'కమలాంబాళ్ చరిత్తిరం' ఒక సాంఘిక నవల, మనస్తత్త్వ పరిశీలక నవల, ఆధ్యాత్మిక నవల అని మీనాక్షి సుందరన్ గారు సహేతుకంగా పేర్కొన్నారు. దైనందిన మానవ జీవితంలో సంభవించే శుభాశుభా లన్నీ భగవద్ చిద్విలాసా లనే భావం నవలను చదివే ప్రతి పాఠకుడికీ కలుగుతుంది. అయితే, విచిత్ర మేమిటంటే– ఈ విషయాన్ని రచయిత పని కట్టుకుని నీతిబోధ చేసినట్టు కనిపించదు. ఇదే రాజం అయ్యరు రచనలోని విశిష్టత. తమిళ నవల ఇంకా శైశవావస్థలో ఉన్న ఆ నాళ్ళలో ఆయన ప్రదర్శించిన శిల్పం బహుధా ప్రశంసార్హం.

వివేకానందస్వామి ప్రోత్సాహంవల్ల 1896 లో మదరాసులో, 'ప్రబుద్ధ భారత' అనే ఆంగ్ల పత్రిక ఒకటి వెలుగులోకి వచ్చింది. దానికి రాజం అయ్యరు మొదటి సంపాదకుడుగా నియుక్తులైనారు. 'ప్రబుద్ధ భారత' తొలి సంచిక వెలువడినప్పుడు వివేకానందులు తన సంతోషాన్ని తెలియజేస్తూ ఆయనకు ఒక లేఖ వ్రాశారు.

'ప్రబుద్ధ భారత'లో రాజం అయ్యరు వేదాంత విషయాలతో పాటు భక్తులూ, మహనీయులూ మొదలైనవారిని గురించి కూడా మనోహరమైన ఆంగ్లంలో ఎన్నో వ్యాసాలు సంతరించారు. మారుపేర్లతోనూ, ఒక్కొక్క సారి ఏ పేరూ లేకుండానూ ఆయన వ్రాసేవారు. ఆ విధంగా ఆయన పత్రిక పుటలు నింపేవారు. ఆ తర్వాత 'ప్రబుద్ధ భారత'లో వెలువడిన రచన లన్నిటినీ కలిపి 'రాంబుల్స్ ఇన్ వేదాంత' (వేదాంత విహారం) అనే పేరుతో ఒక పుస్తకంగా వేశారు. ఇది సుమారు 900 పుటల బృహద్గ్రంథం.

ప్రశస్తమైన తమిళ నవలను సంతరించీ, వాస్తవ జీవితానికి సన్నిహితమైన రచనను తమిళుల కందించీ, ఆంగ్లంలో వేదాంత రచనలు ఎన్నో వెలయించీ తరగని పేరు పెంపులు గడించిన బి. ఆర్. రాజం అయ్యరు మధుర జిల్లాలోని వత్తల్‌గుండు అనే గ్రామంలో 1872 జనవరి 25 న కన్ను తెరిచారు. 1898 మే 13 న మదరాసులో కన్ను మూశారు. ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతగా ఆయన చిరంజీవి।

# నవలా రచనకు రూప రేఖలు దిద్దిన
# మాదవయ్య

జననం : 16-10-1872; మరణం : 22-10-25
ప్రధాన రచనలు : పద్మావతి చరిత్రం మొ. నవలలు.

తొలి తమిళ నవలా రచయిత అగుటే కాక, 'భారతీయ-ఆంగ్ల' (Indo-Anglian) రచయితలలోనూ సుప్రసిద్ధులు అ. మాదవయ్య. ఇలా రెండు భాషలలోనే కాక కవిత, సాహిత్య విమర్శ, వ్యాసం, కథ మొదలైన వివిధ ప్రక్రియలలో కూడా ఆయన రచనలు చేశారు. కాని, నవలా కర్తగా ఆయన నాలుగు కాలాలపాటు నిలిచే పేరు గడించారు.

తిరునెల్వేలి జిల్లాలోని పెరుంగుళం అనే గ్రామంలో మాదవయ్య 1872 అక్టోబర్ 16న జన్మించారు. తండ్రి అప్పావయ్యర్.

మాదవయ్య మదరాసులోని క్రైస్తవ కళాశాలలో చదివి, బి.ఏ డిగ్రీ తీసుకున్నారు. చివరిదాకా ఆ కళాశాల అన్నా, క్రైస్తవ మత సిద్ధాంతము లన్నా ఆయనకి అపారమైన గౌరవం ఉండేది. ఆయన రచనలలో ఈ విషయం విదిత మవుతుంది. ముఖ్యంగా ఆయన ఆంగ్లంలో వ్రాసిన 'క్లారిండా' అనే నవలలో ఇది కొట్టవచ్చినట్టు తెలియవస్తుంది.

కళాశాల చదువు ముగిసిన తర్వాత మాదవయ్య ఉప్పు—అబ్కారి శాఖలో ఉద్యోగిగా చేరి, క్రమక్రమంగా ఇన్‌స్పెక్టరయ్యారు. కాని, 1923 లో ఉద్యోగానికి స్వస్తి చెప్పి, మాదవయ్య మదరాసులో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. ఆ మరు సంవత్సరం 'పంచామృతం' అనే తమిళ మాస పత్రిక స్థాపించారు. సొంత అచ్చుకూటం కూడా స్థాపించారు. పంచామృతంలో రాజకీయాలతో పాటు కథానికలు, వ్యాసాలు, సాహిత్య విమర్శలు మొదలైనవి ఎన్నో ప్రకటించారు. 'కోణ గోపాలన్' (కొంటె గోపాలుడు) అనే కలం పేరుతో ఆయన ఆ పత్రికలో కవితలూ, కథలూ ఎన్నో వెలయించారు.

అది 1925 అక్టోబరు 22. ఆ నాడు మాదవయ్య మదరాసు విశ్వవిద్యాలయం సెనేట్‌లో తమిళ భాషాభివృద్ధిని గురించి సూచనలు చేస్తూ ప్రసంగం చేశారు. ఉపన్యాసానంతరం కుర్చీలో కూర్చున్న మరుక్షణమే ఆయన శాశ్వతంగా కన్ను మూశారు. తమిళ భాషాభివృద్ధిని గురించి ప్రసంగం పూర్తిచేసిన ఆ మరుక్షణమే ఆ తమిళ భాషాభిమాని కాలధర్మం చెందడం నిజంగానే విధి వైపరీత్యం. ఆ నాటికి ఆయన వయస్సు 53.

మాదవయ్య తమిళంలో 'పద్మావతి చరిత్తిరం', 'విజయ మార్తాండం' 'ముత్తు మీనాక్షి' అనే మూడు నవలలు వ్రాశారు. వీటిలో 'పద్మావతి చరిత్తిరం' చాలా ప్రశస్తమయింది. మూడు భాగాల నవల. మొదటి భాగం 1898 లోనూ, రెండవది 1900 లోనూ, మూడవ భాగం 1925 లోనూ వెలువడ్డాయి. మొదటి భాగం వెలువడినప్పుడు ఆయన 27 ఏళ్ళ యువకుడు. ఈ నవల ఎంత ప్రచారం గడించిం దంటే, ఆ రోజుల్లోనే దీనికి అయిదు ముద్రణలు వచ్చినవి. తమిళ విమర్శకులు కొందరి దృష్టిలో మాదవయ్య నిజమైన నవలాకర్త. పైగా, ఆయన వచన రచనా విధానం నలుగురినీ బహుధా ఆకర్షించింది. పద్మావతి చరిత్తిరం' ప్రాచుర్యానికి కారణాలలో ఈ శైలి కూడా ఒకటి. కాగా, ఉత్తమ వచన రచయితలలో ఆయన ఒకరు కాగలిగారు.

మాదవయ్య మామూలు రచయిత కాదు: పండిత రచయిత. 'తిరుక్కురళ్', 'కంబ రామాయణము'లంటే ఆయనకి ప్రగాఢమైన అభిమానం. ఈ రచనలలో నించి పద్యాలను ఆయన తన రచనలలో తరుచు ఉదాహరించేవారు.

'బాల రామాయణం', '(బాలవినోద) కథై గళ్' అనే కథలు 'తిరుమలై సేతుపతి', 'బారిస్టర్ పంచనదం' అనే నాటకాలు, మూడు సంపుటాల కథానికలు, 'హిందు ధర్మ సంగీత మంజరి' అనే కీర్తనల సంపుటి, 'ఆచార సీర్ తిరుత్తమ్', 'ఆచార సంస్కరణ', 'ఉదలయన్' ('ఒథెల్లో' తమిళసేత) మొదలైనవి మాదవయ్య చేసిన కొన్ని తమిళ రచనలు. నాలుగు వందల కురళలను గురించి కూడా ఆయన ఒక పుస్తకం వ్రాశారు.

సంస్కృతీ, సభ్యతా జీర్ణించుకున్న సజ్జనుడు మాదవయ్య. ఆయనది బలిష్ఠమైన శరీరం. గుర్రపు స్వారీ అంటే ఎనలేని మక్కువ. సంఘ సంస్కరణాభిలాష మిక్కుటంగా ఉండేది. మూఢాచారాలవల్ల యాతనలకు పాల్పడిన మహిళలంటేనూ, నిమ్నజాతుల వారంటేనూ ఆయనకి ప్రత్యేకమైన అభిమానం ఉండేది.

తమిళం, ఇంగ్లీషులలో అసమానమైన పాండిత్యం గడించిన మాదవయ్య ఆ రెండు భాషలలోనూ రచనలు చేసి, 'సవ్యసాచి' అనిపించుకున్నారు. 'తిల్లయ్ గోవిందన్', 'సత్యానంద', 'క్లారిండా' అనే మూడు నవలలు ఆయన ఇంగ్లీషులో వెలయించారు. 'కుశికర్' కథానికలు కూడా సంతరించారు. అలాగే, ఇంగ్లీషులో వ్యాసాలు అనేకం వ్రాశారు ఆ రోజుల్లో వీటికి బహుళ ప్రచారం ఉండేది.

'క్లారిండా' ఒక చారిత్రక నవల తంజావూరు జిల్లా గెజెటీర్ మొదలైన చారిత్రక లేఖనాలను ఆధారం చేసుకుని ఈ నవల వ్రాయబడింది. క్లారిండా అనే ఒక బ్రాహ్మణ బాలిక విషాద గాథ ఇందులోని ఇతివృత్తం. 18 వ శతాబ్ది సాంఘిక పరిస్థితుల కీ నవల దర్పణం పడుతున్నది.

క్లారిండా తంజావూరు మహారాష్ట్ర రాజవంశానికి చెందిన బాలిక ఆమె తండ్రి ఒక యుద్ధంలో కన్ను మూస్తాడు. అప్పు డామె తల్లి సహగమనం ఆచరిస్తుంది. ఆమెను సంరక్షించే భారం తాతగారిమీద పడుతుంది. దురదృష్ట వశాత్తూ అచిరకాలంలోనే ఆయనా కాలధర్మం చెందుతాడు. ఆమెకు కష్టాలు ప్రారంభ మవుతాయి. పైగా ఆస్తి పాస్తులు బోలెడు. ఇబ్బందులకేం కొరత ఉంటుంది! ఆమెను కొంచెం పెద్దవాడయిన ఒక దివానుకి ఇచ్చి పెళ్ళి చేస్తారు. ఆ దివానూ మరణిస్తాడు. అప్పుడు దగ్గరి బంధువులు క్లారిండాను సహగమనం చెయ్య మని ప్రోత్సహిస్తారు. చితిమీద ఆమెను ఉంచుతారు. అప్పుడు ఇంగ్లీషు సైనికుడైన లిటిల్‌టన్ అనే యువకుడు ఆమెను కాపాడుతాడు. పాము కాటు నుంచి ఆమెను అతను చిన్నతనంలో కాపాడాడు. అతనే ఆమె గాయాలకు తగిన చికిత్స చేస్తాడు. ఆమె కోలుకుంటుంది. చివరికి వాళ్ళిద్దరూ ఉంగరాలు మార్చుకుని భార్యా భర్త లవుతారు. అయినా, ఆమె కష్టాలు తీరలేదు. లిటిల్ టన్ కూడా కొంత కాలానికి మరణిస్తాడు. క్లారిండా హృదయం దుర్భర శోకంతో నిండి పోయింది. ఆమె క్రైస్తవమతం స్వీకరిస్తుంది. పాలయం కోట అనే చోట ఒక చర్చి కూడా కట్టిస్తుంది. ఇలా ఆమె జీవిత కథ రకరకాల మలుపులు తిరుగుతుంది. ఈ మధ్యనే ఈ నవల తమిళంలోకి పరివర్తితమై మాదవయ్యను మళ్ళీ పాఠకుల స్మృతి పథంలోకి తీసుకువచ్చింది.

తన 'పంచామృతం' పత్రికలోనే కాక, తన రచన లన్నిటిలోనూ మాదవయ్య మూఢ విశ్వాసములను తూర్పార పట్టారు. 'పద్మావతి చరిత్తిరం'లో కూడా ఆయన సంఘ సంస్కరణాభిలాష వ్యక్త మవుతుంది. భార్యను సందేహించిన భర్త మనఃప్రవృత్తిని ఆయన ఈ రచనలో తెలియ జేశారు. బాల వితంతువైన ఒక అభాగ్యురాలు తన విషాద కథను తానే వివరిస్తున్నట్టుగా వ్రాయబడిన చక్కని నవల 'ముత్తు మీనాక్షి'.

తమిళ నవలకు రూప రేఖలు దిద్దిన ప్రముఖ రచయితగా, ఉత్తమ వచన రచయితగా, తమిళ భాషాభిమానిగా, పత్రికా సంపాదకుడుగా, సంఘ సంస్కరణాభిలాషిగా అ. మాదవయ్య చిరకీర్తి గడించారు. తమిళ కథానికా వికాసానికి ఆయన రచించిన కథానికలు తోడ్పడేలా ఉన్నవని విజ్ఞుల అభిప్రాయం.

# నాటక పితామహుడు
# సంబంధం ముదలియారు

జననం : 1-2-1873; మరణం : 24-9-1964
ప్రధాన రచనలు : మనోహరా మొ. పెక్కు నాటకాలు.

"రావు బహదూర్ పమ్మల్ సంబంధం ముదలియార్ గారు తమిళ సంప్రదాయములు కల నాటకాలు వ్రాశారు. ఆయన నాటకాలు తమిళుల్ని ఆకట్టుకున్నాయి. ఆ కారణం వల్లనే పలుచోట్ల నాటక సభలు ఏర్పడ్డాయి. నాటకాలు ప్రదర్శించారు. అవి తమిళులకు అపూర్వమైన విందులుగా పర్యవసించాయి. సంబంధం ముదలియార్ గారిని ఎరగని తమిళుడు ఎవడూ ఉండడు.

తమిళనాడులో నాటక యుగాన్ని స్థాపించిన వారు రావు బహదూర్ పమ్మల్ సంబంధం ముదలియార్ గారే :"

ఈ మాటలు ప్రముఖ విమర్శకులూ, సహృదయాలూ అయిన రసికమణి టి. కె చిదంబరనాద ముదలియార్ గారివి.

సుప్రసిద్ధ నటులుగా తమినాడంతటా చిరకీర్తి గడించిన టి కె షణ్ముగం గారు ఒకచోట ఇలా పేర్కొన్నారు :

"1891 లోనే అమెచ్యూర్ సభలు (ఔత్సాహిక నట సమూహం) ఏర్పడ్డాయి. పమ్మల్ సంబంధం ముదలియార్ చెన్నపట్టణంలో సుగుణ విలాస సభ (ఎస్. వి. ఎస్.) స్థాపించారు....ఆయన నాటకాన్ని ఒక వృత్తిగా స్వీకరించక, కళాభివృద్ధి అన్న లక్ష్యంతో నాటక కళకు ఒక ఉన్నతమైన స్థానం సమకూర్చారు. షేక్స్పియర్, కాళిదాసు ప్రభృతుల నాటకాలను అనువదించడమే కాక, ఆయన సుమారు ఎనభై కి పైగా స్వతంత్ర నాటకాలు కూడా వ్రాశారు. ఔత్సాహిక నటులూ, వృత్తి నటులూ—అందరూ ఆయన నాటకాలు ప్రదర్శించారు. 'మనోహరా' అనే ఆయన స్వతంత్ర నాటకం గడచిన 65 ఏండ్లుగా తమిళ రంగ స్థలంమీద ప్రదర్శించబడి అమరత్వం చెందిన రచనగా ప్రసిద్ధి కెక్కింది. శంకరదాసు స్వాముల్ని తమిళ నాటకాచార్యులుగాను, పమ్మల్ సంబంధం ముదలియార్‌ను తమిళ నాటక పితామహులుగాను తమిళ నాటక ప్రపంచం కీర్తిస్తున్నది."

## ధర్మవరం గురుదేవులు

తమిళ నాటక యుగ కర్త లనీ, తమిళ నాటక పితామహు లనీ కీర్తించ బడుతున్న సంబంధం ముదలియార్ ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలలో ఒకరు. అయితే - ముదలియార్ గారిని నాటకాల వైపు మళ్ళించిన కీర్తి ఆంధ్ర నాటక పితామహులైన ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారికే దక్కింది. ఆచార్యుల వారిని ముదలియార్ గారు 'నా గురుదేవుడు' అని ప్రశంసించారు. ఇక ముదలియార్ గారి మాటలనే అవధరించండి :

"1891 జూలై 1 వ తేదీన సుగుణ విలాస సభ స్థాపించాను. బళ్ళారి సభ పేరు సరస వినోదినీ సభ కదా! దాని పుటాక్షరాలు ఇంగ్లీషులో ఎస్ వి. ఎస్. అలాటి పుటాక్షరాలే ఉండవలెననే దృష్టితో సుగుణ విలాస సభ—ఎస్. వి. ఎస్.—అని నామకరణం చేసినాను, అంత వెర్రిభక్తి మా తా బళ్ళారి నాటక సభ పైన! సుగుణ విలాస సభలో నేను 63 సంవత్సరాలకు

పైగా నాటకాలు వ్రాసి, ప్రదర్శించాము. దీనికి దోవ చూపినవారు కృష్ణమాచార్యులు కాబట్టే వారిని నేను గురువుగా భావించాను...." (శ్రీ తిరుమల రామచంద్రగారి సంపాదకత్వాన వెలువడిన పరిశోధన పత్రికలో ప్రకటితమైన వ్యాసం : సంపుటి—1, సంచిక—5).

## అధ్వాన్న స్థితి

ముదలియార్ గారు నాటకరంగంలోకి దిగకముందు, తమిళ నాటకాల పరిస్థితి అధ్వాన్నంగా ఉండేది. తెరుక్కూత్తులు (వీధి నాటకాలు) బహుళ ప్రచారంలో ఉండేవి. అప్పట్లో 'హరిశ్చంద్ర', 'డంబాచారి విలాసం' వంటి రెండు మూడు నాటకాలు ఆడుతూ ఉండేవారు. కాని, అవి ముదలియార్ గారికి ఏ మాత్రమూ తృప్తి నివ్వలేదు. ధర్మవరం వారి నాటకాలు చూసిన తరువాతనే అటువంటి నాటకాలు తమిళంలో రచించి, వాటిని ప్రదర్శించాలనే ఆలోచన ఆయనకి కలిగింది. అలా కృతనిశ్చయులైన ముదలియార్ గారు 97 నాటకాలు సంతరించి, తమిళ నాటక వాఙ్మయాన్ని పరిపుష్టం చేశారు, స్వయంగా నటులై తమిళ రంగస్థలానికి వన్నె చిన్నెలు దిద్దారు.

## సంగీత పద్య నాటకాలు

ఆ రోజుల్లో తమిళ నాటకాలు పద్య మయములూ, సంగీత ప్రధానములూను. ముదలియార్ గారు తమ నాటకాలలో వచనమునకు ప్రాధాన్యమివ్వడమే కాక కొన్ని నాటకాలలో పద్యాలను పూర్తిగా పరిహరించారు. 'రత్నావళి', 'శాకుంతలం', 'మాళవికాగ్నిమిత్రం', 'విక్రమోర్వశీయం' మొదలైనవి సంస్కృత మాతృకలను అనుసరించి వ్రాశారు. అలాగే షేక్‌స్పియర్ నాటకాల ననుసరించి 'వెనీసు వర్తకన్', 'విరుంబియ విదమే' ('యాజ్ యు లైకిట్'), 'అమలాదిత్తన్', 'మగపతి' ('మాక్బెత్') మొదలైనవి వ్రాశారు. 'యయాతి' వంటి పౌరాణిక నాటకాలు కొన్ని

సంతరించారు. ఆయన నాటకాలలో 'లీలావతి', 'సులోచన', 'మనోహరా', 'సభాపతి' మొదలైనవి ఎంతో ప్రచారం గడించాయి. చివరిది హాస్యరస ప్రధానమైన నాటకం.

## జీవిత చరిత్ర

నాటక పితామహులైన సంబంధం ముదలియార్ 1873 లో ఫిబ్రవరి 1 న జన్మించారు. తండ్రి విజయరంగ ముదలియార్. ఆయన పాఠశాలల ఇన్‌స్పెక్టరుగా పని చేశారు. తల్లి మాణిక్యవేలు అమ్మాళ్. సంబంధం ముదలియార్ బి. ఏ., బి. ఎల్. డిగ్రీలు పొంది, న్యాయవాద వృత్తి స్వీకరించారు. ఆయన చదువు సంధ్యలు మదరాసులోనే సాగాయి. ఆయన స్మాల్ కాజ్ కోర్టు జడ్జిగా, ఛీఫ్ ప్రెసిడెన్సీ మాజిస్ట్రేట్‌గా పని చేశారు. అలా ఉన్నత పదవుల్లో ఉండి కూడా కూత్తాడిగళ్ (ఆటగాళ్ళు) అని పరిహాసించబడుతూ, సమాజంలో అంతగా గౌరవానికి నోచుకోని నటులతో కలిసి ముదలియార్‌గారు నాటకాలు ప్రదర్శించా రంటే, అది ఆయన నాటక కళాభిమానాన్ని సూచిస్తున్నది. ఆయనకి ఎనభై ఏళ్ళు నిండినప్పుడు ఒక సభ జరిగింది. అందులో మాట్లాడుతూ ఆయన ఇలా సెలవిచ్చారు: "నాకు మళ్ళీ జన్మ అంటూ వద్దు ఒకవేళ జన్మ కలిగితే, అదే తల్లిదండ్రులూ, అదే నాటక సమాజం, అదే మిత్రబృందం లభించాలి". కనుక సంబంధం ముదలియార్ గారికి నాటకా లంటే ఎంత ప్రగాఢమైన అభిమానమో మనం గ్రహించవచ్చు.

1928లో స్మాల్ కాజ్ కోర్టు జడ్జి పదవినుంచి విరమించినప్పుడు ముదలియార్ గారిని మళ్ళీ న్యాయవాద వృత్తి స్వీకరించవలసిందిగా మిత్రులు కోరితే, అందుకు ఆయన నిరాకరించారు. ధర్మవరం వారి కోరికను అను సరించి తన శేష జీవితాన్ని నాటక రచనకు వినియోగించారు. ఉద్యోగ విరమణకు తరవాతనే ఆయన 45 నాటకాలు వ్రాశారు. ఆయన రచించి ప్రదర్శించిన తొలి నాటకం 'పుష్పవల్లి' (1893). ఇవి కాక, 'నాటకమేడై

నివై వుగళ్' (నాటకరంగ స్మృతులు), 'నాటక త్తమిళ్' (నాటక తమిళం) అనే రెండు ప్రశస్త రచనలు కూడా చేశారు.

## బిరుద ప్రదానం

సంబంధం ముదలియార్ గారి ప్రతిభనూ, కళాసేవనూ నాటక సమాజముల వారే కాక, ప్రభుత్వము కూడా గుర్తించింది. 1916లో అప్పటి ఆంగ్ల ప్రభుత్వం ఆయన్ని 'రావు బహదూర్'తో గౌరవించగా, 1959 లో ఆయనకి "పద్మ భూషణ్" లభించింది. 1957లో మదరాసు కార్పొరేషను వారు గౌరవించారు.

నాటక కళకు జీవితాన్ని మీదుకట్టి, తమిళ నాటక పితామహులుగా అఖండ యశస్సు సముపార్జించిన సంబంధం ముదలియార్ గారు తమ 92వ యేట, అనగా 1964 సెప్టెంబర్ 24న స్వర్గస్థులైనారు.

## వాచకాలు కూర్చిన
## తొలి తమిళ విద్వాంసుడు
# కా. నమశ్శివాయ ముదలియార్

---

జననం : 20–2–1876; మరణం : 7–7–1937
ప్రధాన రచనలు : పృద్వీరాజన్ మొ. నాటకాలు.

ఆ రోజుల్లో (19వ శతాబ్దిచివరి పాదంలో) ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు పనికివచ్చే పుస్తకాలు కూడా పాశ్చాత్య పండితులే వ్రాసేవారు. అధికారులు పాశ్చాత్యులు. కాగా, ఆ పుస్తకాలనే అన్ని పాఠశాలల్లోనూ పాఠ్య పుస్తకాలుగా నిర్ణయించేవారు.

'విద్యార్థులకు అర్హమైన వాచకాలు నే నెందుకు సంతరించకూడదు ?' అని ఒక తమిళ పండితుడు అనుకున్నాడు. అనుకోవడ మేమిటి, అనుకున్నట్లు పుస్తక రచన సాగించడ మేమిటి – త్వరితగతిని జరిగిపోయాయి. పాశ్చాత్య పండితుల్లో ఒక సంచలనం బయలుదేరింది. ఆ తమిళ పండితుడు వ్రాసిన పుస్తకాలను ప్రభుత్వం అంగీకరించరా దని అధికారులను ఒత్తిడి చేశారు. ఆ పండితుడి ఉద్యోగానికి స్వస్తి చెప్పించా లని ప్రయత్నించారు. కాని ప్రత్యర్థుల కృషి నిష్ఫలమయింది. బాల బాలికల మనస్తత్వాన్ని చక్కగా అవగాహన చేసుకుని, ఆ యా తరగతులకు తగినట్లుగా సలక్షణమైన శైలిలో

చక్కని విషయాలు వ్రాయబడిన కారణాన్ని పురస్కరించుకుని అధికారులు ఆ తమిళ పండితుని పుస్తకాలను ఆమోదించారు వాటిని పాఠ్య పుస్తకాలుగా నిర్ణయించడంతో, ఆయనే కాక కాలక్రమాన ఇతరులు కూడా వాచకాలు వెలయించారు. అవి కూడా ప్రచారంలోకి వచ్చాయి.

ఆ తమిళ పండితుని పేరు కా. నమశ్శివాయ ముదలియారు. అప్పు డాయన మదరాసులోని యస్. పి. జి. హైస్కూలు (వేపేరి)లో ప్రధాన తమిళ పండిత పదవిలో ఉన్నాడు. ఆ పాఠశాలలో ఆయన పన్నెండు సంవత్సరాలు పని చేశారు. అంతకుముందు సెయింట్ జేవియర్స్, నార్త్‌విక్ బాలికా పాఠశాల మొదలైన పాఠశాలల్లో పని చేశారు. ఉపాధ్యాయ వృత్తిని చేపట్టడానికి పూర్వం ఆయన కొంతకాలం మదరాసు ఉన్నత న్యాయస్థానంలో ఉద్యోగం చేశారు.

నమశ్శివాయ ముదలియారు జన్మించింది ఒక ప్రసిద్ధ శైవ కుటుంబంలో. ఆయన నుదుట చందనపు బొట్టు కలకల లాడుతూ వుండేది. మతోన్మాది కాదు. స్నేహశీలి. తుదకు నాస్తిక భావాలు కలవారిపట్ల కూడా సౌజన్యం ప్రదర్శించిన విశాల హృదయు డాయన. ఉత్తరార్కాడు జిల్లాలోని కావేరిపాక్కం అనే గ్రామంలో నమశ్శివాయ ముదలియారు 1876 ఫిబ్రవరి 20 న జన్మించారు. తండ్రి రామస్వామి ముదలియారు; ఒక బడి పంతులు. తల్లి అఖిలాండేశ్వరి. పదిహేనవ యేటి దాకా నమశ్శివాయ తండ్రి వద్దనే విద్యాభ్యాసం చేశారు; నన్నెరి. వివేక చింతామణి మొదలైన గ్రంథాలు చదివారు.

ఆ తర్వాత ఆయన విద్యాభ్యాసం మదరాసులో సాగింది. ఉద్యోగాన్వేషియై ఆయన 1891 లో మదరాసు చేరుకున్నారు. బడి పంతులుగా జీవితంలో అడుగు పెట్టారు. ఆయనలోని విజ్ఞాన తృష్ణ పెల్లుబికింది. తత్ఫలితంగా ఆ నాళ్ళల్లో 'మహా విద్వాన్' అని కీర్తి గడించిన

యం. షణ్ముగం పిళ్ళైకి అంతేవాసి అయ్యారు. కష్టపడి సుమారు పన్నెం తమిళభాషా సాహిత్యాలు అధ్యయనం చేసి ప్రముఖ పండితు డని పేరు గడించారు. ఆయన ఉండేది తండియార్పేటలో; గురువు నివాసం మైలాపూరు. అంత దూరమూ నడిచి వెళ్ళి ఆయన విద్యాభ్యాసం చేశారు. శిష్యుడంటే గురువుకి వల్లమాలిన అభిమానం గురు నానతి ప్రకారం, నమశ్శివాయ ముదలియారు అపుత్రికుడైన తన గురువుకి శ్రద్ధగా అంత్యక్రియలు కూడా చేశారు. ఆ శైష్యోపాధ్యాయిక మాటల కందనిది ః

మదరాసు చరిత్రలో 1914 విస్మరించరాని సంవత్సరం. తీవ్ర ప్రతిఘటన మున్నా. ఆ యేడు ప్రత్యేకంగా విద్యార్థినులకోసం ప్రప్రథమంగా ఒక కళాశాల నెలకొల్పబడింది దాని పేరు క్వీన్ మేరీ కళాశాల. ఇందులో నియమితుడైన తొలి తమిళ పండితుడు నమశ్శివాయ ముదలియారు. శక్తి వంచన లేకుండా ఆ కళాశాలాభ్యున్నతికి గాను ఆయన కృషి చేశారు.

అనంతరం నమశ్శివాయ ముదలియారు రాజధానీ కళాశాలలో (ప్రెసిడెన్సీ కాలేజి) ప్రధాన తమిళ పండితుడుగా నియమితు లయ్యారు. ఆ రోజుల్లో ప్రాచ్యభాషల్లో ఆచార్య పదవి లేకున్నా, భాషా పండితుల వేతనం అత్యల్పమే అయినా, తన పాండిత్య గరిమ వల్లనూ, హుందాతనం గల నడత వల్లనూ తమిళ పండిత పదవికి పేరు పెంపులు సమకూర్చగలిగారు నమశ్శివాయ ముదలియారు. కన్నుల పండువు గొలిపే వేషధారణతో ఆయన కారులో కళాశాలకు వెళ్ళేవారట! అలా సొంత కారులో కాలేజీకి రాక పోకలు సాగించిన తొలి తమిళ పండితుడు ఆయనే అన్నా సాహసం కాదు.

ప్రచారం గడించిన పాఠ్యపుస్తకాల రచయితగానే కాక, కవిగా నాటక కర్తగా, వచన రచయితగా కూడా నమశ్శివాయ ముదలియారు పండితలోకంలో పేరు సంపాదించారు.

అళగై యి పిళ్ళై అర్పుత కోర్వై. తణిగై త్తవప్పయన్ మలర్, గుణవాన్ తన్ కుట్రం ఉణర్వాన్—మొదలైనవి ఆయన కవితలు. మనోహర మైన శైలి వీటిలో అందాలు దిద్దుకుంది.

కీచకన్, పృద్వీరాజన్ అనే రెండు నాటకాలు నమశ్శివాయ ముదలి యార్ రచించారు. ఈ రెండూ ప్రశస్త రచన లని ఆనాటి తమిళ విద్వాంసులు ప్రశంసించారు. పాత్ర పోషణకు ఆయన ప్రాధాన్య మిచ్చారు. షేక్స్పియర్ నాటకాలలోని దుష్టపాత్ర (విలన్) వలె కీచకుడు కనిపిస్తాడనీ, రచయిత సహజమైన, సరళమూ, సుస్పష్టమూ అయిన శైలిలో నాటకం సాగిందనీ ఏ. సి ప్రణతార్తిహర అయ్యరు పేర్కొన్నారు.

1910 లో యస్. యస్. యల్. సి. కి ఉపవాచకంగా నిర్ణయించబడిన పృద్వీరాజన్ యల్. డి. సామికణ్ణు పిళ్ళైవంటి మేధావులను ఆకర్షించింది. నూతన ప్రపంచానికి సంబంధించిన విషయాలను పాతవడ్డ మాటలలో చెప్ప డానికి ప్రయత్నించి పాతకాలపు తమిళ పండితులు పొరపాటు చేశారనీ, నమశ్శివాయ ముదలియారు నవ్య విషయాలకు అర్హమైన భాషను వాడడంలో కృతకృత్యులయినా రనీ ఆయన పేర్కొన్నారు. కాగా, నమశ్శివాయ ముదలి యారు ఆధునిక దృష్టి కల పండితు డనడం సత్య సన్నిహితం.

ఆయన విద్యార్థుల్ని ఉద్దేశించి కొన్ని నాటికలు కూడా సంతరించారు. ఆ కోవకు చెందిన పది నాటికలు 'నాటక మంజరి' అనే పేరుతో పుస్తకంగా వెలువడ్డాయి ఈ సందర్భంగా 1919 లో వెలువడిన 'గౌరి' నాటకం పేర్కొనదగింది. సెల్వముత్తు అనే యువకుడు మేనరికానికి సమ్మతించ కుండా పార్వతి అనే ఒక రైతు కూతురుని ప్రేమిస్తాడు. అందువల్ల తండ్రీ కొడుకులకు అభిప్రాయ భేదాలు ఏర్పడతాయి. అయినా సరే, సెల్వముత్తు తన భార్యతో సంసారం సాగిస్తాడు, కష్టాలు ఎదుర్కొంటూ. వాళ్లకి ఒక

పిల్లవాడు పుడతాడు. ఇంతలో సెల్వముత్తు కాలధర్మం చెందుతాడు. కాని అతని తండ్రి మనస్సు మాత్రం మారలేదు. ఆ పరిస్థితిలో సెల్వముత్తు వివాహం చేసుకోడానికి నిరాకరించిన గౌరి (మేనత్తకూతురు) రంగంలో ప్రవేశిస్తుంది. ఆమె కృషివల్ల, సెల్వముత్తు తండ్రి చివరికి కోడలినీ, మనుమణ్ణీ తనతో పాటు ఉండడానికి అంగీకరిస్తాడు. అలా చెదిరిపోయిన కుటుంబం గౌరి వల్ల ఏకం కాగలుగుతుంది. ఆ రోజుల్లో ఇటువంటి నాటిక తమిళంలో వెలువడడం గమనింపదగిన అంశం.

నమశ్శివాయ ముదలియార్ విద్యార్థుల ఉపయోగార్థం పెక్కు వచన రచనలు చేశారు. కణ్ణప్పన్, కుచేలన్, హరిశ్చంద్రన్, నలన్, కంబర్ - చోళర్ మొదలైనవి వాటిలో కొన్ని సలక్షణమైన శైలి, స్పష్టత - ఈ రెండూ ఆయన రచనకు పెట్టని భూషణాలు పైగా ఆయన సంవాదాత్మక శైలిని రచనలో ప్రవేశపెట్టారు. ప్రముఖ ప్రాచీన కవయిత్రి అవ్వైయార్ రచించిన ఆత్తిచ్చూడి, వాక్కుండాం, నల్వళి మొదలయిన లఘు కృతులు ఆయన ప్రచురించారు. సుప్రసిద్ధ లక్షణ కృతి అయిన తొల్కాప్పియమును సవ్యాఖ్యానంగా ప్రచురించారు. ఆయన ఆంగ్లంనుంచి ఒకటి రెండు అనువాదాలు కూడా చేశారు.

అయిదవ జార్జి రాజు 1911 లో మన దేశం సంచరించినప్పుడు నమశ్శివాయ ముదలియారు కమల బంధం ఒకటి వ్రాసి పంపించారు. దానిని ముప్పయి వేల ప్రతులు అచ్చు వేశారనీ, ఒక ప్రతి లండన్‌లోని ఇండియా ఆఫీసులో భద్రపరచబడిందనీ తెలియవస్తున్నది.

ఆయన 'జన వినోదిని' అనే ఒక మాస పత్రికను నిర్వహించారు ఉపాధ్యాయుల్ని ఉద్దేశించి 'నల్లాసిరియన్' (ఆదర్శ ఉపాధ్యాయుడు) అనే పత్రికను పదిహేను సంవత్సరాలు నడిపారు. దానికి ఆయనే సంపాదకుడూ, ప్రచురణ కర్తాను. ఉపాధ్యాయుల కంటూ ప్రత్యేక పత్రిక లేని ఆ నాళ్ళలో

అలా ఒక పత్రికను పది సంవత్సరాలు నిర్వహించడం ముదలియారుగారి నవీన దృష్టికీ, కార్యదీక్షకూ నిదర్శనం.

నమశ్శివాయ ముదలియారు సుమారు పదిహేను సంవత్సరాలు మదరాసు విశ్వవిద్యాలయంలో తమిళ పాఠ్య విషయాల బోర్డుకి అధ్యక్షులుగా ఉండేవారు. ఆయన పదవీకాలంలోనే కేవలం తమిళంలో విద్వాన్ పరీక్ష వెలుగులోకి వచ్చింది అంతకు ముందు, అంటే 1925 దాకా - తమిళ విద్వాన్ పరీక్షలో కృతార్థత పొందాలంటే సంస్కృతంలోనూ పరిచయం సంపాదించి వుండాలి. అందువల్ల పెక్కు తమిళ భాషాభిమానులు తమిళ విద్వాన్ పరీక్షకు కూర్చోలేకపోయేవారు. ఈ పరిస్థితిని తొలగించి కేవల తమిళ విద్వాన్ పరీక్షను ప్రవేశపెట్టిన ఘనత ముదలియారుకి చెందుతుంది.

మరొక ఘనత కూడా ఆయనకి చెందుతుంది. ఈనాడు తమిళ నాడంతటా పొంగల్ రోజుని (సంక్రాంతి) తమిళ పండుగగా, తిరువళ్లువర్ పండుగగా కొనియాడుతున్నారు కాని యీ సంప్రదాయం మొదట్లో లేదు. ఈ నూతన సంప్రదాయానికి శ్రీకారం చుట్టినవాడు నమశ్శివాయ ముదలియారే. పొంగల్ రోజున ఆయన ప్రముఖ పండితుల్ని ఒక వేదికమీద సమావేశ పరిచి, వారిచేత తిరుక్కురళను గురించి ఉపన్యాసాలు ఇప్పించేవాడు. పొంగల్ శుభాకాంక్షలు పంపే సంప్రదాయాన్ని ప్రవేశ పెట్టినదీ ముదలియారు గారే అని చెబుతారు.

ఇక వ్యక్తిగా ఆయన్ని గురించి చెప్పవలసింది చాలా ఉంది. పండితుడే అయినా ఆయన పెద్దలకూ పిన్నలకూ పనికివచ్చేలా పుస్తక రచన చేశారు. ఎంత ప్రాచీనుడో అంత నవీనుడు. ఆయన యింట్లో ఫోను కూడా ఉండేది. స్నేహశీలి; పరోపకారి ఆర్తులకు సహాయం చేసేవాడు.

నమశ్శివాయ ముదలియారు మదరాసుకి వచ్చినప్పుడు అనామకుడు. చివరికి పండితుడుగా, రచయితగా, ఉపాధ్యాయుడుగా పేరు గడించారు. అలాగే మొదట్లో ఆయన ధనికుడు కాదు. కాని కాల క్రమాన ఆయన బాగా ఆర్జించారు. ఆర్జించినంత విరివిగా ఖర్చు పెట్టారు కూడా. ధనికుడైనా నమ్రతను విస్మరించలేదు. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడుగా జీవితంలో అడుగుపెట్టి గౌరవ కారణంగా భావించబడే మదరాసు రాజధానీ కళాశాలలో పండిత పదవిని అలంకరించారు. ఈ విషయాదికం ఆశ్చర్యావహమే కాక అద్భుతావహం కూడా.

స్వయం కృషితో అలా ఒక్కొక్క మెట్టుగా పైకి వచ్చిన నమశ్శివాయ ముదలియారు తమ 61 వ యేట 1937 లో కాలధర్మం చెందారు.

# శైవ సిద్ధాంత విద్వాంసుడు
# మరైమలై అడిగళ్

జననం : 15-7-1876; మరణం : ?-?-1950

ప్రధాన రచనలు : కోకిలాంబాళ్ కడిదంగళ్ మొ.

"ఆయన పుస్తకాలు వెయ్యి మందిని ఆలోచింపజేస్తాయి; పది వేల నాలుకల్ని మాట్లాడేటట్లు పురిగొల్పుతాయి; కనీసం వంద కలాలను వ్రాసే టట్లు చేస్తాయి." అని ఇంగ్లీషులో తమిళ సాహిత్య చరిత్రను వ్రాసిన ఎం. ఎస్ పూర లింగం పిళ్లై అనే సహృదయుడు పేర్కొన్నాడు.

ఈ మాటలు మరైమలై అడిగళ్ అనే ప్రసిద్ధ తమిళ పండితుని ఉద్దేశించి చెప్పబడినవి.

**జననాదులు**

నాగపట్టణంలో 1876 జూలై 15 న జన్మించిన మరైమలై అడిగల్ ప్రముఖ రచయిత, ప్రసిద్ధ వక్త, ఉత్తమ దేశికుడు. పత్రికా సంపాదకుడు కూడా. శైవ సిద్ధాంత విద్వాంసుడు. ఒక్క మాటలో చెప్పాలంటే తమిళ

సాహిత్య సాంస్కృతిక పునరుజ్జీవనానికి నిర్విరామంగా కృషి చేసిన పెద్దలలో ప్రముఖులు మరైమలై అడిగళ్. కాని తల్లిదండ్రులు ఆయనకి పెట్టిన పేరు వేదాచలం. తండ్రి చొక్కలింగం పిళ్లై, తల్లి చిన్నమ్మె.

## వేదాచలం

వేదాచలం చిన్ననాటి చదువు సంధ్యలు నాగపట్టణంలోని వెస్లియన్ మిషన్ స్కూలులో ప్రారంభమైనాయి. విద్యార్థి దశలోనే ఆయన కుశాగ్ర బుద్ధి బయల్పడసాగింది. కాని ఆయన పదవయేట తండ్రి మరణించడంతో స్కూలు చదువుకి అంతరాయం కలిగింది. ఆ తర్వాత ఆయన ఏడు సంవత్స రాలలో చదవవలసిన తమిళ గ్రంథము లన్నీ నారాయణస్వామి పిళ్లై వద్ద చదివి, జీర్ణించుకున్నారు. లక్ష్య లక్షణాలలో పాండిత్యం గడించారు. తొల్కాప్పియం తిరుక్కురల్, తేవారం మొదలైన గ్రంథాలు ఆయనకి హృద్గతములయినాయి. ఆయనది గొప్ప జ్ఞాపక శక్తి. ఆయన పాండిత్యం సుందరం పిళ్లై వంటి ప్రముఖ విద్వాంసుల్ని బహుధా ఆకర్షించింది.

## ఉపాధ్యాయ వృత్తి

ఆ తర్వాత ఉపాధ్యాయ వృత్తి. మూడు నెలలపాటు తిరువనంతపురం లోని ఒక ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడుగా చేరారు. అనారోగ్యంవల్ల ఆయన నాగపట్టణం చేరుకోవలసివచ్చింది. అది ఆయన మంచికే జరిగింది.

## శైవ సిద్ధాంతం

ఆ రోజుల్లో సోమసుందర నాయకర్ అనే ఆయన శైవ సిద్ధాంతం గురించి నాగపట్టణంలో ఉపన్యాసాలు చేస్తూ ఉండేవారు. వాటిని విన్న వేదా చలం హృదయంలో వేదాంత బీజం పడింది. అది రోజులు గడవను గడవను మొలకెత్తి పెరిగి పెద్దదయింది. తత్ఫలితంగా ఆయన సన్న్యాసం స్వీకరించి,

స్వామి వేదాచలం అయినారు. తరువాత కాలంలో ఆయన శుద్ధ ద్రావిడ వాదిగా మారి, తన పేరును కూడా తమిళంలోకి మార్చుకున్నారు. ఆ నాటి నుంచీ మరైమలై అడిగళ్ అన్నదే ఆయన వ్యవహార నామం అయింది. మరైమలై అనగా వేదాచలం, అడిగళ్ అనగా స్వామి.

'సిద్ధాంత దీపిక' అనే పత్రికకు సంపాదకత్వం వహించడానికి ఆయన మదరాసు వచ్చారు. 898 లో మదరాసు క్రైస్తవ కళాశాలలో తమిళంలో ఉపన్యాసకులుగా చేరారు. ఉత్తమ దేశికుడని పేరు సంపాదించారు. ఆంగ్ల గ్రంథాలు ఎన్నో చదివి ఆ సాహిత్యంలోనూ నిష్ణాతులనిపించుకున్నారు. అడిసన్, మెకాలే మొదలైన పాశ్చాత్య విమర్శకుల పథంలో పయనించి, ఆయన ప్రాచీన తమిళ కావ్య పరిశీలన చేయసాగారు. ముల్లైప్పాట్టుకీ, పట్టిన ప్పాలైకీ ఆయన వ్రాసిన విమర్శనాత్మక వ్యాఖ్యలు విద్యార్థుల్ని సైతం ఆకర్షించాయి. ఆ వ్యాఖ్యలు విద్యార్థుల ఆర్థిక సహాయంతోనే వెలుగు చూడగలిగాయి! తమిళసాహిత్య లోకంలో పేరుపెంపులు గడించుకున్న సోమసుందర భారతి, రసిక మణి టి. కె. సి., ఎస్. వైయాపురి పిళ్లై ప్రభృతులు ఆయన శిష్యులే!

## మహావక్త

మరైమలై అడిగళ్ మహావక్త. ఇరవయ్యవ ఏట ఆయన నాటకాలను గురించి తిరువనంతపురంలో ఎండోమెంటు ఉపన్యాసాలు ఇచ్చారు. పరిశోధన, పాండిత్యం—ఈ రెండూ ఆయన వాగ్ధాటికి పుష్టి కలిగించాయి. మరైమలై అడిగళ్ ప్రసంగం అరగంట సేపు వింటే కళలు వెయ్యి నేర్చిన పెట్టు అని ఒక సహృదయుడు పేర్కొన్నాడు. ఆయన ఉపన్యాసాలు ఆషామాషీగా ఉండేవి కావు. వివిధ విషయాలు క్షుణ్ణంగా చదివి ఆ తర్వాతే ఆయన ప్రసంగించేవాడు. నిజం చెప్పాలంటే, ఆయన పుస్తకాలకు మాతృకలు సమావేశాలలో ఆయన చేసిన ప్రసంగాలే! ఇక్కడ మరైమలై

అడిగళ్ శైలిని గురించి రెండు మాటలు చెప్పడం అవసరం. ఆయన శైలి లలిత సుందరం. కాని శుద్ధ ద్రావిడవాది అయిన తరువాత ఆయన శైలిలో మారుమూల మాటలు చోటు చేసుకో సాగాయి. అందువల్ల, ఆయన భాష నేటి వారికి జటిలంగా కనిపించడంలో వింత లేదు. కాని అవి కేవల భాషా ప్రియులకు గోరు ముద్దలు !

## శుద్ధ ద్రావిడవాది

మరైమలై అడిగళ్ శుద్ధ ద్రావిడవాది అనడంవల్ల, ఆయనది వెర్రి తలలు వేసిన స్వభాషాభిమానం అని కాని, ఆయన ఇతర భాషల్ని ద్వేషించి నట్లు కాని భావించినట్లయితే అది సత్యం కాదు. ఆయన సంస్కృతాంగ్ల భాషలలో నిష్ణాతుడు. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలాన్ని ఆయన తమిళం చేశారు. నేటికీ ఈ అనువాదం ప్రశస్తమైనదిగా భావించబడుతున్నది. షేక్‌స్పియర్ నాటక విమర్శలు చదివిన ఫలితంగా కాళిదాసు కవీంద్రుని నాటక శిల్పం గురించి తులనాత్మక దృష్టితో విమర్శక గ్రంథం ఒకటి వెలయించాలనే ఊహ ఆయనకి కలిగింది. అలాగే ఆయన ఉత్తమ విమర్శ వెలయించారు. మరి ఇంగ్లీషు భాషా సాహిత్యాలంటే ఆయనకు గల గౌరవం అపారం. ముఖ్యంగా ఆంగ్ల రచయితల విమర్శన పద్ధతులు ఆయనకు బాగా నచ్చాయి. అడిసన్ వ్యాసాలను చింతనైక్కట్టురైగళ్ అనే పేరుతో తమిళులకు అంద జేశారు. రెయ్‌నాల్డ్ వ్రాసిన శైలిని అనుకరిస్తూ కుముదవల్లి అనే నవల సంతరించారు. అలాగే 'ది సోల్జర్స్‌వైఫ్'ని కూడా తమిళ పాఠకులకు పరిచయం కావించారు. ఆయన సొంత గ్రంథాలయంలో నాలుగు వేల పుస్తకాలు ఉండేవట! వాటిలో మూడు వేలు ఆంగ్లం; చెరి అయిదు వందలూ సంస్కృతం, తమిళం, కనుక ఆయన బహు భాషాభిమానానికి ఇది నిదర్శనం.

అయితే - 1916 నుంచీ మరైమలై అడిగళ్ శుద్ధ ద్రావిడవాది అయినారు. అయినప్పటికీ, తమిళంలో లేనటువంటి ఇతర భాషా శబ్దాలను

యథాతథంగా స్వీకరించ వచ్చు ననీ, అవి తమిళ వ్యాకరణ నియమాలను గాని తమిళ స్వరూపాన్ని కాని చెడగొట్టేవిగా ఉండకూడ దనీ ఆయన అభిప్రాయం. ఆయన ప్రారంభించిన ఉద్యమం ఆ రోజుల్లో ప్రతిఘటనను ఎదుర్కొనక పోలేదు. ఈ ఉద్యమం ఫలితంగా, అంతవరకూ సంస్కృత శబ్దాలు ఉపయోగిస్తూ ఉండిన మరైమలై అడిగళ్ వాటిని పరిహరించారు 1902 లో ఆయన 'జ్ఞాన సాగరం' అనే పత్రిక స్థాపించారు. తమిళభాషాభివృద్ధికీ, శైవమత విజ్ఞాన వ్యాప్తికీ ఆ పత్రిక ఎంతగానో కృషి చేసింది. తన పేరును తమిళం చేసుకొన డంతో పాటు ఆయన ఈ పత్రికను కూడా 'అరివు క్కడల్' అని మార్చారు. 1908 లో 'ది వోరియంటల్ మిస్టిక్మైనా, అనే ఆంగ్ల పత్రికను స్థాపించారు. మతం, వేదాంతం, ఆధ్యాత్మిక చింతన, యోగం, చరిత్ర మొదలైన వివిధ విషయాలకు సంబంధించిన రచనలు ఇందులో ప్రధానంగా చోటు చేసుకునేవి. ఆ తరవాత 'వోషన్ ఆఫ్ విజ్డం' అనే మరొక ఆంగ్ల పత్రికను స్థాపించారు. నాటకం, నవల, శైవ సిద్ధాంతం, వ్యాసం మొదలైన వాటిని గురించి ఇందులో ఆయన అమూల్యములైన రచనలు చేశారు.

మరైమలై అడిగళ్ సుమారు అరవైకి పైగా రచనలు చేశారు. పరిశోధన, సాహిత్యం, మతం - అని వాటిని స్థూలంగా విభజించవచ్చు. వాటిని మళ్లీ సాహిత్య విమర్శ, సామాన్య వ్యాసం, కథానిక, నవల నాటకం. అనువాదం, వ్యాఖ్య, కవిత, శాస్త్ర రచన అని విభజించవచ్చు చరిత్ర, పురావస్తు తత్త్వం, తులనాత్మక వేదాంతం, శాసనాలు మొదలైన వాటితో కూడా ఆయనకి పరిచయం బాగా ఉండేది మాణిక్య వాచకర్, శైవ సిద్ధాంత జ్ఞాన బోధం మొదలైనవి మత విషయక రచనలు కోకిలాంబాళ్ కడిదంగళ్ ఆయన మౌలిక నవల. ఆయన కవి కూడా. ఆయన తొలి రచన 'తిరువొట్రి యూర్ ముమ్మణిక్కోలై' అనే కావ్యం. అది ఆయన ఇరవయ్యవ యేట వెలువడింది ఆ తరువాత తన ఆధ్యాత్మిక గురువు నాయకరుని గురించి కావ్యం వ్రాశారు. ఆయన దృష్టిలో వచన రచనకంటె కావ్య రచనే

సులభం. ఎందు కనగా పిలిస్తే ఆయనకి కవిత పలికేది। ఆయన ప్రతి రచనలోనూ సాధారణంగా ఇంగ్లీషు ఉపోద్ఘాతం ఉంటుంది. ఆ రోజుల్లో ఆయన రచనలు వాగా అమ్ముడు పోయేవి. తన సొంత గ్రంథాలయాన్ని ఆయన తమిళులకు అందజేశారు. ప్రస్తుతం అది మదరాసులో మరైమలై అడిగళ్ గ్రంథాలయం అనే పేరుతో వ్యవహృత మవుతున్నది. అమూల్యము లైన తమిళ రచనలకు ఇది కాణాచి. ఒక అర్ధ శతాబ్దిపాటు ఆయన డైరీ కూడా వ్రాశారు. బహుముఖమైన ఆయన దైనందిన వ్యాసంగాన్ని అవగాహన చేసుకునేందు కిది ఎంతగానో తోడ్పడుతున్నది.

ప్రముఖ భక్తకవి అయిన జ్యోతి రామలింగస్వామిని మరైమలై అడిగళ్ అనుసరించారు. ఆయన సమరస సన్మార్గ నిలయం స్థాపించి, జీవకారుణ్య ప్రాధాన్యాన్నీ సర్వమానవ సౌభ్రాత్రమునూ ఉద్బోధించారు. బీదవారికి అన్నదానం చేయడం, జీవహింసను నిరోధించడం, మాంసాహారం విసర్జించడం, భగవంతుడు ఒక్క డని నమ్మడం—ఈ నిలయం లక్ష్యాలు. శ్రీలంకలో పర్యటించినప్పుడు ఆర్జించిన ధనాన్ని వినియోగించి, ఆయన తిరుమురుగన్ అచ్చుకూటం స్థాపించారు. శైవ సిద్ధాంత మహా సమాజమును కూడా స్థాపించారు. ఈ సమాజం తాలూకు శాఖలు తమిళనాడులో పలుచోట్ల తరువాతి కాలంలో వెలిశాయి. ఒక తమిళ విశ్వ విద్యాలయం కూడా స్థాపించా లని ఆయన ఆశించారు. వితంతు వివాహాలను సమర్థించారు. కులాంతర వివాహాలను ప్రోత్సహించారు. ప్రకృతి వైద్యంపట్ల ఆయనకి ప్రగాఢమైన అభిమానం. ఆ విషయమై ఆయన రచించిన గ్రంథాలు ఇందుకు నిదర్శనం.

1950 లో సిద్ధిపొందిన మరైమలై అడిగళ్ ఒక ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతగా, శైవ సిద్ధాంత ప్రవర్తకుడుగా పది కాలాలపాటు నిలిచి

ఉంటా రనడంలో సందేహం లేదు. తమిళ సంస్కృతి యెడల ఆయనకి గల అభిమానం నిరుపమానం. సింధు నాగరకత ప్రాచీన ద్రావిడ నాగరికత అని ఆయన నిశ్చితాభిప్రాయం. శుద్ధ ద్రావిడ వాదమును ప్రారంభించిన అడిగళ్ హిందీని నిర్బంధ పాఠ్యాంశముగా చేయడాన్ని తీవ్రంగా విమర్శించారు. ఆ విషయం గురించి ఒక పుస్తకం కూడా వెలయించారు.

కృతజ్ఞతా గుణం కల తమిళులు మరై మలై అడిగళ్ శత వార్షిక జయంతిని 1976 లో ఘనంగా జరుపుకున్నారు. ఆయన స్వస్థలమైన నాగపట్టణంలో ఆయన నిలువెత్తు శిలా విగ్రహం ఆవిష్కరించబడింది. సభలూ, సమావేశాలతో పాటు మంచి మంచి వ్యాసాలు కల ప్రత్యేక సంచికలు ప్రచురించ బడ్డాయి. మదరాసులోని మార్మలాంగ్ బ్రిడ్జికి మరై మలై అడిగళ్ బ్రిడ్జి అని పేరు పెటారు. ఆయన పేరుతో వ్యవహృత మవుతున్న గ్రంథాలయం సాహిత్య జిజ్ఞాసువుల కందరికీ యాత్రాస్థలం వంటిది.

కవిమణి

# దేశిక వినాయకం పిళ్లై

---

జననం: 7-7-1876; మరణం: 16-9-1954

ప్రధాన రచనలు: ఆసియా జ్యోతి మొ. కావ్యాలు.

పాత కొత్తల మేలి కలయికకు ప్రబలోదాహరణంగా దేశిక వినాయకం పిళ్లై రచనలను పేర్కొనవచ్చు. ప్రాచీనతను గౌరవించినా, ఆయన నవ్యతను నిరసించలేదు. భారతి అనుయాయులలో ఆయన ప్రముఖుడు. దేశిక వినాయకం పిళ్లై కవితలో ప్రశాంతతా, మాధుర్యమూ ప్రముఖంగా కానవస్తాయి. పెద్దలకూ, పిన్నలకూ పనికివచ్చే కవితలు ఎన్నో ఆయన లేఖిని నుంచి వెలువడ్డాయి

కవిమణిగా పేరు పెంపులు గడించిన దేశిక వినాయకం పిళ్లై కన్యాకుమారి జిల్లాలోని తేరూర్ అనే గ్రామంలో 1876 జూలైలో జన్మించారు. తండ్రి శివతాణు పిళ్లై. తల్లి ఆదిలక్ష్మి. 1954 సెప్టెంబరు 16 న ఆయన కాలధర్మం చెందారు.

వినాయకం పిళ్లైకి తమిళ భాషాభిమానం ఉగ్గుతో పెట్టిన విద్య. అలాగే ఆయనకి దైవభక్తి కూడా సహజంగా అలవడింది. తొమ్మిదవ ఏట శివదీక్ష స్వీకరించాడు. అయితే, ఎంత దైవభక్తి ఉన్నా, ఆయనది మూఢభక్తి మాత్రం కాదు. హృదయస్థుడైన ఆ పరమాత్మను సందర్శించ గలిగితే, ఆలయంలో నెలకొన్న దైవమును కూడా సందర్శించవచ్చునని ఆయన అభిప్రాయం. 'ఆలయ సేవనము' అనే కవితలో ఆయన అభిప్రాయాలు కొన్ని బహిర్గతములైనాయి. పరిశీలించండి :

"ఆలయమంతా చూచితి ఉన్నత
గోపురమూ ఎక్కి చూచితి.
ఆ దేవదేవుని మాత్రం
వెదకినా చూడనైతిని.
శిల్పము లెన్నో చూచితి
చిత్రము లెన్నో చూచితి.
ఆ అద్భుతమూర్తిని మాత్రం
అక్కడెక్కడా చూడనైతిని.
ధూపం వేయుట చూచితి
దీపం చూపుట చూచితి.
ఆ ఆపద్బాంధవుని మాత్రం
అక్కడ నేను చూడనైతిని
కంటితో సొగసులు చూస్తూ
మనస్సుని అడవికి మళ్ళిస్తూ
కావించే పూజల వల్ల లాభం
కాసంత కూడా లేదు.
గుండెలలో నెలకొన్నాడు - గుర్తించాలి దీనిని మనం
గుండెలో చూడగలిగితే గుడిలోనూ చూడవచ్చు !

## నిరాడంబరత

దేశిక వినాయకం పిళ్లై జీవితంలో పేర్కొనదగిన సంఘటనలు లేవు. తిరువనంతపురం కళాశాలలో ఎఫ్. ఏ. చదివిన తరువాత ఆయన ఒక ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించారు. చివరికి తిరువనంతపురం మహారాజా కళాశాలలో తమిళ పండితుడుగా పని చేస్తూ, 1931 లో అధ్యాపక వృత్తినుంచి విరమించుకున్నారు. అనంతరం ఒక గ్రామంలో ప్రశాంత జీవనం గడపసాగారు. కాగా, ఆయన నిరాడంబరమైన ఆకృతి వలె, ఆయన జీవితమూ నిరాడంబరంగా సాగిం దని చెప్పడం నిర్వివాదం. ప్రశంస లన్నా, ప్రచార మన్నా ఆయనకి నచ్చేది కాదు. సభలలో పాల్గొనడం కూడా ఆయన అభిమతానికి విరుద్ధం. అటువంటి మనస్తత్వం దేశిక వినాయకం పిళ్లైది. ఈ క్రింది ముచ్చట ఈ విషయాన్ని వ్యక్తం చేస్తున్నది.

ఆయన మిత్రులు కొందరు ఆయన వ్రాసిన కొన్ని రచనలను ఒక సాహిత్య సంస్థకు పంపించారు బహుమతి కోసం. అనంతరం ఆ విషయం ఆయనకి తెలిసింది. 'బహుమతుల కోసమా నేను రచన చేశాను ? పైగా ఈ వయస్సులో నా కెందు కీ బహుమతులు ?' అనుకుని ఆయన బహుమతి నిర్ణాయక సంఘంలోని సభ్యుల కందరికీ 'నారచనలను బహుమతి కోసం పరిశీలించకండి' అంటూ ఉత్తరాలు వ్రాశాడు. ఆ ఏడు ఆయనకి బహుమతి లభించక పోయినప్పటికీ, మరణానంతరం దేశిక వినాయకం పిళ్లై రెండు రచనలకు బహుమతులు లభించాయి.

దేశిక వినాయకం పిళ్లై ఎన్నో కవితలూ, కీర్తనలూ వెలయించారు. అళగమ్మై విరుత్తం ప్రాచీన కవితా ధోరణిలో సాగిన రచన. ప్రకృతిని గురించి ప్రశంసా పూర్వకమైన రచన చేసినా, పరమాత్మని గురించి భక్తి

రస ప్లావితమైన రచన కావించినా, ఆయన నలుగురికీ తెలిసే సులభ సుందర మైన భాషలో వ్రాశారు. భాష ఎంత జటిలంగా ఉంటే అంత ప్రముఖమైన రచన అని భావించే ఆ నాళ్ళలో దేశిక వినాయకం పిళ్లై పిన్నలకూ, పెద్దలకూ గ్రాహ్యమయ్యే రచనలు సంతరించడం నిజంగా పేర్కొనదగిన అంశం. ఇదే ఆయన రచనలలోని విశిష్టత. ఈ కోవకు చెందిన రచనలు చేసిన రచయితలు ఆ రోజులలో చాలామంది కనిపించరు.

దేశిక వినాయకం పిళ్లైకి ప్రగాఢమైన తమిళ భాషాభిమాన మున్నా, ఆ భాషాభిమానం అన్య భాషాధ్యయనానికి అవరోధం కాలేదు ఆయన ఇంగ్లీషు లోని ఎడ్విన్ ఆర్నాల్డ్ కృషి అయిన 'లైట్ ఆఫ్ ఏషియా'ను అనుసరించి 'ఆసియా (జ్యోతి)' అనే చక్కని తమిళ కావ్యం వెలయించారు. అలాగే, ఎడ్వర్డ్ ఫిట్జ్‌గెరాల్డ్ కృతిని ఆధారం చేసుకని ఉమర్ ఖయ్యాం గీతాలను తమిళ పాఠకలోకానికి పరిచయం చేశారు. అయితే, ఆయన రచనను చదువుతుంటే అది కొన్ని చోట్ల కొంచెం స్వతంత్రంగా సాగినట్లు స్థూలదృష్టికి కూడా తెలియ వస్తుంది. ఈ కింది గీతం అందుకు తార్కాణ:

"ఎండకు తగిన పీడ కలదు
    వీచే తెమ్మెర కలదు
చేత కంబన్ కవిత కలదు
    పాత్ర నిండుగ మధువు కలదు
దైవస్తుతు లెన్నో కలవు
    తెలిసి పాడ నీవు కలవు
సుందర దృశ్యాలు కలవు—ఇది కాక
    స్వర్గ మొకటి వేరే కలదా ?"

## బాల సాహిత్యం

ఇవి కాక మరి కొన్ని తమిళసేతలు ఆయన లేఖిని నుంచి వెలువడ్డాయి. భారతిలా పల్లె పాటల వరసల్లో ఆయన కొన్ని పాటలు వ్రాశారు. చారిత్రక వ్యాసాలు కూడా కొన్ని సంతరించారు.

భారతికి తరవాత బాల సాహిత్యంలో కృషి చేసిన ఆ నాటి పెద్దలలో దేశిక వినాయకం పిళ్లై ప్రముఖుడు. బాల బాలికల్ని ఉద్దేశించి సలక్షణమైన తమిళంలో ఆయన ఎన్నో పాటలూ, పద్యాలూ వెలయించారు. వాటిలో కూడా ఆయన సరళ హృదయం వ్యక్త మవుతుంది.

'కాకి' అన్న ఈ చిన్ని గేయంలో ఆయన భావ సంపద రూపు దాల్చిన వైనం పరిశీలించండి :

కాకీ ! కాకీ ! ఎగురుచు రావే !
కళ్ళకి కాటుక తీసుకు రావే !
కోడీ ! కోడీ ! కూయుచు రావే !
పాపకి పూలూ తీసుకు రావే !
ఆవూ! ఆవూ! వెంటనె రావే !
పాపకి పాలూ తీసుకు రావే !

నల్లని కాటుక అనడానికి బదులుగా ఇక్కడ కాకి ప్రయుక్తం. అలాగే ఎర్రని పూలకు మారుగా తల మీద ఎర్రని జుట్టు కల కోడిపుంజు వాడ బడింది. ఆరోగ్య మొసగే పాలు అనడానికి గోమాత శబ్దం ప్రయోగించబడింది. ఈ విధంగా దేశిక వినాయకం పిళ్ళై అర్థవంతములైన గేయములు పిల్లల కోసం వెలయించారు. ఇవి నేటికీ ప్రచారంలో ఉండడం గమనించ దగిన విషయం.

మహిళను సగౌరవంగా చూడా లనీ, మహిళగా జన్మించడానికి మహా తపస్సు చేసి ఉండా లనీ ఆయన అభిప్రాయం. స్త్రీ జన్మ విశిష్టతను ఆయన ఒక చోట ఇలా తెలియ జేశారు :

"మహిళగా ప్రభవించుటకు గొప్ప
  తపస్సు చేయవలె నమ్మా!
ఆమె చేతి చలవ వల్ల ఈ
  భువిలో ధర్మములు పెరుగు నమ్మా!
చిందెడు కన్నీటిని తుడిచే దెవరు ?
  భయమును పారదోలే దెవరు ?
చీకు చింతలను రూపు మాపగ
  ముద్దిడ ముందుకు వచ్చే దెవరు ?
ప్రేమకై జీవించే దెవరు?
  అందులోనె ప్రాణము త్యజించే దెవరు ?
మధుర భాషణములు పలికే దెవరు ?
  ఇంటిని నవ్వులతో వెలిగించే దెవరు ?
మహిళగా జన్మించుట వలన
  మనస్సు వాడి దుఃఖించుట ఎందుకు ?
ఈ వసుధలో పర్ధిల్లగా కల్పక
  తరువై నిలిచేది నీవు కాదా ?"

ప్రాచీనాచార వ్యవహారాలకూ, ప్రాచీన సాహిత్యమునకూ ప్రచుర ప్రచారం లభించిన ఆ రోజులలో జన్మించిన దేశిక వినాయకం పిళ్ళై సుబ్రహ్మణ్య భారతి అనుయాయులలో ముఖ్యుడు. భారతి రచనలను భద్రపరచడమే కాకుండా, ఆయన ఆదర్శాలకు రూప రేఖలు దిద్దిన వాడు

కూడా 'దేశిక వినాయకం పిళ్ళై' అనడం సత్య సన్నిహితం. భారతి కవితలో శుక పికములు కూయు ననీ, మయూరి పురి విప్పి నాట్యం సలుపు ననీ, ఎండ వానలు కనిపించు ననీ, పువ్వులు వికసించి సువాసనలు వెలార్చు ననీ ఆయన పేర్కొన్నాడు. వయస్సులో తన కంటె చిన్నవాడైనా, భారతి ప్రతిభను గుర్తించి దానిని నలుగురుకీ చాటి చెప్పిన దేశిక వినాయకం పిళ్ళై సహృదయతను ప్రశంసించక తప్పదు. పాత కొత్తల కలయికను కోరిన విశాల దృక్పథం కల కవి కనుకనే ఆయన అలా అనగలిగాడేమో అనిపిస్తుంది.

కవిమణి దేశిక వినాయకం పిళ్ళై ఒక కవితలో తన మనోగతాభిప్రాయాలు ఇలా వ్యక్తం చేశారు :

ఎడారి కావలె సుందరోద్యానము
అచట శుకములు గీతిక లాలపించవలె
కర్మాగారములు కలకల లాడవలె పరిశ్రమలతో
సభలలో తమిళము ప్రతిధ్వనించవలె
ఉడుపులు ఖద్దరు మయము కావలె
దేశభక్తి మూడు పువ్వు లారు కాయలు కావలె
నిరుద్యోగ మనే బాధ తొలగవలె
జయము వెంట జయము మనకు కలుగవలె :

# పిల్లలకూ, పెద్దలకూ
# రచనలు చేసిన
# రాజాజీ

---

జననం : 8-12-1878; మరణం : 25-12-1972
ప్రధాన రచనలు : చక్రవర్తి తిరుమగన్ మొ॥

మహా మేధావిగా, రాజనీతి శాస్త్రవేత్తగా, పరిపాలనా దక్షుడుగా, స్వాతంత్ర్యోద్యమ వీరుడుగా, స్వతంత్ర భారతదేశపు నాయకుడుగా, రచయితగా ఎనలేని పేరు పెంపులు గడించి దేశ దేశాలవారికి రాజాజీ గా చిరపరిచితులైన చక్రవర్తి రాజగోపాలాచారి ఆధునిక తమిళ సాహితీ నిర్మాతలలో ఒకరు. తమిళ సాహిత్యపు సౌరభాలను ఆంగ్లం ప్రతిధ్వనించే ప్రతి ఇంటా గుబాళింప జేసిన ప్రముఖులలో ఆయన ఒకరు. భారతీయ సాహిత్యామృతాన్ని తమిళులకు ఆస్వాదయోగ్యం కావించిన ఆర్ష రచయిత. సామాజిక స్పృహకల కథానికలు వెలయించిన నవ్య రచయిత. కందచక్కెర వంటి కమ్మ కమ్మని కథలు పిల్లలకోసం రచించిన విశిష్టుడు. ప్రవేశించిన ప్రతి రంగంలోనూ పైడి పంటలు పండించిన ప్రతిభాశాలి !

పదవిలో ఉన్నా, బయట ఉన్నా, ఇంట్లో ఉన్నా, జైలులో ఉన్నా రాజాజీది సాహిత్య హృదయం. ఆయన తమిళంలో వ్రాసిన జైలు డైరీ

ఇందుకు ప్రబల సాక్ష్యం. 1912 జనవరి 17 న వ్రాసిన వ్రాతలోని చివరి భాగాన్ని యథాతథంగా ఉదాహరిస్తున్నాను. "....నేడు సోక్రటీసు ప్రసంగం లోంచి ఒక భాగాన్ని తమిళంలోకి అనువదించాను. మధ్యాహ్నం రామాయణం చదివాను. ఎందుకో నీరస మనిపిస్తున్నది. సాయంకాలం నాలుగు గంట లప్పుడు భోజనం చేశాను. అయిదింటికే గదికి తాళాలు వేశారు. చీకటి పడేంత వరకూ నూలు వడికాను. చేతిరాట్నం ప్రశాంతతా, మనోజ్ఞతా నిండిన కవితలా ఉంది. చీకటి పడిన తరవాత తిరుక్కురళ్ చదివాను."

1878 డిసెంబరు 8 న హోసూరులో సామాన్య కుటుంబంలో జన్మించారు రాజాజీ. తండ్రి పేరు చక్రవర్తి అయ్యంగారు. 1900 లో సేలంలో న్యాయవాద వృత్తి ప్రారంభించారు. సహాయ నిరాకరణోద్యమం రోజుల్లో ఆ వృత్తికి స్వస్తి చెప్పి, గాంధీజీ నాయకత్వాన జరిగిన వివిధ ఉద్యమాలలో పాల్గొన్నారు. కారాగృహవాసం చేశారు. గవర్నరు జనరలుగా పనిచేశారు. మదరాసు ముఖ్యమంత్రిగా, కేంద్ర ప్రభుత్వ మంత్రిగా, పశ్చిమ బెంగాలు గవర్నరుగా కూడా పని చేశారు. 1972 డిసెంబరు 25 న సాయం సమయాన మదరాసులోని జనరల్ ఆసుపత్రిలో కన్ను మూశారు.

## రాణింపులో వైవిధ్యం

రాజాజీ అలంకరించిన పదవులలో వైవిధ్యం కానవచ్చినట్టుగా, ఆయన రచనావళిలోనూ వైవిధ్యం కానరావడం ఒక విశేషం. తమిళంలోనూ, ఆంగ్లంలోనూ ప్రశస్తాలైన రచన లెన్నో వెలయించిన సవ్యసాచి ఆయన. పెద్దలకే కాక పిల్లలకు సైతం పనికివచ్చే రచనలు చేశారు. దైనందిన జీవితం ప్రతిబింబింపజేసే కథలు మొదలుకొని గహనాలైన తాత్త్విక విషయాల వరకూ ఆయన రచనా వ్యాసంగం సాగింది. తమిళ సాహిత్యపు సొగసుల్ని ఇంగ్లీషు తెలిసినవారికి పరిచయం చేశారు. ఆయన చేసిన వివిధ రచనలవల్ల ఆధునిక తమిళ సాహిత్యం సుసంపన్న మయిందనడం నిర్వివాదం.

రాజకీయ రంగంలో విజయాలు సాధించినట్లే, సాహిత్య రంగంలోనూ ఆయన సత్కారాలు పొందారు. ఆయన రచించిన చక్రవర్తి తిరుమగన్ (చక్రవర్తి తనూజుడు—రామాయణం) అనే గ్రంథానికి 1958 లో సాహిత్య అకాడెమి వారి బహుమతి లభించింది. ఆయన సాహిత్య సేవను గుర్తించిన అకాడెమి 1969లో రాజాజీని విశిష్ట సభ్యుడుగా (ఫెలో) ఎన్నుకుంది. కొంతకాలం ఆయన అకాడెమీ తమిళ సలహా సంఘంలో సభ్యులుగా ఉండిరి.

రామాయణాన్ని రమణీయమైన కథగా తీర్చి దిద్దినట్లుగా, మహాభారత కథను వ్యాసుని విందు (వ్యాసర్ విరున్దు) అనే పేరున రాజాజీ ఒక ఉద్గ్రంథం వ్రాశారు. "మహాభారత కథ తెలియనివారిని భారత వర్షానికి చెందినట్లుగా భావించలేము. కాని, మూల మహాభారతాన్ని అందరూ చదువ లేరు. కనుక నేను తమిళంలో వ్యాసర్ విరున్దు వ్రాశాను". ఇదీ, దీని ఇంగ్లీషు అనువాదమూ లక్షల సంఖ్యలో అమ్ముడు పోయినాయి. తన రామాయణ, భారతాల రచనల ద్వారా రాజాజీ భారతీయ సంస్కృతిని దశదిశా వ్యాప్తం చేశారు.

## కొద్ది మాటలలో కొండంత భావం

రాజాజీ అతి నిరాడంబరులు. ఆయన వేష భాషల మాదిరిగా, ఆయన రచనలు కూడా సహజ సుందరాలు. కొండంత భావాన్ని కొద్ది మాటల్లో స్పష్టం చెయ్య గలిగిన అద్భుత శక్తి ఆయనకి వెన్నతో పెట్టిన విద్య. జటిలమైన విషయాన్ని కూడా సులభంగా, సూటిగా వివరించడంలో ఆయన అందెవేసిన చేయి. కనుకనే ఆయన రచనలో క్లిష్టత అనేది కంచు కాగడాతో వెతికినా కనిపించదు. అన్వయ కాఠిన్యం మాట వరసకైనా కనిపించదు. ఈ సందర్భంలో ఆయన శైలిని గురించి రెండు మాటలు. రాజాజీ గ్రాంథికవాది కాదు. పూర్తిగా వ్యావహారిక భాషావాది. పాండిత్య ప్రకర్ష ఆయనకి నచ్చదు. ఆయన కోరేదల్లా విషయ వివరణ. కనుకనే ఆయన తమిళశైలి పండిత

పామర రంజకం, హృదయానికి హత్తుకునేది. కాగా, ఆయన రచనల్లో సజీవమైన తమిళం - సంస్కృత శబ్ద సమ్మిశ్రితమైన తమిళం - కనిపించడంలో ఆవంతైనా ఆశ్చర్యం లేదు.

మద్య పాన నిషేధం, కుల వృత్తులు, అస్పృశ్యత మొదలైన సాంఘిక విషయాలను గురించి రాజాజీ రసవత్తరములైన కథానికలు ఆ రోజుల్లో వ్రాశారు. ఆయన వాంఛించిన సాంఘిక పురోభివృద్ధి ఆయన కథల్లో స్పష్టంగా కనిపిస్తుంది. చేనేత వ్యాపారం పడిపోవడంతో ఉన్న ఊళ్లో తలెత్తుకు తిరగలేక, బ్రతుకుతెరువుకోసం పట్టణం చేరుకున్న అన్నా చెల్లెళ్ళ దయనీయమైన కథ 'దేవానై'లో చెప్పారు. పట్టణం మిల్లులో చేరిన అన్న జూదరి అయ్యాడు. తాగుడు అలవాటు చేసుకున్నాడు. చెల్లెలు కూడా మిల్లులో చేరింది. మిల్లు మేస్త్రీ బలాత్కారంవల్ల ఆమె గర్భవతి అయింది. చివరికి భిక్షుకిగా మారింది. ఇలా ఒక చేనేత కుటుంబం కులవృత్తి పడిపోవడంతో ఎలా పతనావస్థకు పాల్పడిందో 'దేవానై' కథలో వివరించబడింది.

నిరుపేద అయిన ఒక హరిజనుడు చదువుకుని, ఉన్నత స్థితికి వచ్చిన తరువాత తన తల్లిదండ్రుల్ని పూర్తిగా మరచిపోతాడు. అందువల్ల ఆ తల్లిదండ్రులు బాధలకూ, కన్నీళ్ళకూ గురి అయ్యారు. చివరికి తన తప్పుని తెలుసుకుని పశ్చాత్తప్తుడైన ఆ హరిజనుడు విరాగి అవుతాడు. ఈ కథ పేరు 'అన్నైయుం పితావుం' (మాతా పితలు). ఇలా రాజాజీ సజీవ సాంఘిక సమస్యలు గ్రహించి కథానికలు వ్రాశారు. అవి కాలక్షేపం కోసం ఉద్దేశించినవి కావు. సాంఘిక ప్రయోజనం కల కమ్మని కథానిక లవి !

రామాయణ, భారత కథలను మధుర మోహనంగా సంతరించిన రాజాజీ భగవద్గీతా ప్రాశస్త్యాన్ని 'కణ్ణన్ కాట్టియ వళి' (కన్నయ్య చూపిన దోవ)లో విశదీకరించారు. భజ గోవిందం, అభేద వాదం, వేదాంత దీపం, ఉపనిషద ప్పలకణి, రామకృష్ణ ఉపనిషదం మొదలైన పెక్కు రచనలు

ఆయన లేఖిని నుంచి వెలువడినాయి. వాటిలో వేదాంత విషయాలు సులభ సుందరమైన భాషలో వివరించారు సోక్రటీసుని గురించి కూడా ప్రశస్తమైన రచనలు చేశారు. అలాగే రోమ్ దేశపు రాజర్షిగా ప్రథితయశస్కుడైన మార్కస్ అరేలియస్ అంటోవినస్ సూక్తులను 'ఆత్మ చింతనం' అనే గ్రంథంలో తమిళులకు తెలియజేశారు.

గీతా ప్రాశస్త్యాన్ని ఇలా తెలియజేశారు: "హిందూ సంఘానికి చెందిన వివిధ మతానుయాయులూ శాస్త్ర మనీ, ప్రమాణ గ్రంథ మనీ అంగీకరించే భగవద్గీతలోని కొన్ని శ్లోకాలనైనా శ్రద్ధా భక్తులతో పఠిస్తే, మన పూర్వులు దర్శించిన తత్త్వజ్ఞానమూ, మహర్షులు నెలకొల్పిన హైందవ ధర్మవిశిష్టతా మనకు తెలియవస్తాయి. హిందూధర్మం అనే పునాదిమీదనే మన నాగరికతా, కళలూ, సాహిత్యం, భారతదేశంలో మనం గర్వించదగినవిగా భావించే ఇతర అంశాలూ రూపొందాయి. ఆ హైందవ ధర్మాన్ని తెలుసుకోవడం మన ధర్మం. అందువల్ల గీతా సారాన్ని గ్రహించడంవల్ల మనకు లాభం చేకూరుతుంది."

తమిళ వేద మైన తిరుక్కురళ్ విశిష్టతను వివరించే పుస్తకం రాజాజీ వ్రాశారు. ఇతర తమిళ కవుల్ని గురించి కూడా యథోచితంగా వివరించారు. ఇవి కాక గంభీర భావ బంధురములైన వ్యాసా లెన్నో సంతరించారు.

ఇక—బాల బాలికల్ని ఉద్దేశించి రాజాజీ కమ్మని కల్పనా కథలు ఎన్నో వ్రాశారు. ఆయన 'కర్పనై క్కాడు' (కల్ప నాటవి) ఇందుకు నిదర్శనం. రాజాజీ ప్రధానంగా ఉత్తమ కథకు డని ఈ పుస్తకం వ్యక్తం చేస్తుంది. కడలిలో కలిసి పోయిన మరుక్షణమే తన జీవితం అంత మవుతుందే అని ఒక నది చింతించి నట్లుగా ఆయన ఒక కథలో (నదీ మోహం) వివరిస్తూ, కథాంతంలో ఇలా పేర్కొన్నారు—"ఓ నదీ! ఏడవకు! అంటూ

మనమూ వివేకవంతులం కావాలి. యముణ్ణి చూసి భయపడవలసిన పనే ముంది ? దుఃఖించనూ కూడదు. బ్రహ్మాండ మంతా వ్యాప్తమై ఉన్న మహా సముద్రమే భగవంతుడు. ఆయనలో విలీన మయ్యేటప్పుడు ఎందుకు భయ పడాలి ? ఎందుకు దుఃఖించాలి ?'' ఇలా రాజాజీ చిన్న పిల్లలకు అర్థ మయ్యేలా ఎన్నో తాత్త్విక విషయాలు వివరించారు.

ఆంగ్లంలో ఆయన రామాయణ భారతాలు వెలయించారు. ప్రసిద్ధ తమిళ రచయిత్రి అవ్వైయారుని గురించి చిన్న పుస్తకం వ్రాశారు. ఇది తొలుత గాంధీజీ సంపాదకత్వాన వెలువడుతూ ఉండిన 'యంగ్ ఇండియా'లో 1928 లో ప్రచురితం. కంబ రామాయణంలోని అయోధ్యాకాండను ఆంగ్లం చేశారు. తిరుక్కురళ్‌ని కూడా ఇంగ్లీషులోకి అనువదించారు. సత్య మేవ జయతే అన్న సంపుటంలో ఆయన వ్యాసాలు చోటు చేసుకున్నాయి.

నవ భారత నిర్మాతలలోనే కాక, ఆధునికతమిళ సాహిత్య నిర్మాతల లోనూ స్థాన మాక్రమించిన సవ్యసాచి రాజాజీ !

# చారిత్రక దృష్టి కల పండితుడు
# ము. రాఘవయ్యంగారు

జననం : 26-7-1878; మరణం : 25-12-1960
ప్రధాన రచనలు : పెరున్తొగై, ఆరాయ్చ్చి త్తొగుది మొ.

విజ్ఞాన వికాసానికి ముద్రణ యంత్రం ఎంతగానో తోడ్పడింది. అచ్చు కూటముల సంఖ్య ఎక్కువయ్యే కొద్దీ పుస్తక ప్రచురణ ముమ్మరంగా సాగడమే కాకుండా, ఆ పుస్తకాలు ప్రచారంలోకి వచ్చి, అంత వరకూ పండితాధీనమై ఉన్న సాహిత్యం ప్రజా బాహుళ్యం అందుబాటులోకి వచ్చింది. సాహిత్య ప్రపంచంలో ఏర్పడిన ఈ గొప్ప పరిణామానికి ముద్రణ కళ ముఖ్య కారణమే అయినప్పటికీ, పండితుల పరిశోధన కూడా ప్రబల హేతువయిందని భావించడం అణుమాత్రమైనా అసమంజసం కాదు. కా.గా, ఆధునిక సాహిత్యాభివృద్ధికి పరిశోధన, ముద్రణ కళ రెండూ రెండు కళ్ళు వంటివి.

## ముద్రణ - పరిశోధన

తమిళంలో పరిశోధన అనగానే ఉ. వే. సామినాధయ్యరుతో పాటు ము. రాఘవయ్యంగారి పేరు కూడా స్ఫురణకు వస్తుంది. పండితులైన వీ

రిద్దరూ ప్రాచీన తమిళ గ్రంథాలను చక్కగా పరిశీలించి, పరిష్కరించి, ప్రకటించిన మహనీయులు.

ప్రాచీన కావ్య పరిష్కరణ, పాఠ నిర్ణయము, కవి కాల నిర్ణయము, వ్యాకరణాంశముల పరిశీలన, శాసన పరిశోధన, నిఘంటు రచన, చాటు పద్య సంకలన—ఇలా బహు ముఖంగా సాగింది రాఘవయ్యంగారి సాహిత్య వ్యవసాయం. ఆయన అవిరళ కృషికి ఫలితంగా బంగారు పంటలు పండడంలో ఆశ్చర్యం లేదు.

## పుట్టుక - విద్యాభ్యాసము

రామనాథపురం జిల్లాలోని అరియక్కుడి గ్రామంలో 1878 వ సంవత్సరంలో జూలై 26 వ తేదిన రాఘవయ్యంగారు జన్మించారు. తండ్రి శతావధానం ముత్తుస్వామి అయ్యంగారు. ఆయన గొప్ప పండితుడు. రామనాథపురం సేతుపతుల సంస్థానంలో ప్రముఖ పండితులుగా ఉండేవారు. ఆయన మరణించేనాటికి రాఘవయ్యంగారు పదహారేళ్ళ యువకుడు. సేతుపతుల వంశీయుడూ, సహృదయుడూ అయిన పాండిత్తురై దేవర్ అప్పుడు రాఘవయ్యంగారిని ఆదుకున్నాడు. ఆయన సహాయ సహకారాలతో తమిళ వాఙ్మయాన్ని రాఘవయ్యంగారు మథించగలిగాడు. ఆయన పాండిత్యం దేవర్‌ని ఆశ్చర్యంలో ముంచివేసింది. తత్ఫలితంగా 1901 వ సంవత్సరంలో మధురలో దేవర్ స్థాపించిన తమిళ కళాశాలలో రాఘవయ్యంగారు తమిళ పండితుడుగా నియుక్తుడైనాడు. అంతేకాదు. 'చెందమిళ్' అనే ప్రసిద్ధ తమిళ సాహిత్య మాస పత్రికకు మొదట ఉప సంపాదకుడుగాను, తరువాత సంపాదకుడుగాను నియుక్తుడైనాడు. తదాదిగా రాఘవయ్యంగారి పాండితీ ప్రతిభలు పలుగురికీ తెలియవచ్చాయి.

## చారిత్రక దృష్టి

ఆ రోజుల్లో తమిళ సాహిత్య పరిశోధన మూడు పువ్వు లారు కాయ లుగా సాగింది. అయితే చారిత్రక దృష్టి కొరవడిన రోజు లవి. పండితుల దృష్టి ప్రాచీన కావ్యాల మీదికి ప్రసరించినంతగా చరిత్ర మీదికి ప్రసరించ లేదు. ఇందుకు అపవాదం రాఘవయ్యంగారు. ప్రాచీన సాహిత్యమును చరిత్రతో జోడించి ఆయన అమూల్యమైన వ్యాసాలు ప్రకటించారు. అవి తమిళ పండితుల్నే కాక ఆంగ్ల విద్యాధికుల్నీ, పాశ్చాత్య ప్రముఖుల్నీ అల రించాయి. ఆ నాటి ప్రముఖులు పలువురు రాఘవయ్యంగారి కృషిని బహుధా శ్లాఘించారు. 1907 వ సంవత్సరంలో సుబ్రహ్మణ్య భారతి ఆయనకు వ్రాసిన జాబులో ఒక పేరా పరికించండి :

"అనేక నమస్కారములు....

గత 'చెందమిళ్' సంచికలో మీరు వ్రాసిన 'వీర మాతలు' అన్న అద్భుతమైన వ్యాసం చూసి, ఆ ఆనందాన్ని తమకు తెలియజేయా లన్న అభి లాషకొద్దీ ఈ జాబు వ్రాస్తున్నాను...."

1919 వ సంవత్సరంలో మదరాసు ప్రభుత్వం మదరాసు విశ్వవిద్యా లయం వారి పర్యవేక్షణలో ఒక బృహత్ తమిళ పదకోశ (తమిళ లెక్సికన్) రచనకు పూనుకుంది. దాని ప్రధాన సంపాదకులైన రెవరెండ్ జె ఎస్. చాండ్లర్ రాఘవయ్యంగారిని ప్రధాన తమిళ పండితుడుగా నియమించాడు. ఈ బృహత్ పదకోశం పూర్తి అయ్యేందుకు 26 సంవత్సరాలు పట్టింది. ఇందులో 1, 04, 405 మాటలు చోటు చేసుకున్నాయి. ఈ 26 ఏళ్ళూ రాఘవయ్యంగారు నిఘంటు కార్యాలయంలో పనిచేశారు. ఆయన కృషి నిఘంటువుకి జీవనాడి అని చాండ్లర్ ప్రశంసించాడు. "పదకోశ నిర్వహణలో సాధించబడిన విజయంలో మూడు వంతులు మొదటి నుంచి సంపాదక

మండలిలో ఉండి పని చేసిన ము. రాఘవయ్యంగా రనే రామనాథపురం పండితునికి చెందవలెను'' అని ఆ గౌర ప్రశంసించారు. ప్రభుత్వం కూడా ఆయన అవిరళ కృషికి మెచ్చుకుని రాఘవయ్యంగారికి 1939 వ సంవత్సరంలో ''రావుసాహెబ్'' అనే బిరుదు ప్రసాదించింది.

నిఘంటు కార్యాలయంలో పని చేస్తూనే చేరన్—చెంగుట్టువన్, ఆళ్వారుల కాలం, శాసనాలు వ్రాసిన తమిళ కవుల చరిత్ర మొదలైన పెక్కు గ్రంథాలు ఆయన ప్రకటించారు.

ఆ తరువాత రాఘవయ్యంగారు మదరాసులోని లయోలా కళాశాలలో గౌరవ తమిళ భాషాచార్యులుగాను, కేరళ విశ్వవిద్యాలయంలో తమిళ భాషా చార్యులుగాను పని చేశారు. ఏ పదవిలో ఉన్నా, ఆయన దృష్టి మాత్రం పరిశోధనమీదే లగ్నమై ఉండేది. తమిళ వాఙ్మయంలోని కేరళ ప్రశంస అనే విషయం గురించి చక్కని రచన చేసి, దాన్ని విశ్వవిద్యాలయ ప్రచురణగా ప్రచురించారు. 1951 వ సంవత్సరంలో పదవీ విరమణ చేసిన తరువాత కొంతకాలం రామనాథపురంలో నివసించినా, 1956 నుంచి 1959 దాకా అణ్ణామలై విశ్వవిద్యాలయంలో కంబ రామాయణ సంశోధిత ప్రతి సంపాదక వర్గంలో పని చేశారు

రాఘవయ్యంగారి నిరంతర పరిశ్రమకు తలమానిక మని భావించదగిన గ్రంథం ఆయన ప్రకటించిన 'పెరున్తొగై'. ఇది 2,200 చాటు పద్యాల సంకలన గ్రంథం. ఆ పద్యాలకు లఘు టీక కూడా ఆయన సంతరించారు. "చక్కని కవితలు ... ఎన్నింటినో సేకరించి మీరు తమిళులకు మహోప కారం చేశారు. సంవత్సరాల తరబడి వాటిని పరిశీలిస్తూ ఉండవచ్చు. ఆ సంకలనంలో అనర్ఘ మణులు ఎన్నో ఉన్నవి" అని రసికమణి చిదంబరనాథ ముదలియారు ఆ గ్రంథమును ప్రశంసించారు.

## వ్యాస సంపుటి

రాఘవయ్యంగారి పరిశోధనకు ఆయన 'ఆరాయ్చ్చి త్తొగుది' అనే వ్యాస సంకలనం ముఖ్యంగా పేర్కొ్కొన దగింది. ఇది 35 వ్యాసాల గ్రంథం. వాటిలో ఒకటి 'తమిళరుం, ఆన్దిరరుం' (తమిళులూ, ఆంధ్రులూను), 28 పుటలలో సాగిన ఈ రచన తొలుత అప్పటి మదరాసు విద్యాశాఖా మంత్రి సర్. పరశురామ ప్రాత్రో గారి అధ్యక్షతను జరిగిన విద్వత్సభలో చదువబడింది. తెలుగు వారికిని, తమిళులకును గల సంబంధ బాంధవ్యాలను చర్చించే తమిళ రచనలలో ఇదే మొదటి దని నా అభిప్రాయం. ఈ వ్యాసంలోంచి ఒకటి రెండు వాక్యాలు ఉదాహరిస్తున్నాను:

"....తొల్కాప్పియనార్ మొదలైన వారికి పూర్వమే తమిళమూ, వడుగూ విడివడి స్వతంత్ర భాష లైనట్లు స్పష్టమవుతుంది. ఇలా తమిళంలోని ప్రాచీనాధారాలను బట్టి పరిశీలిస్తే, వడుగుకి తమిళమున కున్నంత ప్రాచీనత కల దని తెలియ వస్తుంది ..." వడుగు శబ్దం తెలుగు, కన్నడములను సూచిస్తున్నప్పటికీ, రాఘవయ్యంగారి దృష్టిలో తెలుగు, వడుగు శబ్దాలు సమానార్థకాలు.

పండితుడూ, పరిశోధకుడూ, చారిత్రక దృష్టి కల రచయితా అయిన ము. రాఘవయ్యంగారు 1960 వ సంవత్సరంలో ఫిబ్రవరి 2 న కాలధర్మం చెందారు. అప్పు డాయన ఎనభై రెండేళ్ళ పండు ముసలి!

# కథా రచనకు
# తుష్టినీ, పుష్టినీ కూర్చిన
# వ. వె. సు. అయ్యరు

---

జననం : 2-4-1881; మరణం : 3-6-1925
ప్రధాన రచనలు : మంగై యర్క్కరసియిన్ కాదల్ మొ.

తమిళ కథానికా రచనకు గట్టి పునాదులు వేసిన మహనీయుడూ, ఉత్తమ విమర్శకుడూ, దారి చూపిన సాహితీవేత్తా వ. వె. సుబ్రహ్మణ్య అయ్యరు 1881 ఏప్రిల్ 2 న తిరుచ్చిరాపల్లి జిల్లాలోని వరాహనేరి అనే గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకటేశ అయ్యరు. తల్లి కామాక్షి అమ్మాళ్.

సుబ్రహ్మణ్య అయ్యరు కేవలం సాహితీ మర్మజ్ఞులే కాదు, బహు భాషాభిజ్ఞులు; లాటిన్ మొదలైన సుమారు పది భాషలలో పండితులు; ప్రముఖ దేశ భక్తులు; విప్లవవాది.

ఆయన విద్యార్థి దశలోనే మేధావి అని కీర్తి గడించారు. మెట్రిక్యులేషన్ పరీక్షలో అప్పటి మదరాసు రాష్ట్రమంతటికీ సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులయారు. అప్పు డాయన పన్నెండేళ్ళ కుర్రవాడు. పద్నాలుగవ ఏట ఎఫ్. ఏ.

లోనూ, పదహారవ ఏట బి. ఏ. లోనూ మొదటి తరగతిలో కృతార్థు లయారు. బి ఎల్. పరీక్షలో కూడా అఖండ విజయం సంపాదించారు. ఆ తరువాత కొంతకాలం న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. బారిష్టరు కావా లని అభిలాష కలిగింది. అందుకు గాను ఆయన 1907 లో లండన్ వెళ్ళారు. అప్పటికే ఆయనకి వివాహం జరిగింది.

లండన్ వెళ్ళిన తరువాత ఆయన తన పేరుని వ. వె సు. అయ్యరుగా కుదించుకున్నారు. తీవ్ర విప్లవవాదిగా మారారు. అందుకు కారణం వీర సావర్కారుతో ఆయనకి కలిగిన పరిచయం. సావర్కారు అధ్యక్షులైన అభినవ భారత్ సంఘానికి అయ్యరు గారు ఉపాధ్యక్షులుగా ఎన్నుకో బడ్డారు. పరీక్షలు మంచినీళ్ళ ప్రాయమైన ఆయనకి బారిష్టరు పరీక్ష కష్ట మనిపించలేదు. బారిష్టరు అయినారు. కాని, రాజభక్తి ప్రమాణ స్వీకారానికి ఆయన సమ్మతించలేదు. తత్ఫలితంగా అయ్యరుగారిని అరెస్టు చేయ మన్నారు. గూఢచారుల బెడద ఎక్కువయింది. తత్ఫలితంగా రక రకాల వేషాలు ధరించి, ఆయన లండన్ నుంచి బయటపడి ఫ్రాన్సు చేరుకొని, అక్కడనుండి అతికష్టం మీద 1910లో పాండిచ్చేరి చేరుకున్నారు. ఎన్నో ఇబ్బందులకు పాల్పడ్డారు. అయినా, తన అభిప్రాయాలను మార్చుకోని దేశభక్తుడు ఆయన.

అయ్యరుగారు పాండిచ్చేరిలో పదేళ్ళు ఉండవలసి వచ్చింది. రాజకీయ కార్యకలాపాలతో పాటు సాహిత్య వ్యాసంగం కూడా నిర్వహించారు. ప్రముఖ దేశ భక్తుడూ, ప్రసిద్ధ రచయితా, ఆధ్యాత్మిక తత్వ సంపన్నుడూ అయిన శ్రీ అరవిందులతో ఆయనకి పరిచయ భాగ్యం ఏర్పడింది. అలాగే మహాకవి సుబ్రహ్మణ్య భారతితోనూ మైత్రి ఏర్పడింది.

వ. వె. సు. అయ్యరుగారి సాహిత్య వ్యాసంగం బహుముఖంగా సాగింది. నెపోలియన్, గారిబాల్డీ, మజిని, రాణా ప్రతాప్ సింగ్, చంద్రగుప్త

చక్రవర్తి ప్రభృతుల జీవిత చరిత్రలు ఆయన తమిళంలో వెలయించారు. ఎమర్సన్ వ్రాసిన 'సెల్ఫ్ కాన్ఫిడెన్స్' అనే పుస్తకాన్ని తమిళం చేశారు. మన ప్రాచీనుల యుద్ధ వ్యూహాలనూ, నెపోలియన్ యుద్ధ విధానాలనూ తుల నాత్మకంగానూ, పర్యాప్తంగానూ పరిశీలించి ఒక గ్రంథం వ్రాశారు.

తమిళ వేద మయిన 'తిరుక్కురళ్'ని అయ్యరుగారు ఆంగ్లం చేశారు. ఈ ఆంగ్లానువాదం పేరు 'ది మాక్సిమ్స్ ఆఫ్ తిరువళ్ళువర్' (The maxims of Tiruvalluvar). ఇది 1916 లో వెలువడింది – ప్రశస్తమైన వచనాను వాదం. దీని నాలుగవ ప్రచురణ 1961 లో వెలువడింది. అయ్యరుగారి దృష్టిలో 'తిరుక్కురళ్' సూక్తులు సార్వజనీనాలూ, సార్వకాలికాలూను. అలాగే సంగకాలపు కృతులలో ఒకటైన 'కురంతొగై'ని కూడా ఆయన ఆంగ్లం చేశారు ఆ విధంగా అయ్యరుగారు తమిళ సాహిత్యంలోని అనర్ఘ రత్నాలను ఆంగ్లంలోనికి అనువదించి వాటి విశిష్టతను తమిళులు కాని వారికి తెలియజేశారు.

అయ్యరుగారికి ముందే తమిళంలో కొందరు కథలు కొన్ని వ్రాశారు. వీరమామునివర్ అనే పాశ్చాత్యుడు 'పరమార్థ గురు కదై' అనే కథలు కొన్ని సంతరించారు. పంచతంత్ర కథలను తాండవరాయ ముదలియారు రచించారు. అష్టావధానం వీరాస్వామి చెట్టియారు అనే పండితుడు 'వినోద రస మంజరి' అనే కథా సంపుటి ప్రకటించారు. భారతి కూడా కొన్ని కథలు ప్రచురించారు. కాని, ఇవన్నీ నేటి కథానికలకు పూర్తిగా భిన్నమైనవి. వీటిలో నేటి కథానికా శిల్పం కనిపించదు. పాశ్చాత్యుల కథా కథనాన్ని అనుసరించి వ. వె. సు. అయ్యరుగారు కొన్ని కథానికలు సంతరించారు. అవి 'మంగైయర్

క్కరిసియిన్ కాదల్' అనే సంపుటంగా ప్రచురించబడ్డాయి కాగా, ఆయన తమిళ కథానికకు పితామహులుగా భావించబడుతున్నారు. ఆయన కథలలో సునిశితమైన హాస్యరసం చిప్పిలుతూ ఉండడం గమనించదగిన అంశం.

1917 వ సంవత్సరం అయ్యరుగారి జీవితంలో పేర్కొనదగింది. ఆ ఏడు గాంధి మహాత్ముడు పాండిచ్చేరికి విజయం చేశారు. ఆయన్ని విప్లవవాదిగా మార్చాలని అయ్యరుగారు ప్రయత్నించారు. కానీ, విఫల మనోరథు లయారు. అంతేకాదు; వ. వె. సు, అయ్యరు విప్లవ మార్గానికి స్వస్తి చెప్పి శాంతి పథంలో అడుగు పెట్టారు. రివాల్వరు విసర్జించి, తకిలీని ఆశ్రయించారు.

1920లో అప్పటి ఆంగ్ల ప్రభుత్వం క్షమా భిక్ష ప్రకటించింది. అందువల్ల రాజకీయ నేరస్థులను మన్నించడం జరిగింది. అప్పుడు అయ్యరు గారు పాండిచ్చేరి వదలి చెన్నపట్టణం చేరుకున్నారు.

ఆ సంవత్సరమే ఆయన 'దేశ భక్తన్' అనే దిన పత్రికకు సంపాద కులుగా నియుక్తులైనారు. సుమారు రెండేళ్ళ తర్వాత రాజ ద్రోహం నేరం క్రింద ఆయన్ని అరెస్టు చేశారు. బళ్ళారి జైలులో తొమ్మిది నెలలు నిర్బంధించారు. ఆ తొమ్మిది నెలల కాలాన్ని ఆయన సద్వినియోగం చేసు కున్నారు. కంబ రామాయణ కావ్యాన్ని పర్యాప్తంగా పరిశీలించారు. మొదటి నుంచీ ఆయనకి కంబ కవి కృతి అంటే అపారమైన ఆదర భావం. తాను ప్రక్షిప్తాలు అనుకున్న పద్యాలను పరిహరించి, కంబ రామాయణంలోని బాల కాండను మాత్రం ఆయన ప్రచురించారు. కాగా,జైలులో ఉన్న ఆ రోజుల్లో ఆయన 'కంబ రామాయణ పరిశీలన' అనే పేరుతో ఆంగ్లంలో (కంబ రామాయణ—ఏ స్టడీ) ప్రశస్తమైన విమర్శక గ్రంథం వెలయించారు. అది అయ్యరుగారి ఆంగ్ల భాషా వైదుష్యానికే కాక, ఉత్తమ విమర్శనా పాటవానికి కూడా నికషోపలంగా భాసిస్తున్నది.

జైలునుంచి విడుదల అయిన తరువాత అయ్యరుగారు 1922లో తిరునెల్వేలి జిల్లాలోని చేరమాదేవి అనే గ్రామంలో తమిళ గురుకులం స్థాపించారు. బాల బాలికలకు గురుకుల పద్ధతిని చదువు సంధ్యలు చెప్పసాగారు. 'బాల భారతి' అనే తమిళ మాస పత్రికను ప్రకటించ సాగారు. అందులో కంబ రామాయణం గురించి అమూల్యములైన వ్యాసాలు వ్రాసేవారు. కంబ రామాయణ మంటే అయ్యరుగారికి గల ప్రగాఢమైన ఆదరభావాన్ని ఈ విష యాధికం తెలియచేస్తున్నది.

వ. వె సు. అయ్యరు దృష్టిలో కంబ రామాయణం ప్రపంచ వాఙ్మయం లోనే సాటి లేని కావ్యం, ఇలియడ్, ఏనిడ్, పారడైజ్ లాస్ట్, మహాభారతం మొదలైనవాటితోనే కాక, మాతృక అయిన వాల్మీకి రామాయణంతోనే పోటీ పడగల అద్భుత కావ్యం కంబ రామాయణం—అని అయ్యరుగారి నిశ్చితాభి ప్రాయం. ఈ అభిప్రాయన్ని సమర్థించేందుకే ఆయన కంబరామాయణ పరిశీలన గ్రంథం సంతరించారు. కంబ మహాకవి రచన వాల్మీకి రామాయణం కాదు; ఒక అద్భుత సృష్టి అని కూడా ఆయన పేర్కొన్నారు. ఆయన అభిప్రాయం ప్రకారం ఏ సంస్కృత కావ్యమూ ప్రాచీనకాలంలో యథా మాతృకంగా అనూదితం కాలేదు. తమిళం, తెలుగు మొదలైన వివిధ భాషా కవులు చేసినవి అనుసరణలే కాని, యథానువాదాలు కావని ఆయన స్పష్టంగా పేర్కొన్నారు. అయ్యరుగారు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలతో ఏకీభవించనివారు కూడా ఆయన చిత్త శుద్ధినీ, స్వచ్ఛమైన భాషాభిమానాన్నీ ప్రశంసించక తప్పదు కంబ కవి చెప్పిన కథను సంగ్రహంగా తెలియజేసి, ఆ కవిరాజు కావించిన పాత్ర చిత్రణను కూడా అయ్యరుగారు తమ గ్రంథ లో తెలియజేసి కావ్యవిమర్శకు చక్కని దోవ చూపారు. వాల్మీకి రాముడు మాన వోత్తముడైతే, కంబ కవి రాముడు దైవాంశ సంభూతుడు. ఇది కేవలం ఒక

తమిళ కవి చేసిన మార్పు అనీ, కాలం తెచ్చిన మార్పనీ అయ్యరుగారు సహేతుకంగా పేర్కొన్నారు. మధ్య మధ్య భాస్కర రామాయణం, తులసీదాసు కృతి, మిల్టన్ కృతులు మొదలైన వాటితో కూడా కంబకవి కథనాన్ని తులనాత్మకంగా పరిశీలించారు. మొత్తం మీద అయ్యరుగారి గ్రంథం అవశ్య పఠనీయ మనడం అత్యుక్తి కాదు కాని దురదృష్టం ఆయన సజీవులై ఉన్న రోజుల్లో రాజకీయంగా కానీ, సాహిత్యపరంగా కానీ రావలసినంత పేరు పెంపులు రాలేదు. పైగా తమ 44 వ ఏటనే ఆయన కన్నుమూశారు.

అది 1925 జూన్ 3. గురుకుల విద్యార్థులతోబాటు వ. వె. సు. అయ్యరు తిరునెల్వేలి జిల్లాలోని పాపనాశం కళ్యాణ తీర్థం అనే జలపాతం వద్దకు విహార యాత్రగా వెళ్ళారు. అక్కడ ఆయన కుమార్తె సుభద్ర కాలు జారి జలపాతంలో పడిపోయింది. ఆమెను రక్షించబోయి అయ్యరుగారు కూడా దుర్మరణం చెందారు.

వ. వె. సు. అయ్యరుగా సాహితీలోకంలో నిలిచిపోయిన సుబ్రహ్మణ్య అయ్యరు చిరంజీవులు కావడానికి కారణం ఆయన వెలయించిన రచనలు. అవి అమూల్యములు! ఆయన మరణ వార్తను విని గాంధీజీ ఇలా వ్రాశారు: "శ్రీ వ. వె. సు. అయ్యరుగారి దుర్మరణంవల్ల నాకు కలిగిన సంతాపాన్ని యంగ్ ఇండియా పాఠకు లందరూ పంచుకుంటా రని ఆశిస్తున్నాను .... నే నెప్పుడూ ఆయన్ని సౌజన్యమూర్తిగా, కార్యదీక్షా, నిజాయితీ కల దేశ సేవకుడుగా భావిస్తూ వచ్చాను."

# తమిళ నవయుగ ప్రవక్త
# సుబ్రహ్మణ్య భారతి

---

జననం : 11–12–1882; మరణం : 11–9–1921
ప్రధాన రచనలు : పాంచాలి శపథం మొ. కావ్యాలు

జాతీయోద్యమం ముమ్మరంగా ఉన్న ఆ రోజుల్లో మన దేశం లోని వివిధ భాషలలో దేశభక్తి ప్రబోధాత్మకములైన పాటలూ, పద్యాలూ ఎన్నో ప్రచారంలోకి వచ్చినవి. వాటివల్ల ప్రభావితులై ఎంద రెందరో స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు; ఎన్నో కష్టాలు అనుభవించారు. వారి త్యాగాలకు ఫలితంగా మన చిరకాల వాంఛ నెరవేరింది. దేశానికి స్వాతంత్ర్యం లభించింది. నిజానికి ఆ రోజుల్లో ఆ పాటలూ, పద్యాలూ జాతిని ఉర్రూత లూగించినవి. అయితే, స్వాతంత్ర్యానంతరం ఆ జాతీయ కవులు నామమాత్రావశిష్టులైనారు. వారి రచనలకు ప్రచారం తగ్గిపోయింది. కాని, ఇందుకు అపవాదం తమిళ నవయుగ ప్రవక్త అయిన సి. సుబ్రహ్మణ్య భారతి.

## బాల్య సంఘటన

దైవ సృష్టి ఎంత విచిత్రమయిందో, ఒక్కొక్కసారి మానవుని చేతలూ, తలపులూ అంత విచిత్రంగా ఉంటాయి. భారతి జీవితంలోని ఒక సంఘటన ఈ విషయాన్ని ఋజువు చేసింది.

ఆయన పిల్లవాడుగా ఉన్నప్పుడు తండ్రి చిన్నసామి అయ్యరుతో కలిసి ఎట్టయాపురం జమీందారుగారి కొలువు కూటానికి వెడుతూ ఉండేవాడు. వెళ్ళి బెల్లం కొట్టిన రాయిలా కూర్చునేవాడు కాదు. అక్కడ జరిగే సాహిత్య గోష్ఠుల్ని శ్రద్ధాసక్తులతో గమనించేవాడు. అప్పుడప్పుడు పద కవితలు చెప్పేవాడు. చిన్న పిల్లవాని ఆ కవితలు ఆలకించి ఆ సభాసదులు ఎంతగానో మురిసిపోయేవారు. అంతటితో ఊరుకోలేదు. అతని సహజ పాండిత్యానికి మెచ్చుకుంటూ "భారతి" అనే బిరుదం ప్రసాదించారు. అంతవరకూ సుబ్రహ్మణ్యం అని వ్యవహరించబడుతూ ఉన్న ఆ పిల్లవాడు భారతిగా మారిపోయాడు చివరికి భారతి అన్న ఆ పేరే శాశ్వత మయింది. మరొక విచిత్రమేమిటంటే - పేరుకు తగ్గట్టుగా ఆయన జాతీయతా దృష్టి కల భారతీయ కవిగా పేరు పెంపులు గడించాడు. ఈ జాతీయతా దృష్టివల్లనే ఆయన రచనలకు ఒక ప్రత్యేకత సిద్ధించింది. ఆయన చిరంజీవి కాగలిగాడు.

స్వాతంత్ర్య సమరం సాగిన ఆ రోజుల్లో దేశభక్తి గీతాలు ఎన్నో వెలయించాడు భారతి. అవి విదేశ పాలనకు వ్యతిరేకంగా ప్రజలలో భావాలు కలుగజేసినవి. దేశభక్తి గీతం వెలయించినా, దేవునిమీద పాట సంతరించినా అందులో భారతి దేశభక్తి గూడు కట్టుకునేది. ఆయన రచనలకు దేశభక్తి జీవనాడి. శ్రీ కృష్ణ పరమాత్ముని స్తుతిస్తూ ఆయన ఇలా పేర్కొన్నాడు :

"ఎన్డ్రు తణియు మెంగళ్ సుదందిర దాగం ?
ఎన్డ్రు మడియు మెంగళ్ అడిమైయిన్ మోగం ?
ఎన్డ్రెమదన్నై కై విలంగుగళ్ పోగుం ?।
ఎన్డ్రెమదిన్నల్‌గళ్ తీర్న్దు పొయ్యాగుం ;"

[ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం ?
ఎప్పుడు మడియు మా అడియరి మోహం ?
ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు ?
ఎప్పుడు మా ఇక్కట్టు లన్నీ తీరిపోవు ?]

ఈ విధంగా సాగిన కృష్ణ స్తోత్రం ప్రజలలో తీవ్ర సంచలనం కలిగించింది; ఆ నాటి ఆంగ్ల ప్రభుత్వానికి తీరని ఆగ్రహం తెప్పించింది. తత్ఫలితంగా భారతిని కష్టాలు ఆవరించాయి. అయినా నిరుత్సాహం చెందక ఆయన దేశభక్తి ప్రబోధాత్మకంగా కవితలూ, వ్యాసాలూ మొదలైనవి సంతరించాడు.

తన వలె తన కుమారుడూ గణిత శాస్త్రజ్ఞుడు కావా లని భారతి తండ్రి ఆశించాడు. కాని, సహజ కవి అయిన భారతి కొంత కాలం తమిళ పండితుడుగా పనిచేశాడు. స్వాతంత్ర్యానురక్తు డయిన ఆయనకి ఆ ఉద్యోగం నచ్చలేదు. పైగా తన మనస్సులోని విప్లవాత్మక భావాలను నలుగురికీ తెలియ చేయాలనే ప్రగాఢమైన కోరిక ఆయనలో బలం పుంజుకో సాగింది. అందువల్ల - తమిళ పండిత పదవికి స్వస్తి చెప్పి, పత్రికా రచయితగా మదరాసులోని 'స్వదేశమిత్రన్' పత్రికలో చేరాడు. ఆ పని కూడా ఆయనకి ఆశించిన సంతృప్తిని ఇవ్వలేక పోయింది. ఎందుకంటే తన వ్యక్తి గతాభిప్రాయములను నిర్భయంగా వ్యక్తం చెయ్యలేకపోయాడు. కాగా, భారతి పత్రికా సంపాదకత్వం నిర్వహించ సాగాడు. 'చక్రవర్తిని' మొదలైన పత్రికలు ప్రారంభించాడు. 1906 లో ఆయన 'ఇండియా' అనే ఒక వార పత్రికను ప్రారంభించాడు. స్వాతంత్ర్యం, సమత్వం, సహోదరత్వం - ఇవే ఆ పత్రిక ఆశయాలు. ఎర్రని కాగితాలలో అది వెలువడేది. విడి ప్రతి వెల ఒక్క అణా. కాని, సంవత్సర చందా వివరాలు వింత గొలిపేలా ఉన్నవి, చూడండి :

| | |
|---|---|
| ప్రభుత్వమునకు: | రు. 50-00 |
| జమీందారులు మొదలైన శ్రీమంతులకు: | రు. 30-00 |
| నెలకు రు. 200 పైగా ఆదాయం కలవారికి | రు. 15-00 |
| ఇతరులకు: | రు. 3-00 |

ఆ రోజుల్లో 'ఇండియా' పత్రికకు మంచి ప్రచారం ఉండే దనీ, నాలుగు వేల ప్రతులకు పైగా అమ్మకం జరుగుతూ ఉండే దనీ విజ్ఞుల విశ్వాసం. ఆ పత్రికలో భారతి ఆంగ్ల ప్రభుత్వం వారి నిరంకుశ చర్యల్ని తీవ్రంగా విమర్శించేవాడు. అందువల్ల ఆయన ప్రభుత్వం వారి ఆగ్రహానికి పాల్పడ్డాడు. ప్రభుత్వం ఆయన మీద ఒక కన్ను వేసి ఉంచింది. అప్పుడు మిత్రుల సలహా ననుసరించి భారతి ఫ్రెంచివారి పాలనలో ఉన్న పుదుచ్చేరికి మకాం మార్చాడు. అక్కడ పదేళ్ళ పాటు ఉన్నాడు.

పుదుచ్చేరికి వెళ్ళినా భారతికి కష్టాలు తప్పలేదు. కాని శ్రీ అరవిందులు, వ. వే. సు. అయ్యరు వంటి దేశభక్తులు సాహితీ వేత్తల పరిచయ భాగ్యం ఆయనకి లభించింది. 1920 లో భారతి మళ్ళీ మదరాసులో 'స్వదేశమిత్రన్' పత్రికలో చేరాడు. మునుపటిలా ఉత్తేజకరములైన వ్యాసాలూ, కవితలూ మొదలైనవి వ్రాయసాగాడు కాని ఆయనలో చివరికి వేషంలోనూ మార్పు కొట్టవచ్చినట్టు ఏర్పడింది. వెనుకటి ఉత్సాహం మాయ మయింది. ఆరోగ్యం కూడా దెబ్బ తిన్నది. ఆ రోజుల్లో భారతి ఒక బ్రహ్మజ్ఞానిలా కనిపించేవా డని ఒకాయన పేర్కొన్నాడు. ఆ మరుసటి సంవత్సరం - సెప్టెంబరు 11 న ఒకప్పుడు అగ్ని పర్వతంలా కనిపించిన భారతి కన్ను మూశాడు. ఆయన జననం 1882 లో డిసెంబరు 11 వ తేదీన. భారతి జీవించింది 39 సంవత్స రాలే అయినా, తమిళ సాహిత్య చరిత్రలో నవయుగ ప్రవక్తగా ఆయన నిలిచి పోయాడు.

భారతి సంకుచిత జాతీయవాది కాదు. తమిళ భాషా సాహిత్యము లంటే అపారమైన అభిమానం. కాని, అది అన్య భాషా ద్వేష మెరుగని భాషాభిమానం. కనకనే ఆయన "తెలుగు సుందరమైన భాష" అనగలిగాడు. తెలుగు పదము పాడుతూ, చేర దేశపు చెలులు వెంట రాగా సింధు నదిలో నౌకావిహారం చెయ్యా లని ఆశించాడు. కాశిలో జరిగే విద్వత్ గోష్ఠులు కాంచీపురంలో మారుమోగవలె ననీ, కన్నడ సీమలోని కాంచనమును

రాజపుత్ర వీరులకు కానుకగా ఇవ్వాలనీ, కావేరి తమలపాకులకు బదులుగా గంగా తీరపు గోధుమల్ని తీసుకోవాలనీ కలలు కన్నాడు. అంతేకాదు గాంధీజీ, గోఖలే, ఛత్రపతి శివాజీ, బాలగంగాధర తిలక్ మొదలైన ప్రముఖుల్ని సభక్తికంగా సంస్మరించాడు. సిక్కుల గురు పరంపరలో పదవ వాడూ, 'ఖాల్సా' స్థాపకుడూ అయిన గురుగోవిందసింహుని గురించి దీర్ఘమైన కవిత (204 పాదాలలో) సంతరించాడు. గురుగోవిందుని ప్రతిభనూ, ఆయన విశిష్ట సేవనూ గ్రహించి దానిని కవితలో పెట్టిన భారతీయ మహాకవులు మనకు చాలామంది కనిపించరు.

## జాతీయతా దృష్టి

భారతి జాతీయతా దృష్టికి అవధులు లేవు బెల్జియమ్ స్వతంత్ర దేశం కాగా అప్పుడు కవిత వ్రాశాడు. అలాగే నవ రష్యాను గురించి కూడా కవిత వెలయించాడు. అంతటి విశాల హృదయుడు కనుకనే భాషా వైవిధ్యం లోనూ భావ సమైక్యాన్ని దర్శించ గలిగాడు. ఆయన దర్శించిన భారతమాతను ఆయన మాటల్లో చెప్పాలంటే :

''చెప్పు మొళి పదినెట్టుడైయాళ్ ఎనిన్
చింతనై ఒన్రుడైయాళ్.''

[పదునెనిమిది భాషలు కలది – అయినా భాషలలో ఏకత్వం కలది]

''ఏ ఒక్కని కడుపు మాడినా, ఈ లోకాన్ని నశింప జేద్దాము'', "మహిళను నీచంగా చూచే మౌఢ్యాన్ని కాల్చివేద్దాము'', ''అందరిదీ ఒకే కులము, అందరిదీ ఒకేజాతి, అందరూ భారతీయులు, అందరూ ఈ దేశపు రాజులు''.... ఇలా భారతి భావాలు విప్లవాత్మకంగా కాన వచ్చినా, ఆయన కవితలలోనూ, ఇతర రచనలలోనూ ఆధ్యాత్మిక దృష్టి అంతర్వాహిని అయి ఉంటుంది. ఈ దృష్టి కనుక ఒకవేళ లోపించి ఉంటే, భారతి కవితలు వట్టి

నినాదాలుగా వినిపించి ఉండేవి. అందువల్లనే కొందరు భారతిని గేయకవి అన్నారు. కొందరు విప్లవ కవిగా వర్ణించారు. కొందరి దృష్టిలో అభ్యుదయ భావకవి. ఇంకా కొందరు ప్రకృత్యుపాసకు డని పేర్కొన్నారు. నిజానికి ఆయన రచనల్లో ఇవన్నీ కానవస్తున్నా, భారతి ఆధ్యాత్మిక దృష్టి కల జాతీయ కవి అనడం సమంజసం. పెక్కు దేవతా స్తుతులు వెలయించిన భారతి ఏసుక్రీస్తు, అల్లా అనే శీర్షికలతో కూడా దైవస్తుతి చేశాడు.

## కొత్త నగిషీలు

సంప్రదాయ బద్ధమైన తమిళ సాహిత్యానికి కొత్త నగిషీలు చెక్కిన చిరస్మరణీయుడు భారతి. ఆ సంప్రదాయపు బరువుని తగ్గించి, తమిళ కవితకు సారళ్యము, నవ్యత ప్రసాదించినవాడు భారతి. ఆయన వ్యావహారిక భాషా వాది. చివరికి కవితలలో కూడా కొన్ని వాడుక మాటలు ఉపయోగించాడు అంతవరకూ లేని వచన కవితను తమిళంలో ప్రవేశపెట్టాడు. ఆధునిక బాలసాహిత్యానికి శ్రీకారం చుట్టినవాడు భారతే! ఇలా ఆయన తమిళ సాహిత్యాన్ని కొత్తపుంతలు తొక్కించాడు. ఆయన వ్రాసిన కావ్యాలలో పాంచాలి శపథం, కుయిల్ పాట్టు (కోయిల పాట) ముఖ్యమైనవి. 308 పద్యాల 'పాంచాలి శపథము'నకు ఆయన వ్రాసిన మున్నుడి లోంచి కొన్ని వాక్యాలు ఉదాహరిస్తున్నాను. ఇవి భారతి హృదయాన్ని వ్యక్తం చేయగలవని నా అభిప్రాయం.

"సులభమైన మాటలు సులభమైన శైలి, సులభంగా తెలుసుకోదగిన వృత్తం, ప్రజలు అభిమానించే మెట్టు — వీటితో కావ్యం ఒకటి సంతరించే రచయిత మన మాతృభాషకు ఒక కొత్త జీవం ఇచ్చినవా డవుతాడు. ఒకటి రెండు సంవత్సరాలు కావ్యాధ్యయనం చేసిన తమిళు లందరికీ చక్కగా అర్థమయ్యేలా వ్రాయడమే కాక కావ్య సౌందర్యానికి భంగం వాటిల్లని విధంగా రచన సాగాలి. ఉన్నత గుణములు కలవాడుగాను, దుర్యోధను డంటే ద్వేష భావం కలవాడు గాను ధృతరాష్ట్రుణి చిత్రించాను. నా పాత్ర చిత్రణ

'వ్యాస భారతం' అనుసరించి సాగింది.... తమిళ జాతికి నవజీవనం ప్రసాదించాలని కంకణం కట్టుకున్న ఆ పరాశక్తియే నన్నీ రచనకు ప్రోత్సహించింది".

పాత కొత్తల మేలి కలయిక, భగవంతుని యందు ప్రగాఢమైన విశ్వాసం, కుల భేదాల నిరసన, విప్లవాత్మక ధోరణి మొదలైనవి కూడా భారతి రచనల్లో కనిపిస్తాయి. పిల్లల్ని ఉద్దేశించి ఆ మహాకవి వ్రాసిన కొన్ని గీతాలు చదువుకుని ఆనందిద్దాము :

"వేదము వెలసిన దేశ మిది—మేటి
వీరులు పుట్టిన దేశ మిది!
అఖండ హిందూస్థాన మిది—దైవ
మనుచు పూజింపుము పాపా!"

"జాతులు లేవే పాపా—కులమున
హెచ్చు తగ్గులు ఎంచుట పాపము!
నీతి న్యాయం విద్యా బుద్ధులు
కలవారే జాత్యధికులు".

"కల్లలాడకు పాపా, ఎన్నడూ
చాడీలు చెప్పకు పాపా!
దేవుడే మనల కాపాడు పాపా, ఎట్టి
కీడూ వాటిల్లదు పాపా!"

"ప్రేమించుము జీవకోటిని
విశ్వసించుము భగవంతుని
తప్పక కావలె గుండె దిటవు
జీవన విధాన మిదియె పాపా!"

తమిళ దేశపు తపః ఫలం సుబ్రహ్మణ్య భారతి! "వ్రాసే కలమూ దైవం, ఆ వ్రాతయూ దైవం" అని పేర్కొన్నాడు. కాగా రచన దైవ సమాన మని త్రికరణశుద్ధిగా విశ్వసించిన సుబ్రహ్మణ్య భారతి అక్షరాలా జాతీయ కవి! ఆయన తమిళ నవయుగ ప్రవక్త!

# సంస్కారం మూర్తీభవించిన మనీషి,
# సరస విమర్శకాగ్రేసర చక్రవర్తి
# టి. కె. సి.

---

జననం : 7-8-1882; మరణం : 16-2-1954
ప్రధాన రచనలు : కంబర్ యార్ ? మొ.

కవిత, కథానిక మొదలైన సాహిత్య ప్రక్రియలు అభివృద్ధి చెందినంతగా మన భారతీయ భాషలలో సాహిత్య విమర్శ అభివృద్ధి చెందలేదు. కనుక మనకు ఉత్తమ విమర్శక గ్రంథాలూ అట్టే లేవు. ఇందుకు తమిళమూ అపవాదం కాదు.

ఉత్తమ విమర్శకుడు కావ్యంలోని గుణములనే కాక దోషములనూ తెలియ జెయ్యాలి. సద్విమర్శ కావ్య రసాస్వాదనకు బహుధా తోడ్పడుతుంది. అంతే కాదు, పాఠకుడికి ఆ కావ్యం పట్ల సదవగాహన ఏర్పడడానికి కూడా సద్విమర్శ ఉపకరిస్తుంది. ఈ దృష్టితో చూసినప్పుడు ఉత్తమ విమర్శకుడు రచయితకు శత్రువు కాడు; మిత్రుడు.

ప్రాచీన తమిళ కావ్యాలయందు ఆంగ్ల విద్యాధికులైన పాఠకులకు సైతం సదభిప్రాయం కలగడానికి తోడ్పడిన గత శతాబ్దపు తమిళ రచయితలలో టి. కె. సి. గా ప్రసిద్ధి కెక్కిన టి. కె. చిదంబరనాథ ముదలియార్ ప్రముఖులు. 'రసిక మణి' బిరుదాంకితులైన ఆయన రచనలూ, ప్రసంగాలూ ఆంగ్ల విద్యలో నిష్ణాతులైన తమిళుల్ని తమ మాతృభాషాధ్యయనానికి పురిగొల్పడమే కాక, వారిని తమిళ భాషాభిమానులుగా కూడా తీర్చి దిద్దగలిగాయి. తమిళ భాషా సాహిత్యాలకు టి. కె. సి. చేసిన విశిష్ట సేవ ఇది.

చిదంబరనాథ ముదలియార్ అభిజాత్య సంపన్నులు; అగర్భ శ్రీమంతులు కూడా. స్ఫురద్రూపి. 1882 లో శ్రీవిల్లి పుత్తూరులో జన్మించిన ముదలియార్ గారి తండ్రి పేరు తీర్తారప్ప ముదలియార్. తీర్తారప్ప అంటే శివుడని అర్థం. ఆయన తెన్‌కాశిని ఆనుకుని ఉన్న కళంగాడు ఊరికి అధిపతి. మధుర నేలిన విశ్వనాథ నాయకుడు, కృష్ణప్ప నాయకుడు మొదలైన తెలుగు రాజులకు కుడి భుజంగా ఉండిన దళవాయి ప్రధాని అరియనాథ ముదలి వంశీయుడు టి. కె. సి.

1905 లో బి. ఏ. పట్టభద్రులైన తరవాత చిదంబరనాథ ముదలియార్ మదరాసులోని లా కాలేజీలో చేరి బి. ఎల్ పట్టం కూడా పొందారు. ఆ తరువాత 1916 లో తిరునెల్వేలిలో న్యాయవాద వృత్తి స్వీకరించారు. 1927 నుంచి 1930 దాకా జస్టిస్ పార్టీ పక్షాన మదరాసు శాసన మండలిలో సభ్యులుగా ఉండేవారు. 1930 మొదలుకొని ఒక అయిదేళ్ళు హిందూమతం దేవాదాయ సంఘం కమీషనర్‌గా వ్యవహరించారు. ఆ రోజుల్లో ఎక్కడికి వెళ్ళినా ఆయన ప్రాచీన తమిళ సాహిత్యం, భరతనాట్యం, సంగీతం, శిల్పం మొదలైనవాటిని గురించి ప్రసంగించేవారు. అప్పటి మదరాసు ముఖ్యమంత్రి బొబ్బిలి రాజాగారు, విద్యామంత్రి దివాన్ బహదూర్ ఎస్. కుమారస్వామి రెడ్డియార్ టి. కె. సి మిత్రులు. ఆ తరువాత ఆయన రాజకీయాలనుంచి విరమించుకున్నారు.

చిదంబరనాథ ముదలియార్‌కి గల స్వభాషాభిమానం అనిర్వచనీయం. ఆయన ఒకసారి తనను గురించి ఇలా చెప్పుకున్నారు : "టి. కె. సి. అని ఒక డుండేవాడు. తమిళ భాష వలె మరొక భాష ప్రపంచంలో లేదనీ, తమిళ కవిత వలె, కంబకవి కవిత వలె మరొకటి లేదనీ చెపుతుండేవాడు." ఆయన మాతృ భాషాభిమానం అంత ప్రగాఢమైనదే అయినా, అది అన్య భాషాధ్యయనానికి అడ్డు తగలలేదు. టి. కె. సి. కి గల ఆంగ్ల భాషా పాండిత్యం అసాధారణ మయిందనీ, ఆయన సొంత లైబ్రరీలో సుమారు 7,000 పుస్తకాలు ఉండే వనీ, వాటిలో ముక్కాలు మువ్వీసం ఆంగ్ల గ్రంథాలే అనీ విజ్ఞులు చెపుతారు. ఖగోళశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, సంగీతం, భరతనాట్యం మొదలైన వాటిపట్ల ఆయనకు అపారమైన ఆసక్తి ఉండేది. సంగ్రహంగా చెప్పాలంటే టి. కె. సి. అభ్యుదయ వాది.

పైగా, చిదంబరనాథ ముదలియార్ శుద్ధ ద్రావిడ భాషావాది కాదు. ఆయన రచన సరళ సుందరంగా ఉంటుంది. సంస్కృత శబ్దాలు ఎన్నో ఆయన ఉపయోగించారు. ఈ సందర్భంలో మరొక విషయం కూడా పేర్కొనడం సమంజసం. రాజాజీ, 'కల్కి' రా. కృష్ణమూర్తి వంటి ప్రసిద్ధులు టి. కె. సి. ని తమ గురువుగా భావించారు.

ప్రతిభా సంపన్నుడే అయినా, టి. కె. సి. రచించిన పుస్తకాలు అట్టే లేవు. 'కంబర్ యార్' ('కంబర్ ఎవరు'), 'ఇదయ ఒలి' (హృదయనాదం') మొదలైనవి ఆయన రచనలు. మొదట్లో ఆయన కవితలు వ్రాశారు. కావి కవిత కంటె వచన రచనే మంచి దనుకుని ఆయన ఆ తరువాత వ్యాసాలూ, విమర్శలూ ఎన్నో వెలయించారు. అది కాక, ఆయన జీవిత కాలంలోని చాలా భాగం 'కంబ రామాయణ' పరిశీలనలోనూ, ఆ రామాయణంలోని సొగసుల్ని నలుగురికీ తెలయజేయడంలోనూ వినియోగించ బడింది. 'కంబర్ తరుం కాట్చి' అనే శీర్షికతో ఆయన 'కల్కి' పత్రికలో ధారా వాహికంగా

చాలాకాలంపాటు వ్యాసాలు వ్రాశారు. కంబ రామాయణాన్ని సరిగా అర్థం చేసుకోవడానికి ఆ వ్యాసాలు ఎంతగానో ఉపకరించా యని చెప్పడం చర్విత చర్వణమే అవుతుంది. ఆయన వచన రచనలో జీవశక్తి ఉన్నట్టు విమర్శకుల అభిప్రాయం.

తమిళ భాష సుసంపన్నమైన దనీ, దాని ద్వారా ఏ విషయమునైనా వేర్వవచ్చు ననీ టి. కె. సి. అభిప్రాయం. అయినప్పటికీ - కొత్తగా కొన్ని మాటలు సృష్టించడం కంటే వ్యవహారంలో కలిసిపోయిన మోటారు, రైలు బండి, సైకిలు వంటి మాటలను స్వీకరించడమే సముచిత మని ఆయన మదరాసు విశ్వవిద్యాలయం వారికి ఒక సందర్భంలో మనవి చేశారు. కల్చర్ (సంస్కృతి) అన్న ఆంగ్ల శబ్దానికి 'పణ్ పాడు' అనే తమిళ శబ్దమును రూపొందించిన వారు చిదంబరనాథ ముదలియారే! ఈ మాటను ఈ నాడు అందరూ సర్వ సాధారణంగా వాడుతున్నారు.

చిదంబరనాథ ముదలియార్‌గారి అభిమాన రచన మహాకవి కంబడు వెలయించిన రామాయణం. ఆ రామాయణ కృతి అంటే ఆయనకి అవిరళ భక్తి విశ్వాసా లున్నా, ఆ కావ్యమును గురించి ఎంతో వ్రాసినా, విమర్శనా దృష్టితో చూచినట్లయితే, ప్రస్తుతం ప్రచారంలో ఉన్న 42,276 పాదాల ఆ కావ్యమంతా కంబ మహాకవి రచన కాదని ఆయన నిశ్చితాభిప్రాయం. ఆయన అందుకు కారణాలు చూపకపోలేదు. ఆయన దృష్టిలో 'కంబ రామాయణం' ప్రక్షిప్తాల మయం. ఉదాహరణానికి - టి. కె. సి. పరిష్కరించి ప్రకటించిన 'కంబ రామాయణం'లో (కంబర్ తరుం రామాయణం, మూడు భాగాలు) బాలకాండలో 167 పద్యములూ, అయోధ్యాకాండలో 550 పద్యములూ మాత్రమే చోటు చేసుకో గలిగాయి. అయితే, వాడుకలో ఉన్న, కంబ రామాయణపు ప్రతులలో బాల కాండలో 1,420 పద్యాలూ, అయోధ్యా కాండలో 1,210 పద్యాలూ ఉన్నాయి. అంత నిశితంగా ఆయన కంబ రామాయణాన్ని అధ్యయనం చేశారు.

వచన రచనలు వెలయించినా, టి. కె. సి. ది కవి హృదయం అనడం సమంజసం. ఆయన వ్యాసాలలో సాధారణంగా కవితలు కొన్ని ఉదాహరించ బడతాయి. అంతేకాక, సహజమైన హాస్యం ఆయన రచనకు పెట్టని భూషణం. అందువల్లనే టి. కె. సి. సాహిత్య విమర్శలు పాఠకులకు చప్పిడి భోజనంగా కాక, షడ్రసోపేతమైన విందు భోజనంలా కనిపిస్తాయి.

కొన్ని తమిళ శబ్దముల పుట్టు పూర్వోత్తరములను గురించి కూడా చిదంబరనాథ ముదలియార్ వ్యాసాలు వెలయించారు. 'అల్లి' అనే శబ్దానికి ఆయన ఇచ్చిన వివరణ తెలియజేస్తాను. తెలుగు నిఘంటువులలో కూడా 'అల్లి' దేశ్య శబ్దంగా చూపబడింది. కలువ వంటి ఒకానొక జల పుష్పం అని అర్థం ఇవ్వబడింది తమిళంలోనూ ఇదే అర్థంలో ఈ శబ్దం ప్రయుక్తం. ఇక టి. కె. సి. మాటలు పరిశీలించండి. "కొన్ని వేల సంవత్సరాలకు మునుపు ఒక తమిళుడు (ఆ పువ్వుని) చూశాడు ఓ - అలాగా ! రాత్రిపూట గదా ఇది వికసించింది ! ఈ నిజాన్ని మిత్రులకు కూడా తెలియజేద్దాం అనుకుని, వారి వద్దకు వెళ్ళి 'అల్లి' అన్నాడు ! 'అల్' అంటే రాత్రి. అల్లుం పగలుం (రాత్రీ పగలూ) అని మనమూ వాడుతున్నాం...." రాత్రిపూట వికసించే పువ్వు కనుక, దానికి 'అల్లి' అనే పేరు ఏర్పడిం దని ఆయన పేర్కొన్నారు

ఆధునిక తమిళ సాహిత్య విమర్శలో కొత్త పుంతలు తొక్కి, తన రచనల ద్వారా ప్రాచీన కావ్యాల సదవగాహనకు కొండంత అండగా నిలిచి, బహుముఖ ప్రతిభాశాలిగా పేరు పెంపులు గడించి, నేటికీ 'రసికమణి టి. కె. సి.' గా నిలిచిపోయిన చిదంబరనాథ ముదలియార్ తెన్‌కాశిలో 1954 లో ఫిబ్రవరి 16 న కన్ను మూశారు. ఆయన ఉత్తమ విమర్శకుడే కాదు; చక్కని, చిక్కని వచన రచయితే కాదు; ఉత్తమ సంస్కారం రూపు గట్టిన మనీషి. ఆకృతి వలె, ఆయన రచనలూ మనోఽభిరామములు !

# నుడికారానికి సన్నిహితంగా ఆధునిక వచన రచన తీర్చిదిద్దిన తిరు. వి. క.

జననం : 26-8-1883; మరణం : 17-9-1953

ప్రధాన రచనలు : పెరియ పురాణ వ్యాఖ్య మొ.

"శ్రీమాన్ తిరు. వి కళ్యాణ సుందర ముదలియారు అలంకరించిన ఈ సంపాదక స్థానంలో కూర్చోడానికి నేను జంకుతున్నాను. ఆయన పాండిత్యం, ధైర్యం, నీతి, నిజాయితీ, నిష్పక్షపాత వైఖరి, అవసరమైనప్పుడు ప్రదర్శించిన నిర్దాక్షిణ్యభావం మొదలైనవి పత్రికా సంపాదకుని పదవికే అలంకారము లయినవి."

తమిళ పండితుడుగా, పత్రికా సంపాదకుడుగా, రాజకీయ నాయకుడుగా, కార్మిక నాయకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించిన తిరు. వి. కళ్యాణసుందర ముదలియారును గురించి ప్రసిద్ధ దేశభక్తుడూ, సుప్రసిద్ధ తమిళ రచయితా అయిన వ. వే. సు. అయ్యరు గారు ప్రకటించిన అభిప్రాయ మిది. ఇవి పొల్లు మాటలు కావు. నేటికీ కళ్యాణ సుందరం ముదలియారు తిరు. వి. క. గా తమిళుల వ్యవహారంలో నిలిచి ఉన్నారు.

తిరు. వి. క. 1883 లో ఆగష్టు 26 వ తేదిన చెంగల్పట్టు జిల్లాలోని తుళ్ళం అనే గ్రామంలో జన్మించారు. తండ్రి వృద్ధాచలం ముదలియారు. తల్లి చిన్నమ్మాళ్, వాళ్ళది తిరువారూరికి చెందిన ప్రసిద్ధ శైవకుటుంబం

## చదువు సంధ్యలు

తిరు. వి. క. చదువు సంధ్యలు మద్రాసులో సాగాయి. ఆయన వెస్లీ కళాశాలలో కొంతకాలం చదివారు. కారణాంతరాల వల్ల అది సరిగా సాగలేదు. మరైమలై అడిగళ్ మొదలైన ప్రముఖ పండితుల వద్ద ఆయన తమిళ కావ్యాలు క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. ప్రజాహిత కార్య కలాపాలలో పాల్గొనసాగారు. ఆ రోజుల్లో ఆయన స్పెన్సర్ కార్యాలయంలో పని చేస్తూ ఉండేవారు. లోకమాన్య తిలక్ కారాగార బద్ధులైన వార్త విని, ఆయన ఆ ఉద్యోగాన్ని విరమించుకున్నారు. తరువాత వెస్లీ కాలేజీలో తమిళ పండితుడుగా చేరారు.

కాని - తిరు. వి. క. ప్రతిభ పత్రికారంగంలో ప్రవేశించిన తరువాతనే నలుగురికీ తెలియవచ్చిం దని భావించవచ్చును. 1917 లో 'దేశభక్తన్' అనే పత్రికను స్థాపించారు, ఆ మరుసటి సంవత్సరం ఏప్రిల్ 27వ తేదిన మద్రాసు కార్మికుల సంఘం ఒకటి స్థాపించారు. ఇది మన దేశంలో వెలుగులోకి వచ్చిన మొదటి కార్మిక సంఘ మని విజ్ఞుల అభిప్రాయం. మరి రెండేళ్ళకు 'నవశక్తి' అనే పత్రికను స్థాపించారు.

## 'నవశక్తి'

తిరు. వి. క. కి ముందు తమిళ పత్రికల భాష సంస్కృత సమాసాలతో నిండి నిబిడీకృతమై జటిలంగా ఉండేది. కాని, ఆయన రంగంలో ప్రవేశించిన తరవాత విశిష్టమైన మార్పు ఏర్పడింది. తమిళ నుడికారానికి

సన్నిహితమైన శైలిని ఆయన ప్రవేశ పెట్టారు. ఆయన ఉపన్యాసాలు కూడా సంస్కృత పద బాహుళ్యం ఏ మాత్రమూ లేని శైలిలో సాగేవి. ఆ శైలి తరవాతి రచయితలకు ఒరవడి అయింది.

ఇతర భాషలలో వలె, తమిళ సాహిత్యంలోనూ వచన రచనలకు ప్రాముఖ్యం కలిగింది ఆధునిక యుగంలోనే. తొలినాళ్ళలో జీవించిన రచయితలు పద్య రచనకు ప్రాధాన్యం ఇచ్చినంతగా వచన రచనకు ప్రాధాన్యం ఇవ్వలేదు. కాని, తిరు. వి. క. వచన రచనకు ప్రాచుర్యం కల్పించడమే కాక, ఆధునిక తమిళ వచన శైలికి గట్టి పునాది వేశారు. కనుకనే ఆయన 'తమిళ వచన రచనా పితామహుడు' గా భావించ బడుతున్నాడు. పైగా ఆయన ప్రముఖ సమన్వయ వాది కూడా. కొత్త పాతలనూ, విజ్ఞాన శాస్త్రములనూ, సంప్రదాయ చరిత్రలనూ సమాదరించి, ఆయన ఒక సమన్వయ మార్గం అవలంబించారు. అందువల్లనే మత సంబంధమైన ప్రాచీన వాఙ్మయంలో కానవచ్చే మంచిని ఆయన చక్కగా గ్రహించగలిగారు. ఇందుకు ఆయన 'మురుగన్' లేక (సౌందర్యము) అనే ప్రముఖ రచన ఒక ప్రశస్తమైన నిదర్శనం. ఇది 1925 లో వెలువడింది. పదవ ప్రచురణ 1956 లో వచ్చింది. ఆయన దృష్టిలో మురుగన్ (షణ్ముఖుడు) దైవమే కాదు; సౌందర్యానికి ప్రతీక. తిరు. వి. క. మాటలలోనే ఈ భావాన్ని వివరిస్తాను.

"మురుగన్ అన్నది భగవంతుణ్ణి సూచించే తమిళ శబ్దం. ప్రకృతి (ఇయర్కై) అన్నది కూడా తమిళ శబ్దమే. ఈ రెంటికీ ప్రతి భాషలోనూ వేర్వేరు మాట లున్నవి. భాషా భేదాన్ని పురస్కరించుకుని కలహం పెంచుకోవడం అవివేకం. భాషా భేదాన్ని సరకు సేయక. ఆ యా మాటలలోని అర్థాన్ని గ్రహించడం తెలివికి అందం. తమిళులు దర్శించిన సౌందర్యమును, దాన్ని అనుభవించేందుకు అనుసరించిన సహజమైన మార్గమును ఏ భాషా

శబ్దాలతో వ్యవహరిస్తే మాత్రమేం ? ...ప్రకృతి సౌందర్యం మురుగన్ ఆకృతిలో ఉండడం మీరు గమనించారా ? మురుగనికి ఎన్నో దేవాలయాలు ఉన్నాయి. సర్వాంతర్యామి అయిన ఆ దేవుడికి ఇక కొత్త గుళ్ళు, గోపురాలు అక్కరలేదు. అతని మార్గాన్ని వృద్ధి చేసేందుకు సంఘాలు స్థాపించండి; కళాశాలలు స్థాపించండి. అర్థం గ్రహించి అతని నామ సంకీర్తనం చెయ్యండి. ప్రకృతిలో కానవచ్చే అతని దివ్య సౌందర్యాన్ని గ్రంథస్థం చెయ్యండి. పాటలుగా పాడండి. అసత్యమైన జ్ఞానాన్ని పెంచుకుని మురుగన్ మీద ఉన్న భక్తిని, విశ్వాసాన్ని పాడు చేసుకోవద్దు ''

'మనిద వాళ్క్కైయుం, గాంధి అడిగళుం' (మానవ జీవితమూ, గాంధీ మహాత్ముడూనూ), 'కట్టురై త్తిరట్టు' (వ్యాస మంజరి), 'తమిళ్ తెన్ఱల్' (తమిళం తెమ్మెర), 'ఇండియావుం, విడుదలైయుం' (ఇండియా, స్వాతంత్ర్యం) మొదలైన ఎన్నో గ్రంథాలు తిరు. వి. క. లేఖిని నుంచి వెలువడ్డాయి. ఇవన్నీ ఆయన జాతీయాభిమానమునకు నిదర్శనాలు.

మహిళల్ని గురించి కూడా తిరు. వి. క. చక్కని గ్రంథాలు వ్రాశారు. 'పెణ్ణిన్ పెరుమై' లేక 'వాళ్కై తుణై' (స్త్రీ ఘనత లేక సహధర్మచారిణి) అన్నది ఈ కోవకు చెందిన ప్రశస్త రచన.

## ఆధ్యాత్మిక రచన

ఆధ్యాత్మిక చింతనకు సంబంధించిన 'ఇమయమలై' లేక ధ్యానం, 'శైవ సమయ సారం' మొదలైన గ్రంథాలు ఆయన వ్రాశారు. నాయన్మారులను గురించి వ్రాశారు. తమిళ గ్రంథాలలో గల బౌద్ధమును ఆధికారికంగా వివరించారు. భక్తకవి అయిన రామలింగస్వామిని గురించి చక్కని రచన వెలు

యించారు. నమ్మాళ్వారుని గురించి కూడా ప్రశస్తమైన రచన వెలయించారు. అలాగే ఏసుక్రీస్తు బోధనలలోని విశిష్టతను వివరించారు. ఆ రోజుల్లోనే తిరు. వి. క. మార్క్సిజమును, గాంధీ విధానములను తులనాత్మకంగా పరిశీలిస్తూ రచన చేశారు.

ఈ వివిధ రచనల్ని అలవోకగా పరిశీలించినా, తిరు. వి. క. బహు ముఖ ప్రజ్ఞాశాలి అయిన రచయితగా గోచరిస్తారు. ఆయన దృష్టి అటు ప్రాచీన విషయాల మీదికీ, ఇటు మార్క్సిజం వంటి నవ్య విషయాల మీదికీ సరి సమానంగా ప్రసరించిం దని చెప్పడం నిర్వివాదం. కాగా, తిరు. వి. క. నవ్యదృష్టి సంతరించుకున్న పాతకాలపు పండితుడు. ఈ సందర్భంలో అరవై ముగ్గురు శివభక్తుల జీవిత విశేషాలను తెలియజేసే 'పెరియ పురాణా'నికి ఆయన వ్రాసిన పరిశోధనాత్మకమైన వివరణ పేర్కొనదగింది. అలాగే, తమిళ వేద మనబడే తిరుక్కురళ్'కి తిరు. వి. క. వెలయించిన వ్యాఖ్యానం కూడా పేర్కొనదగిందే!

జాతీయ కవి

# నామక్కల్ రామలింగం పిళ్లై

జననం : 19-10-1888; మరణం : 24-8-1972
ప్రధాన రచనలు: గాంధి అంజలి, తమిళన్ ఇదయం మొ.

1931 లో తంజావూరు జిల్లాలోని వేదారణ్యంలో ఉప్పు సత్యాగ్రహం జరిగినది. దానికి రాజాజీ నాయకత్వం వహించారు. అందులో సత్యాగ్రహులు ఎందరో పాల్గొన్నారు. వారు ఈ కింది గీతం ఆలపిస్తూ ముందుకి నడిచారు.

"కత్తి యిన్ఱి రత్త మిన్ఱి
యుద్దమొన్ఱు వరుగుదు
సత్తియత్తిన్ నిత్తియత్తై
నంబుం యారుం సేరువీర్.

.... .... .... .... .... .... ....

కత్తులు లేని నెత్తురు లేని
యుద్ధ మొకటి వస్తున్నది
సత్య మెపుడు నిలుచు నంచు
తలచు వారు చేరండి.

కన్నది లేదు విన్నది లేదు
ఖండన మీ మాదిరి
మునుపెన్నడో చేసిన పున్నెము
పండెను ఈ నాడు.

గాంధి యనెడు శాంతమూర్తి
చూపిన మంచి మార్గ మిది
మానవాలికి బాధ తగ్గగ
వెలసిన దైవ మార్గ మిది."

స్వాతంత్ర్య సమరం తమిళనాడులో సాగిన ఆ రోజుల్లోనే కాక, ఆ తరువాత కొంత కాలం కూడా తమిళులు ఎంద రెందరినో ఉత్తేజ పరిచిన ఈ గీతాన్ని సంతరించిన నామక్కల్ వెం. (వెంకట రామ) రామలింగం పిళ్ళై సుప్రసిద్ధ జాతీయ కవి, ఆయన ప్రముఖ దేశభక్తుడు.

రామలింగం పిళ్ళై సేలం జిల్లాలోని మోహనూర్ అనే గ్రామంలో 1888 అక్టోబరు 19 న జన్మించారు. 1972 ఆగస్టు 24 న మదరాసులో మరణించారు. అప్పుడా కవిశేఖరునికి జోహార్లు సమర్పిస్తూ రాజాజీ అన్న మాటలు పేర్కొనదగినవి: "రామలింగం పిళ్ళై సచ్ఛీలుడు. ఈ రోజుల్లో ఎంతో ప్రముఖంగా చెప్పవలసిన విషయ మిది; ముమ్మూర్తులా ఆయన

గాంధీ భక్తుడు. ఆయన కవి, చిత్రకారుడు, దేశభక్తుడు." ఈ మాటలు నామక్కల్ కవి వ్యక్తిత్వమును వ్యక్తం చేస్తున్నవి.

రామలింగం పిళ్ళై ప్రాథమిక విద్యాభ్యాసం కోయంబత్తూరులో జరిగింది. తరువాత తిరుచ్చిరాపల్లిలోని ఎస్. పి. జి. కళాశాలలో చదివారు. ప్రసిద్ధ కవిగా పేరు పెంపులు ఆర్జించినా, మొదట్లో ఆయన దృష్టి చిత్రలేఖనం మీదికి ప్రసరించింది. చిత్రకారుడుగా ప్రసిద్ధి చెందాడు. ఆయన చిత్రకళా నైపుణ్యాన్ని గుర్తించిన అప్పటి ప్రభుత్వం అయిదవ జార్జి సార్వభౌముని ఆగమనాన్ని పురస్కరించుకుని 1911 లో ఢిల్లీలో వైభవోపేతంగా జరిగిన దర్బారులో ఆయనకు ఒక బంగారు పతకం బహూకరించింది.

ఆ తరువాత నామక్కల్ కవి గాంధీజీ ప్రభావానికి లోనయ్యారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. రెండు సార్లు జైలు శిక్ష కూడా అనుభవించారు ఆయన. కాలం పరుగిడే కొద్ది గాంధేయ కవి అనే కీర్తి కలిగింది. ఆయన సంతరించిన గీతాలు తమిళనాడులో అంతటా మారుమోగ సాగినవి. "తిలక్ నాటిన విత్తనం భారతిగా మొలకెత్తగా, గాంధి నాటిన విత్తనం నామక్కల్ కవిగా రూపొందింది" అన్న రాజాజీ మాటలు ఈ సందర్భంలో ఉదాహరించ దగినవి. కనుక ఆయన మీద గాంధీజీ ప్రభావం ఎంత గాఢమైనదో మనం ఊహించుకో వచ్చు.

నామక్కల్ కవి ఎన్నో కవితలు వెలయించారు. కొన్ని కవితలలో జాతీయతా దృష్టితో పాటు గేయాంశం కూడా చోటు చేసుకోవడం గమనించదగిన అంశం. తమిళన్ ఇదయం (తమిళుని హృదయం), అవనుం అవళుం (అతడు-ఆమె), గాంధి అంజలి మొదలైనవి ఆయన కావ్యాలలో గణించ దగినవి. 'అవనుం అవళుం' సులభ శైలిలో సాగిన పద్య రచన. కాని,

నామక్కల్ కవికి చిరకీర్తి కలగడానికి 'గాంధి అంజలి'లోని గీతాలే కారణమని విజ్ఞుల అభిప్రాయం.

ఆయన సాహిత్య విమర్శ గ్రంథాలు కూడా వెలయించారు. తమిళ వేద మని ప్రసిద్ధి కెక్కిన తిరుక్కురళ్‌కి చక్కని వ్యాఖ్యానమే కాక, తిరువళ్ళువర్ ఆత్మీయతను తెలియజేసే పుస్తకం కూడా వ్రాశారు. ఆయన సంతరించిన 'మలైక్కళ్ళన్' అనే నవలను చలన చిత్రంగా తీశారు.

తమిళ మన్నా, తమిళు డన్నా తీరని అభిమానం ప్రదర్శించినా, రామలింగం పిళ్ళైది పర భాషా ద్వేష మెరుగని స్వభాషాభిమానం. 'తమిళనాడు ఏది, తమిళు డెవరు?' అనే ఒక కవితలో ఆయన ఇలా పేర్కొన్నారు: "తమిళనాడులో ఏ భాష ప్రవేశిస్తే మాత్ర మేమి? తమిళ భాషను ఏం చేస్తుం దది ? అనే భావంతో ప్రాచీనులు తమిళనాడులోకి ప్రవేశించిన ప్రతి భాషనూ ఆహ్వానించి తమిళమును అభివృద్ధి చేసుకున్నారు. తమిళ భాషా చరిత్రను సరిగా తెలుసుకోకుండా కొందరు హిందీ అంటే మండి పడుతున్నారు. తమిళ దేశపు గొప్ప తనాన్ని భావించడం లేదు." ఆయన ప్రకటించిన భాషా సహనం ప్రశంసార్హం!

గాంధీ భక్తుడుగా, గాంధేయ కవిగా ప్రసిద్ధ కెక్కిన రామలింగంపిళ్ళై గాంధీజీని గురించి వ్రాసిన ఈ క్రింది కీర్తనను పరిశీలించండి:

— పల్లవి —

"మంచి సమయమురా! దీనిని జార విడువకురా!

— అనుపల్లవి —

దేశములోన స్వాతంత్ర్యము స్థాపించి
దేశీయులలో అస్పృశ్యత రూపు మాపగ ॥మంచి॥

జాతీయ కవిగా రామలింగం పిళ్ళై ప్రతిభను ఆయన జీవిత కాలం లోనే తమిళులు గుర్తించడం ఎంతైనా గమనించదగిన విషయం. 1945 లో మదరాసు పౌరులు, రచయితలు ఆయనకు సుమారు ఇరవై వేల రూపాయలు బహూకరించారు. బెంగుళూరు తమిళులు కూడా ఆయన్ని ఘనంగా సత్కరించారు. అవిభక్త మదరాసు రాష్ట్రంలో 1949 లో ఆయన మొదటి తమిళ ఆస్థాన కవిగా నియుక్తులైనారు. ఆ తరువాత మదరాసు శాసనమండలి సభ్యులుగా రెండుసార్లు నియుక్తులైనారు. భారత ప్రభుత్వం నామక్కల్ కవిని పద్మభూషణ్ బిరుదుతో సత్కరించింది. ప్రజలూ ప్రభుత్వమే కాక, కేంద్ర సాహిత్య అకాడెమీ కూడా ఆ కవిశేఖరుని సముచిత రీతిని గౌరవించింది. అకాడెమీ తమిళ సలహా సంఘంలోను, జనరల్ కౌన్సిల్‌లోను, కార్యవర్గం లోను ఆయన కొంతకాలం సభ్యుడుగా ఉండేవాడు

నామక్కల్ రామలింగం పిళ్ళై కవితను ప్రశంసిస్తూ భారతి ఒకసారి ఇలా అన్నాడు: "మీరు కవులు, సందేహం లేదు. పిళ్ళైగారూ! మీరు నన్ను చిత్రంలో చిత్రించండి. నేను మిమ్మల్ని కావ్యంలో చిత్రిస్తాను."

సుబ్రహ్మణ్య భారతి వంటి ప్రముఖుల ప్రశంసలు అందుకున్న జాతీయ కవి నామక్కల్ రామలింగం పిళ్ళై ధన్యుడు!

## ప్రజా రంజకంగా
## పత్రికల భాష తీర్చి దిద్దిన
# కృష్ణమూర్తి

జననం: 9-9-1889; మరణం: 5-12-1954

ప్రధాన రచనలు: అలై ఓశై, శివకామియిన్ శపథం మొ.

తమిళ నవలకు ప్రచుర ప్రచారం కల్పించిన విశిష్ట రచయిత కల్కి అనే ప్రసిద్ధ నామాంతరం కల రా. కృష్ణమూర్తి. కర్నాటకం, తమిళ్ మగన్, వివసాయి, యమన్, అగస్త్యర్ అనే మారు పేర్లతో కూడా ఆయన రచనలు వెలయించారు.

తమిళ సాంస్కృతిక పునరుజ్జీవనానికి బహుధా తోడ్పడిన ప్రముఖులలో ఒకరు కల్కి. ఆయనకు ముందు తమిళ రచనలలో గిలిగింతలు పెట్టే హాస్యానికి కాని, మనస్సుని నొప్పించని వ్యంగ్యానికి కాని స్థానం ఉండేది కాదు. హాస్యమునూ, వ్యంగ్యమునూ తగు పాళ్ళలో రంగరించి, కల్కి తమిళ వచన రచనకు ఒక కొత్త సోయగాన్ని సమకూర్చారు. అలాగే తమిళ పత్రికల భాష కూడా ఆయనకి ముందు జటిలంగా ఉండేది. ప్రజా రంజకమైన

శైలిని సృష్టించి పాఠకులలో పఠనాసక్తిని కల్కి కలిగించారు ఆయన పత్రికా సంపాదకుడు కావడం వల్ల ప్రజల అభిరుచిని చక్కగా గ్రహించి, తదనుగుణంగా రచన సాగించారు. పైగా ఆయనది విశాల దృక్పథం. ఆయన జాతీయతా దృష్టి కలవాడు. 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని కరూరులో అరెస్టు అయినారు. ఆ తరువాత సత్యాగ్రహోద్యమంలో పాల్గొని మూడు సార్లు జైలుకి వెళ్ళారు.

## బాల్యం - విద్యాభ్యాసం

కల్కి కృష్ణమూర్తి తంజావూరు జిల్లాలోని బుద్ధమంగలం అనే గ్రామంలో 1889 సెప్టెంబరు 9 న జన్మించారు. తండ్రి రామస్వామి అయ్యరు. ఆయన ఆ ఊరి కరణం. కృష్ణమూర్తి చదువు బుద్ధమంగలం ప్రాథమిక పాఠశాలలో ప్రారంభమై, తిరుచిరాపల్లిలోని జాతీయ కళాశాల పాఠశాలలో ముగిసింది. చిన్నతనంలో ఆయన హరికథలు చెప్పేవాడు; భజన కీర్తనలు బాగా పాడే వాడు. 1954 లో డిసెంబరు 5 న ఆయన కన్ను మూశారు.

ఆ నాటి ప్రముఖులలో ఒక రయిన తిరు వి. కళ్యాణసుందరం ముదలియారు నిర్వహిస్తూ ఉండిన 'నవ శక్తి' అనే పత్రికలో చేరడంతో కృష్ణమూర్తి జీవితం ఒక మలుపు తిరిగినది. ఆయన వ్రాసిన వ్యాసాలూ, వాటిలోని భాషా రాజాజీ అంతటి మేధావిని ఆకర్షించాయి. ఆ తరువాత రాజాజీ సంపాదకత్వాన వెలువడుతూ ఉండిన 'విమోచనం' అనే పత్రికలో ఆయన చేరారు. 'కల్కి' అనే పేరుతో వివిధ విషయాలను గురించి వ్యాసాలెన్నో ఆయన లేఖిని నుంచి వెలువడ్డాయి తరువాత 'ఆనంద వికటన్' అనే పత్రికలో చేరి, ఆ పత్రికాభివృద్ధికి అనల్పమైన కృషి చేశారు. 1941 లో 'కల్కి' పత్రికను స్థాపించి, సాహిత్య సేవకు తన జీవితాన్ని అంకితం చేసుకున్నారు. పత్రికా రచయితగా ముప్పయ్యేళ్ళ అనుభవం ఆయనకు ఉంది

## చారిత్రక నవల

కథానిక, నవల, పుస్తక సమీక్ష, వ్యాసం, ప్రయాణం మొదలైన సాహిత్య ప్రక్రియలు చేపట్టి కల్కి ఉత్తమ రచనలు చేసి, తరువాతి వారికి మార్గదర్శకు లయారు. ముప్ఫయికి పైగా గ్రంథ రచనలు చేశారు. ఆయన రచనలలో 'శివకామియిన్ శపతం', 'పార్ధివన్ కణవు' (పార్థివ స్వప్నం), 'వీణై బవాని', అలై ఓశై (అలల ఘోష), 'భారతి పిరన్దార్', 'పొన్నియిన్ సెల్వన్' మొదలైనవి ప్రసిద్ధ రచనలు.

కల్కి సేవ బహుముఖ మైనప్పటికీ, తమిళ నవలా చరిత్రలో ఆయన ఒక ప్రధాన ఘట్టంగా నిలిచి పోయినట్లు నిస్సందేహంగా చెప్పవచ్చు. ముఖ్యంగా, చారిత్రక నవలా రచనలో ఆయన కొత్త బాటలు వేశారు. తమిళ సంస్కృతి అంటేనూ, ప్రాచీన చోళ మహీపతు లంటేనూ కల్కికి ఎనలేని అభిమానం. పల్లవ రాజుల్ని గురించి కూడా ఆయన నవలలు సంతరించారు. ఈ సందర్భంలో ఒక్క విషయం చెప్పడం అవసరం. ఆ యా నవలల్లో కనుపించే వ్యక్తులు చారిత్రక పురుషులే అయినప్పటికీ, ఇతివృత్తాలు మాత్రం కల్పితాలు. కాని, అవి చదువుతున్నంత సేపు చోళుల కాలంలోనో, పల్లవుల కాలంలోనో నివసిస్తున్నామా అన్న భావం కలుగుతుంది పాఠకులకు. కల్కి రచనా విధానానికీ, సన్నివేశ కల్పనా చాతురికీ ఆయన చారిత్రక నవలలు మంచి ఉదాహరణాలు. 'శివకామియిన్ శపతం', 'పార్ధివన్ కణవు' ప్రశస్తములుగా భావించబడుతున్నవి. పాత్రల్ని ఆదర్శప్రాయంగా తీర్చి దిద్దడం, ముందు పుటలలో రచయిత ఏమి చెప్పనున్నాడో అనే ఉత్కంఠ కలిగించడం, సరళమూ, హృద్యమూ అయిన కథాకథనము కల్కి రచనలలో సర్వసాధారణంగా కనిపించే కొన్ని ముఖ్య లక్షణాలు. పైగా అవి ధారావాహికంగా పత్రికలలో ప్రచురితం కావడం జరిగింది. అంతర్నాటకాలు కూడా చొప్పించ బడినవి. సమకాలిక వాతావరణాన్ని స్ఫురింప జేసే సన్నివేశాలూ, పాత్రలూ కొన్ని కల్పించడం కూడా జరిగింది.

## అలై ఓకై

"నేను వ్రాసిన పుస్తకాలలో ఏఖై లేక నూరేళ్ళ పాటు నిలువ గలిగేది ఏదైనా ఒకటి ఉన్నదంటే, అది 'అలై ఓకై' అని నా అభిప్రాయం" అని కల్కి పేర్కొన్నారు. ఇది 828 పుటల పెద్ద నవల. ఇది సాంఘిక నవలే అయినా, దీన్ని రాజకీయ నవల అని పేర్కొనడం సముచితం. "ఈ నవలను గాంధీ యుగ పురాణ మన వచ్చు" అని ఒక విమర్శకుడు సహేతుకంగా అభిప్రాయ పడ్డాడు ఇది సత్య సంపూర్ణం. ఉప్పు సత్యాగ్రహం, కరాచీ కాంగ్రెసు, బీహారు భూకంపం, హరిపురా కాంగ్రెసు, సంస్థానాధిపతుల ధోరణి, 1942 ఆగస్టు ఉద్యమం, దాని తాలూకు పోరాటం, ఆగస్టు 1947, ఆ తరవాత భారత దేశంలోనూ, పాకిస్తాన్‌లోనూ చెలరేగిన మత కలహాలు, కాందిశీకుల శిబిరాలు, గాంధీ నిర్యాణం మొదలైన ఎన్నో అంశాలను కల్కి ఈ బృహద్రచనలో సమర్థంగా ముచ్చటించారు. భూకంపం, తుఫాను, అగ్ని పర్వతం, ప్రళయం అని నాలుగు భాగాలుగా తమ నవలను విభజించారు. బీహారు భూకంపం గురించి భూకంపం అనే భాగంలో వివరించబడింది. తుఫానులోని ప్రధాన విషయంగా కాంగ్రెసు సంస్థలో సోషలిస్టు పక్షానికి చెందిన యువకులు కొందరు తెచ్చిన తుఫాను ముచ్చటించబడింది. అగ్నిపర్వతం అనే భాగంలో 1942 లో ప్రతి భారతీయుని హృదయంలోనూ ఉవ్వెత్తుగా లేచిన భావోద్వేగం వ్యక్తీకరించబడింది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం మతం పేరుతో మన దేశంలో వ్యాప్తమైన కలుషిత వాతావరణం 'ప్రళయం'లో చిత్రించబడింది. ప్రధాన కథలో డొంక తిరుగుడు కొంచెం లేకపోలేదు. అయినా కల్కి ప్రదర్శించిన కమనీయ కథా కథన చాతురివల్ల ఈ పెద్ద నవలను చదివేటప్పుడు విసు గనిపించదు. సంగ్రహంగా చెప్పవలెనంటే స్వాతంత్ర్యానికి ముందూ, ఆ వెనుకా మన దేశంలో రాజకీయంగా నెలకొన్న వాతావరణానికి ఈ నవల దర్పణం వంటిది.

## బహుమతి

కల్కి మరణానంతరం, అనగా 1956 లో 'అలై ఓశై 'కి సాహిత్య 'అకాడమీ'వారి బహుమతి లభించింది

రచయితగానే కాక తమిళ భాషా సంస్కృతుల అభిమానిగా కూడా కల్కి చిరకీర్తి సముపార్జించారు. సంగీత విద్వాంసులనూ, నటులనూ ఆయన ప్రోత్సహించారు. నామక్కల్ రామలింగం పిళ్ళై మొదలైన కవులను సన్మానించేందుకు నిధి సేకరణ కావించారు. ఎట్టయాపురంలో సుబ్రహ్మణ్య భారతి మండప నిర్మాణానికి కూడా ఆయనే మూల కారణం. కొంతకాలం తమిళ రచయితల సంఘానికి అధ్యక్షుడుగా వ్యవహరించారు. ఎన్నో నాటకాలను నిష్పాక్షికంగా విమర్శించి, ఆ విధంగా తమిళ నాటక ప్రచారానికి దోహదం చేశారు. 'జన సమూహాన్ని నిజంగా సంస్కరించ దలుచుకున్న వాడు చేపట్టవలసిన సాధనం నాటకమే!' అని ఆయన ఒక చోట తెలియజేశారు. సి. ఎన్. అణ్ణాదురై వ్రాసిన 'ఓరిరవు' (ఒక రాత్రి), ఎన్. డి. సుందరం రచించిన 'మనిదనుం మిరుగముం' (మానవుడూ, మృగమూను), అవ్వైయార్ మొదలైన నాటకాలకు ఆయన చక్కని విమర్శలు వెలయించారు.

## జాతీయ వాది

దేశ భక్తుడుగా, జాతీయ వాదిగా, పత్రికా రచయితగా, నవలాకర్తగా, తమిళభాషా సంస్కృతుల అభిమానిగా కల్కి రా. కృష్ణమూర్తి చేసిన సేవ విశిష్టమైనది. ప్రజా రంజకమైన శైలిని వ్యాప్తిలోకి తీసుకువచ్చి, తమిళ నవలకు ప్రచుర ప్రచారం కల్పించిన ప్రముఖ రచయిత కల్కి. ఆ నాళ్ళలో ఆయన పాల్గొనని రాజకీయోద్యమం కాని, ప్రముఖ సాహిత్య సమావేశం కాని లేవనడం అతిశయోక్తి కాదు. భారతి ప్రారంభించిన తమిళ సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని పటిష్ఠం చేసిన ప్రముఖుడు రా. కృష్ణమూర్తి. ఆయన చిరంజీవి!

# విప్లవ కవి
# భారతిదాసన్

జననం : 29-4-1891; మరణం : 21-4-1964

ప్రధాన రచనలు: కుటుంబ విళక్కు, పిసిరాంద్రైయార్ మొ.

ఆధునిక తమిళ సాహిత్యానికి నాంది పలికిన సుబ్రహ్మణ్య భారతికి తరువాత పేర్కొనదగిన ప్రముఖ కవి భారతి దాసన్. ఆయన భారతి అనుయాయి. వారిద్దరికీ తమిళనాడంటేనూ, తమిళ భాషా సాహిత్యాలంటేనూ మహాభిమానం.

"కవితకు వార్త కెక్కిన తమిళనాడు — కీర్తి
కంబకు జనన మందిన తమిళనాడు
సెం దమిళు నాడని వినినంతనే
స్రవించు తేనెలు శ్రవో యుగళిలో...."

అని భారతి తమిళనాడును ప్రస్తుతించగా, భారతి దాసన్ తమిళ భాషను ఇలా ప్రస్తుతించారు :

"తమిళమునకు పేరు అమృతము, ఆ
తమిళము మాకు ప్రాణ తుల్యము.
తమిళమునకు వెన్నెల అని పేరు, ఆ
తమిళము మాకు జీవము.
తమిళమునకు సౌరభ మని పేరు, ఆ
తమిళము మాకై వెలసిన ఊరు.
తమిళమునకు మధు వని పేరు, ఆ
తమిళము మా హక్కుల పైరుకి పేరు."

భారతి వలె భారతి దాసన్ కూడా కొత్త పుంతలు తొక్కినవారే. అయితే భారతిదాసన్ రచనల్లో విప్లవాత్మక ధోరణి కనిపిస్తుంది. పాతకాలపు ఆచార వ్యవహారాలు, మూఢనమ్మకాలు మొదలైనవి నశించి నవ సమాజం ఏర్పడాలని ఆయన ఆశించాడు. తన అభిప్రాయాలను మొగమాటమి లేకుండా వ్యక్తీకరించాడు. ఒక కవిత ఇలా సాగింది :

"జాతి మత భేదములు
మూఢ నమ్మకాలు నిండిన
ఈ కయ్యాల జగతిని
పెనుగాలిలో ధూళిగా చేసి
ఆవల నిర్మింతము
నవ జగతిని నిర్మింతము."

మరొక కవితలో ఇలా పేర్కొన్నాడు :

"శాంతిలో లోకం వర్ధిల్లుట మంచిదా
మత భేదాలతో సతమత మగుట మంచిదా ?
మానవుల్ని జాతులుగా విభజించుట సరియా
మానవు లంతా ఒక్క జాతిగా మనుట సరియా?"

'పురట్చి క్కవిజ్ఞర్' (విప్లవ కవి)గా తమిళనా డంతటా ప్రసిద్ధి కెక్కిన భారతి దాసన్ అసలు పేరు అది కాదు. ఆయనకి తల్లిదండ్రులు పెట్టిన పేరు సుబ్బురత్నం. 1891 లో ఏప్రిల్ 29 వ తేదిన ఆయన పుదుచ్చేరిలో జన్మించాడు. సుబ్బురత్నం తొలుత ఒక ఫ్రెంచి పాఠశాలలో చేరాడు. తరువాత తమిళ పాఠశాలలో చేరి తమిళం అభ్యసించసాగాడు. ఆ తరువాత పదహారవ ఏట కల్వేలోని కళాశాలలో చేరాడు. మొదటి నుంచీ మాతృభాష అంటే ప్రగాఢమైన అభిమానం కలవాడవడం వల్లనూ, కృషిచేసి తమిళంలో పాండిత్యం గడించడం వల్లనూ సుబ్బురత్నం పరీక్షలో సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు. అనంతరం కారైక్కాల్‌లోని ప్రభుత్వ పాఠశాలలో తమిళ పండితుడుగా చేరాడు. అప్పు డాయన పద్దెనిమి దేళ్ళ యువకుడు. తమిళ పండితుడుగా సుమారు నాలుగు శతాబ్దాల పాటు పని చేసి, 1946 లో ఉద్యోగ విరమణ చేశారు.

అయితే, సుబ్బురత్నమునకు భారతి దాసన్ అనే పేరు ఎలా వచ్చింది? ఇందుకు ఒక చిన్న కథ ఉన్నది.

ఒకనాడు సుబ్బురత్నం ఒక పెళ్ళికి వెళ్ళాడు. భోజనానంతరం ఆయన భారతి వ్రాసిన ఒక జాతీయ గీతం పాడాడు. భారతి కూడా ఆ పెళ్ళికి వెళ్ళాడు. కాని, భారతి వచ్చినట్లుగా గాని, తాను పాడిన జాతీయ గీతాన్ని ఆయన విన్నట్లుగా గాని సుబ్బురత్నానికి తెలియదు. ఆ గీతం వినగానే సుబ్బురత్నం కవి కాగల డనే భావం భారతికి కలిగి ఉండవచ్చు. ఆ తరువాత ఒకనాడు ఈ విషయాన్ని భారతి తన మిత్రులకు తెలియజేశాడు. అప్పుడు వాళ్ళు "అయితే అతణ్ణి కవిత్వం చెప్ప మనండి, చూద్దాం:" అన్నారు. భారతి ఆదేశానుసారం సుబ్బురత్నం 16 పంక్తుల కవిత చెప్పాడు.

"ఎచట పరికించినను ఆ శక్తియే, తమ్ముడా !
ఏడు సంద్రములూ ఆమె రూపమే !
నెలకొన్న కోటి లోకములూ
వెలుగుచుండు ఆ తల్లి చేతి బంతుల్లా !
ఒక్కసారి మేఘ వితానము
గర్జించుట ఎరుగుదురా ఎవరైనా ?
అయితే, ఆమె నవ్విన నవ్వది అది—
ఆమె దరహాస మచట మెరసినది."

భారతి శక్త్యుపాసకుడు పరాశక్తి నుద్దేశించి ఆయన పెక్కు గీతాలు సంతరించారు. భారతిదాసన్ చెప్పిన ఈ కవితలో భారతి ప్రభావం వ్యక్తం కావడం వల్ల సుబ్బురత్నమును భారతిదాసన్ అని ఆ నాటినుంచీ వ్యవహరించ సాగారు. ఆయనకి భారతి ప్రశంస లభించింది. అంతేకాదు, సుబ్బురత్నం వ్రాసిన మొదటి కవితను 'స్వదేశ మిత్రన్' పత్రికకు పంపిస్తూ భారతి ఇలా వ్రాశారు: "శ్రీ సుబ్రహ్మణ్య భారతి కవితా మండలికి చెందిన కనక సుబ్బురత్నం వ్రాసినది".

భారతితో ఆయన సుమారు పదేళ్ళ పాటు సన్నిహితంగా సంచరించాడు కూడా. భారతి పుదుచ్చేరి జీవితంలోని వివిధ ఘట్టములూ ఆయనకి తెలుసు. ఈ విషయాలను కనుక పరిశీలిస్తే, సుబ్బురత్నం భారతిదాసన్‌గా వ్యవహృతుడు కావడంలో వింత లేదనిపిస్తుంది. చివరికి భారతిదాసన్ అనే పేరే తమిళ నాడులో ప్రచారంలోకి వచ్చింది.

భారతిని ప్రశంసిస్తూ కొన్ని రచనలు కూడా చేశారు భారతి దాసన్. కొత్తపుంతలు చూపిన కవి అనీ, మహా కవి అనీ, ప్రాచీన తమిళ కావ్యా ధ్యయనం వల్లనే కేవలం ఆయన అంత ఉన్నత స్థితిని చేరుకోలేదనీ పేర్కొన్నారు.

భారతిదాసన్ అభ్యుదయ భావాలు కల కవి. కుల భేదాల నిరసన, మత భేదాల ఖండన మొదలైనవి ఆయన కవితలలో కనిపిస్తాయి. చదువు సంధ్యలు నలుగురికీ లభించాలని ఆయన ఆశించాడు. సమాజంలో సమత స్థాపితం కావాలని పేర్కొన్నాడు. లక్ష్యసాధన కోసం పోరాడే స్వభావం ఆయనది. ఆయనలో స్వాతంత్ర్యేచ్ఛ ప్రబలంగా ఉండేది. పంజరంలో బంధించబడిన చిలక నుద్దేశించి భారతిదాసన్ వెలయించిన ఈ కవితను పరిశీలించండి :

"తినుటకు పెట్టెదరు తీయని పళ్ళు
ఎన్నెన్నో ఇచ్చెదరు పప్పులు నీకు!
'అందాల కొలికీ!' అనుచు పొగడెదరు.
అవలోకించుము ఒక్కసారి చక్కని చిలకా!

కనుకనే స్వాతంత్ర్యేచ్ఛ మిక్కుటంగా కల భారతిదాసన్ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడంలోనూ ఆశ్చర్యం లేదు. ఆయన తన మనోగతాభిప్రాయాలను నలుగురికీ తెలియజేయడంకోసం పత్రికలు నిర్వహించారు. ఆ రోజుల్లో ఆయన ఖద్దరుని గురించి పాటలు వ్రాశారు. అవి రసవత్తరములైనవని సహృదయుల అభిప్రాయం. 'సుబ్రమణియర్ తుది యముదు' (సుబ్రహ్మణ్య స్తోత్రామృతం) అనే గ్రంథంలో ఆయన వ్రాసిన కీర్తనలు ప్రచారం గడించినవి.

అయితే, కాలక్రమాన భారతిదాసన్ దృక్పథంలో మార్పు ఏర్పడింది, భాషా సహనం లోపించింది. ప్రసిద్ధ విద్వాంసులు టి. పి. మీనాక్షి సుందరం ఇలా పేర్కొన్నారు :- "స్వాతంత్ర్యానంతరం వెలువడిన ఆయన రచనల్లో ఔత్తరాహులంటేనూ, బ్రాహ్మణులంటేనూ ఒక నిరసన భావం కానవస్తున్నది. .... వచనంలో వ్రాయవలసిన దాన్ని పద్య రూపంలో పెట్టినట్టుగా కనిపిస్తాయి కొన్ని రచనలు .... ఏది ఎలా ఉన్నా, ఆయనకి నిరాకారుడైన భగవంతుని

యందూ, మహాపురుషులైన రామలింగస్వామి, రామానుజాచార్యులు, భారతి మొదలైన వారి యందూ భక్తి ఉన్నట్లు చెప్పవలసి ఉన్నది ....".

ప్రకృతి సంపద, ప్రేమ, తమిళనాడులో సినిమా, తమిళుడు, బిల్హణ కవి మొదలైన ఎన్నో విషయాలను గురించి భారతిదాసన్ కవితలు వెల యించారు. అవి వ్యాప్తిలో ఉన్నవి కూడా. 'కుటుంబ విళక్కు' (కుటుంబ దీపం) అనే కవితా సంకలనం ఆయన రచనల్లో చాలా ప్రసిద్ధి కెక్కింది. ఆదర్శ గృహిణిని గురించి ఇందులో మనోజ్ఞంగా వివరించబడింది ఆయన దృష్టిలో మంచి కుటుంబం విశ్వవిద్యాలయం వంటిది. ఆయన కవిత ఉదాత్త భావ సమన్వితమైనా, నడుమ నడుమ హాస్యరసం చోటు చేసుకుంది ఆయన రచనల్లో కనిపించే విశేషాలలో ఇదొకటి. భాషమీద మంచి అధికారం ఉన్నది. కనుకనే, భారతిదాసన్ రచనల్లో భావగాంభీర్యమే కాక, భాషా గాంభీర్యమూ కానవస్తుంది. ఆయన భావాలను కొన్నిటిని 'కొట్టుమురసే' (కొట్టు భేరీ) అనే కవితలో చూడవచ్చు.

'లోకం నీది' అనే కవితలో భారతిదాసన్ భావించిన సమతావాదం ప్రతిఫలించినది.

భారతిదాసన్‌కు పలుచోట్ల సన్మానములు జరిగినవి. 1955 లో ఆయన పుదుచ్చేరి శాసనసభకు ఎన్నుకోబడ్డారు. 1968 లో జరిగిన ద్వితీయ ప్రపంచ తమిళ మహాసభల సందర్భంగా మదరాసులో ఆయన శిలా విగ్రహం ఆవిష్కరించబడింది. ఆయన రచించిన 'పిసిరాందైయార్' అనే రచనకు 1969 లో కేంద్ర సాహిత్య అకాడెమీవారి (మరణానంతరం) బహుమతి లభించింది. ఇది పద్య నాటకం. తమిళ సాహిత్య చరిత్రలో తొలియుగమైన సంగ యుగంలో నివసించిన పిసిరాందైయార్ అనే కవి జీవితం ఇందులో వర్ణించబడింది. ఇది రసవద్రచన మని పండితుల అభిప్రాయం.

తన రచనావళులతో ఆధునిక తమిళ సాహిత్యమును పరిపుష్టం చేసిన భారతిదాసన్ 1964 లో కాలధర్మం చెందారు.

పిల్లలకు కూడా భారతిదాసన్ పాటలు వ్రాశారు. తమిళం, ప్రకృతి, వివిధ వృత్తులు, పక్షులు, జంతువులు మొదలైనవి ఆయన ఎన్నుకున్న వస్తువులు. పద్య కథలూ, లాలి పాటలూ కూడా వ్రాశారు.

తన కవితలలో శ్రమజీవికీ, మిల్లు కార్మికులకూ, చేనేత కార్మికులకూ ఆయన ప్రాధాన్యం ఇచ్చారు. మానవుడంటేనూ, అతని శక్తి సామర్థ్యము లంటేనూ ఆయనకు అపారమైన విశ్వాసం. 'ముల్లై కాడు'లోని కవితలు ఆయన జాతీయతా దృష్టికీ, 'కుయిల్' (కోయిల)లోని రచనలు ఆయన మత పరమైన దృష్టికీ నిదర్శనాలు. ఇక భారతిదాసన్‌కి భారతి మీద గల ఆదరభావం నిరుపమానం. భారతి ప్రపంచ కవి అని ఆయన విశ్వాసం. అసత్యమైన ఏ మత సిద్ధాంతమూ అగ్నివంటి భారతిని సమీపించ జాలదని ఆయన నమ్మకం. కాగా, విప్లవ కవి అయిన భారతిదాసన్ కుహనా సంప్రదాయాలకు వ్యతిరేకంగా నిలిచిన రచయితగా భావించడం సమంజసం.

# ఉత్తమ పరిశోధక విద్వాంసుడు వైయాపురి పిళ్లై

జననం : 12-10-1891; మరణం : 17-2-1956

ప్రధాన రచనలు : బృహన్ని ఘంటువు, కంబన్ కావియం మొ.

పరిశోధనకు సత్యాన్వేషణమే ఆయువు పట్టు. సత్యనిష్ఠ కల పరిశోధనే ఉత్తమ పరిశోధన అవుతుంది. ఏదో ఒక సిద్ధాంతాన్ని సమర్థించే దృక్పథంతో కనుక పరిశోధనకు దిగితే, అది వాసన లేని పువ్వుగా పరిణమిస్తుంది. పరిశోధకుడు రాగ ద్వేష రహితుడైనప్పుడే ఉత్తమ పరిశోధనకు ఆస్కారం ఏర్పడుతుంది. కాని, పరిశోధకుడు అందరి మన్ననలకు పాత్రుడు కాలేడు. ఒక్కొక్కసారి బహుళ ప్రచారంలో ఉన్న సిద్ధాంతాన్ని అతను సమర్థించక పోవచ్చు. అందువల్ల పండిత లోకంలో సైతం అతనికి రావలసినంత ప్రచారం రాక పోవచ్చు. పాఠకుల ఆదరాభిమానములూ లభించక పోవచ్చు. అయినా సరే, తాను నిజ మని నమ్మిన విషయాన్నే నిర్భయంగా నొక్కి చెప్పగల పండితుడే ఉత్తమ పరిశోధకుడు. అటువంటి ఉత్తమ తమిళ పరిశోధక విద్వాంసులలో ఒకరు ఎస్. వైయాపురి పిళ్లై.

## పండిత వంశం

1891 అక్టోబరు 12న తిరునెల్వేలి జిల్లాలోని వణ్ణార్‌పేట్టై అనే గ్రామంలో వైయాపురి పిళ్లై జన్మించారు. తండ్రి పేరు శరవణప్పెరుమాళ్ పిళ్లై. శైవుడు. తమిళ పండితుడు. తల్లి పాపమ్మాళ్. తండ్రి వద్దనే వైయాపురి పిళ్లై చదువు సంధ్యలు కొంతకాలం పాటు సాగాయి. ఆ తర్వాత గణపతి పిళ్లై అనే ఆయన వద్ద ఆయన తమిళం బాగా అభ్యసించారు. తర్వాత మదరాసు క్రైస్తవ కళాశాలలో బి. ఏ. చదివారు. రాజధాని కంతటికీ తమిళంలో సర్వ ప్రథముడుగా ఉత్తీర్ణులై, సేతుపతి బంగారు పతకం పొందారు. ఆ తర్వాత తిరువనంతపురంలోని న్యాయ కళాశాలలో చదివి బి. ఎల్. డిగ్రీ పొందారు. సుమారు పదేళ్ళపాటు న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. ఆ తర్వాత, తమిళ భాషా సాహిత్యాలకు తన జీవితాన్ని అంకితం చేసుకున్నారు. చిన్నప్పటి నుంచే తమిళమంటే ఆయనకు సహజ సిద్ధమైన అభిమానం ఉండేది. విద్యార్థి దశలోనే కవితలు వ్రాశారు.

వైయాపురి 1926 లో మదరాసు విశ్వవిద్యాలయం వారి తమిళ లెక్సికన్ (బృహన్నిఘంటువు) కార్యాలయంలో సంపాదకులుగా చేరారు. అది ఆయన జీవితంలో ఒక మలుపు. పదేళ్ళకు నిఘంటువు పూర్తి అయింది. ఆయన నిర్విరామంగా సలిపిన కృషి పండితుల్ని బహుధా ఆకర్షించింది. ప్రభుత్వం మెచ్చుకున్నది. రావుసాహెబ్ అనే బిరుదు ప్రసాదించారు. మదరాసు విశ్వవిద్యాలయం వారు ఆయన్ని తమిళశాఖకు అధ్యక్షులుగా నియమించారు. ఆ పదవిలో ఆయన పదేళ్ళు సుమారు సమర్థంగా పనిచేశారు. అనంతరం తిరువనంతపురం విశ్వవిద్యాలయంలో మూడేళ్ళపాటు తమిళ ప్రొఫెసరుగా పని చేశారు. చివరకి, మదరాసులోనే స్థిరనివాసం ఏర్పరచుకుని, ఆ మరణాంతం—అనగా 1956 వరి 17 దాకా—పూర్తిగా రచనా వ్యాసంగంలో మునిగి పోయారు

## బహు భాషావేత

తమిళంలోనే కాక ఆంగ్లంలోనూ ఆయన ప్రశస్తమైన రచనలు చేశారు. 'హిస్టరి ఆఫ్ టమిళ్ లాంగ్వేజ్ అండ్ లిటరేచర్', 'రిసర్చ్ ఇన్ ద్రవిడియన్ లాంగ్వేజెస్' మొదలైనవి ఆయన ఆంగ్ల రచనలు. గ్రంథకర్తగా వైయాపురిపిళ్ళై తన బహుముఖ ప్రతిభను లెస్సగా ప్రదర్శించుకున్నారని చెప్పడం సత్య సన్నిహితం.

తమిళ బృహన్నిఘంటు కార్యాలయంలో పని చేస్తున్న రోజుల్లో ఆయన ఎన్నో నిఘంటువులూ, తాళపత్ర గ్రంథాలూ సేకరించారు. కంబ రామాయణం తాలూకు ప్రతులు ఎన్నో ఉన్నాయి ఆ సేకరణలో. ఆ వివిధ పత్రుల్ని సంప్రతించి శుద్ధ ప్రతి ఒకటి తయారుచేసి దాన్ని ప్రచురించాలని వైయ్యాపురిపిళ్ళై ప్రగాఢ వాంఛ. అందు నిమిత్తం ఆయన కృషి చేశారు కూడా. 'కంబన్ కానియం' అనే ఉత్తమ రచన కూడా చేశారు కాని సంశోధిత కంబ రామాయణాన్ని ఆయన ప్రకటించలేక పోయారు. ఆయన ఇంటికి పెట్టుకున్న పేరు 'కంబన్ నిసైయం.' కంబ కవి అన్నా, కంబ రామాయణ మన్నా ఆయనకి ఎనలేని అభిమానం.

## సహాయిం స్నాహాం

వైయాపురిపిళ్ళై అతి నిరాడంబరులు. ఎంద రెందరో పరిశోధకులకు అమూల్యాలైన సలహాలు అందించారు. సాహిత్య విద్యార్థుల సందేహాలు తీర్చేవారు. ఆయన సొంత గ్రంథాలయంలో ఎక్కు నిఘంటువుల ప్రతులూ, కంబ రామాయణపు ప్రతులూ, భరత నాట్యానికి సంబంధించిన తాళదళ గ్రంథాలూ, సంస్కృత గ్రంథాలూ ఉండేవట! జర్మన్, ఫ్రెంచి భాషలలో సైతం గ్రంథాలు అందులో ఉండేవట. ఆ అమూల్యమైన గ్రంథాలయాన్ని వైయాపురిపిళ్ళై మరణానంతరం ఆయన సంతతివారు కలకత్తాలోని జాతీయ గ్రంథాలయానికి బహూకరించారు.

సంస్కృతం తమిళమునకు దాది లేక పెంపుడు తల్లివంటిదని వైయా పురిపిళ్ళై నిశ్చితాభిప్రాయం. ఇక ఈ అంశాన్ని ఆయన మాటలలోనే వివరిస్తాను—"తమిళభాషను సంస్కృతం పోషించిం దని చెప్పడానికి మూడు అంశాలు తోడ్పడతాయి. 1. తమిళంలోని శబ్దాలు. 2. తమిళ గ్రంథాలలోని ఇతి వృత్తాలు. 3. తమిళ సాహిత్య సంప్రదాయాలు. సంస్కృతంతో సరి సమాన స్థాయిలో తమిళభాషను అభివృద్ధి చెయ్యాలనే కాంక్ష తమిళనాడులో ప్రముఖంగా ఉంది. తమిళానికి లక్షణం కల్పింపనెంచిన గ్రంథాలు కూడా సంస్కృత లక్షణ గ్రంథాలను బహుధా అనుసరించాయి. ఇట్లా సంస్కృతంతో తమిళం సన్నిహిత సంబంధం ఏర్పరచుకున్న కారణాన తమిళంలో పాండిత్యం పొంద దలచిన వారికి సంస్కృతభాషా పరిచయం తప్పని సరి అవుతున్నది"

## సంస్కృతం అందరిదీనూ

సంస్కృతం భారతీయుల ఉమ్మడి భాష అని కూడా ఆయన ఒకచోట నిరూపించారు. ఇది ఆధునికి భావం కాదనీ, మయిలైనాదర్ వంటి ప్రాచీనులు ఇలాగే భావించారనీ ఆయన స్పష్టం చేశారు. తమిళ భాషను గురించి ఇలా వ్రాశారు. తొల్కాప్పియర్ కాలంలోనే పెక్కు అన్య భాషా శబ్దాలు తమిళంలో చోటు చేసుకున్నవి.... ఒకప్పుడు సంస్కృత శబ్దాలు విపరీతంగా గ్రంథాలలో ప్రవేశించి తమిళమునే కబళించసాగాయి దీన్ని మణిప్రవాళశైలి అని కొందరు ప్రశంసించారు కూడా. హద్దు మీరిన ఈ (సంస్కృత) పద ప్రయోగాన్ని ఖండించేందుకు గాని, పరిహరించేందుకు గాని ప్రాచీన తమిళులు వెనుదీయలేదు. కన్నడ శబ్దాలూ, తెలుగు మాటలూ తమిళంలో కాలక్రమాన వచ్చి చేరినవి (తమిళర్ పన్ పాడుం ఇలక్కియముం, పుటలు 28—29).

వందకు పైగా నవలలు వ్రాసిన
# కోదైనాయకి అమ్మాళ్

జననం : 1-1-1901 ; మరణం : 20-2-1960
ప్రధాన రచనలు : వైదేహి, తియాగక్కొడి మొ. నవలలు

ఈ నాడు ప్రతిభాషలోనూ ప్రముఖ రచయిత్రులు కొందరైనా కనిపిస్తారు. ఇది హర్షించదగిన అంశం. సుమారు యాభైయేళ్ల క్రితం రచయిత్రుల సంఖ్య, అందులోనూ పేరు పెంపులు గడించిన రచయిత్రుల సంఖ్య అత్యల్ప మనడం సాహసం కాదు. అటువంటప్పుడు, ఆ రోజుల్లో ఒక రచయిత్రి సొంతంగా ప్రెస్సు ఒకటి నెలకొల్పడమే కాక పత్రిక కూడా నిర్వహించిందంటే ఎంతైనా కొనియాడ దగిన విషయం. ఈ విశిష్ట గౌరవం ప్రముఖ తమిళ నవలా రచయిత్రి వై. ము. కోదైనాయకి అమ్మాళుకి చెందుతుంది.

కోదైనాయకి అమ్మాళు 1901 లో చెంగల్పట్టు జిల్లాలోని సింగప్పెరుమాళ్ కోవిల్ అనే చోట జన్మించారు. ఏడవ ఏట వివాహం జరిగింది. భర్త పేరు వై. ము. పార్థసారథి అయ్యంగారు. వైత్తమానిధి ముడుంబై అన్నది ఇంటిపేరు. వైత్తమానిధి అనగా విత్తనిక్షేపం అని అర్థం. ఇది

తిరునెల్వేలి జిల్లాలో ఉంది. పార్థసారథి అయ్యంగారి సోదరులైన శఠకోప రామానుజాచారి, గోపాలకృష్ణమాచారి ప్రసిద్ధ తమిళ విద్వాంసులు. గోపాల కృష్ణమాచారి వ్యాఖ్యాన సహితంగా ప్రచురించిన కంబరామాయణం అమూల్య మైనది. ఆ వ్యాఖ్యానంలో అవాల్మీ కాంశాలు కూడా యథోచితంగా పేర్కొన్నారు.

కోదై నాయకి అమ్మాళ్ ప్రముఖ రచయిత్రిగా రూపొందడానికి ఆమె భర్త ప్రోత్సాహం ప్రముఖ కారణంగా చెప్పబడుతున్నది.

నూటికి పైగా నవలలు పంతరించిన కోదై నాయకి అమ్మాళ్ మొదట్లో ఏమీ చదువుకోలేదంటే ఆశ్చర్యం కలుగుతుంది. 15, 16 ఏళ్లు వచ్చేదాకా ఆమెకు తమిళం చదవనుగాని, వ్రాయనుగాని తెలియదు. ఆమె నలుగురు అప్ప చెల్లెళ్ళకూ కథలు చదవడమంటే మహా సరదా, వాళ్లు కథలు చదువుతూంటే, అవి శ్రద్ధగా వింటూ వుండేదట కోదై నాయకి అమ్మాళ్. క్రమ క్రమంగా తానూ కథలు చెప్పా లనే ఉబలాటం ఆమెకు కలిగింది. పద్దెనిమిదవ ఏట తా ననుకున్నది ఒక కథగా చెప్పింది. మరొకరు వ్రాశారు. ఆ తర్వాతనే ఆమె చదవను, వ్రాయను నేర్చుకుంది.

1924 లో ఆమె తొలి పుస్తకం 'ఇంద్రమోహన' వెలువడింది. ఇది నాటకం. ఆ నాటి ప్రముఖ రచయితలుగా పేరు గడించిన కా. నమశ్శివాయ మొదలియారు, వడువూర్ దురైస్వామి అయ్యంగారు ప్రభృతుల దృష్టిని అది ఆకర్షించింది. నమశ్శివాయ మొదలియారు పిల్లలకోసం సులభమైన భాషలో కథలూ, గేయాలూ ఎన్నో వెలయించారు. నాటక రచయిత కూడా. ఆయన రచనలేని పాఠ్యపుస్తకం ఆ నాళ్ళలో లేదన్నా అతిశయోక్తి కాదు. దురైస్వామి అయ్యంగారు ప్రసిద నవలా రచయిత. ఆ రోజుల్నిబట్టి ఆయన అపరాధ పరి శోధక నవలలు చాలా వ్రాశారు. ఈ ప్రముఖు లిద్దరి ప్రోత్సాహంతో కోదై నాయకి అమ్మాళ్ నవలలు వ్రాయడం మొదలుపెటారు.

కోదై నాయకి అమ్మాళ్ కేవలం రచయిత్రియే కాదు. స్వాతంత్ర్య సమరంలో సముచితంగా పాల్గొన్న దేశభక్తురాలు కూడా. విదేశీ వస్తు బహిష్కారణోద్యమంలో ఆమె పాల్గొన్నారు. తత్ఫలితంగా ఆమెకు ఆరు నెలలు కారాగారవాస శిక్ష పడింది. జైలులో ఆమెకు కొందరు తెలుగు దేశభక్తురాండ్రతో పరిచయం ఏర్పడింది. జైలు జీవితాన్ని ప్రాతిపదికగా చేసుకుని 'సోదనై యిన్ కొడుమై' అనే నవలను ఆమె వ్రాశారు. ఇందులో జైలు జీవితం గురించి ఆమె విన్న అంశాలు కూడా చోటు చేసుకున్నాయి.

ఆమె నవలలకు సంబంధించిన విమర్శలు జగన్మోహిని అనే మాసపత్రికలో అచ్చు పడేవి. ఇతర పత్రికలలో వెలువడే విమర్శలను కూడా ఈ పత్రికలలో ప్రకటించేది. విమర్శకు కోదై నాయకి అమ్మాళ్ ఎంతో ప్రాధాన్య మిచ్చినట్లు భావించవచ్చు

1925 లో జగన్మోహిని పత్రికను ఆమె తన సొంతం చేసుకున్నారు. తదాదిగా ఆమె నవలలు అందులో ధారావాహికంగా వెలువడ సాగాయి. అలా ప్రచురితములైన వాటిలో వైదేహి, పద్మసుందరన్, చంపక విజయం మొదలైనవి పేర్కొనదగినవి. కోదై నాయకి అమ్మాళ్ రచనలలో వైదేహి ప్రశస్తమైన దని కొందరి అభిప్రాయం. ఆ తర్వాత ఆమె సొంత అచ్చుకూటం నెలకొల్పి రాజాజీ ఆశీర్బలంతో నిర్వహించ సాగారు.

ఖద్దరు వస్త్రధారిణి అయిన కోదై నాయకి అమ్మాళుకి ఆ నాటి స్వాతంత్ర్యోద్యమ నాయకులతో బాగా పరిచయం ఉండేది. రాజకీయ సమావేశాలలో పాల్గొనడమే కాకుండా, జాతీయ గీతాలు శ్రావ్యంగా ఆలపించి సదస్యుల్ని సంతోషంలో ముంచి వేసేవారు. ఆమె 1960 లో కన్ను మూశారు.

ఇక ఆమె నవలా ప్రపంచాన్ని పరిశీలించేందుకు మునుపు, ఆ రోజులలో వెలువడుతూ ఉండిన తమిళ నవలల్ని పరిశీలించడం అవసరం. నాటి పాఠక లోకంలో కాలక్షేపంకోసం నవలలు చదివే వారి సంఖ్యే ఎక్కువ. పని

పాటులు లేని పరిచారకులు, బయట చేరిన రోజులలో ఎలా కాలం గడపడమా అని తపించే తరుణులు, గృహిణులు, వ్యాపారం నామమాత్రంగా ఉండే అంగడి యజమానులు, ఆ అంగళ్ళలో పని చేసే వారు, పత్రభుక్కులైన సోమరిపోతులు మొదలైనవారు కాలక్షేపంకోసం నవలలు చదివేవారు. ఆ అవసరాన్ని గుర్తించి రచయితలు కొందరు అపరాధ పరిశోధక నవలలను సంతరించారు. ఆంగ్లంనుంచి కొన్ని రచనలు తమిళం చేశారు. వీటిలో సాహిత్యపు విలువ లేని మాట వాస్తవం అయినప్పటికీ వీటి వల్ల ఒక ప్రయోజనం కలగకపోలేదు. పఠనాసక్తి ఎక్కువయింది. పాఠకుల సంఖ్య ఎక్కువయింది. ఈ కోవకు చెందిన నవలలు వ్రాసిన వారిలో ఆరణి కుప్పుస్వామి మొదలియారు, వడుపూర్ రంగరాజు, పొన్నుస్వామి పిళ్ళై, కోదై రంగనాయకి ప్రభృతులు ముఖ్యంగా పేర్కొన దగినవారు.

కాలక్షేపం కోసం కొన్ని నవలలు సంతరించినా, కోదై రంగనాయకి అమ్మాళ్ వ్రాసిన కొన్ని రచనలు అటువంటివికావు.

తియాగ క్కొడి (త్యాగ ధ్వజం), నళిని చరిత్రం మొదలైనవి స్వాతంత్ర్య సమరం సాగుతూ వుండిన రోజులలో వెలువడిన నవలలు. చంపకం, విజయం అనే అనాథ స్త్రీలు తమ సత్ప్రవర్తనవల్ల అందరి మన్ననలకు పాత్రులైన విషయాన్ని చంపక విజయంలో మనం చూడవచ్చు. విద్యావతి యైన సరస అనే ఇల్లాలు తన భర్త కోరికను మన్నించి అతను లేని సమయంలో ఆంగ్ల స్త్రీ వలె తన్ను తాను అలంకరించుకుని వ్యాపారం నిర్వహించిన ఉదంతం మరో రచనలో ఆసక్తి జనకంగా చెప్పారు, అత్తగార్ల ఆరళ్ళను వివరించడంతో పాటు, భర్తను తన వలలో వేసుకుని, అత్తమామలను ముప్పుతిప్పలు పెట్టిన ఒక స్త్రీ కథను కూడా ఇంకొక రచనలో కోదై నాయకి తెలియజేశారు. అటువంటి స్త్రీలు చివరికి ఎలా దండింప బడుతున్నారో ఆ విషయాలు కూడా ఆమె తెలియజేశారు.

# కథానికలో నవ్యతను
# ప్రవేశ పెట్టిన
# పుదుమైప్పిత్తన్

---

జననం : 25-4-1906; మరణం : 30-6-1948
ప్రధాన రచనలు : ప్రేత మనిదన్ మొ. కథానికలు.

తమిళ కథానికా రచనకు వ. వే. సు. అయ్యరు శ్రీకారం చుట్టినా, అది అన్ని హంగులూ సంతరించుకుని పరిపూర్ణ సౌందర్యంతో ప్రతిభాసించ గలిగింది పుదుమైప్పిత్తన్ సుకుమార హస్తంలోనే. తమిళ కథానిక అన్నప్పుడు వీరిద్దరినీ స్మరించక తప్పదు.

పుదుమైప్పిత్తన్ కథానికలతో పాటు కవితలు, వ్యాసాలు, విమర్శలు, నవలలు మొదలైనవి కూడా సంతరించక పోలేదు. కాని కథానికల వల్లనే ఆయనకి పేరు పెంపులు లభించాయి. వాటివల్లనే ఆయన నేటికీ సజీవుడై ఉన్నాడు.

పుదుమైప్పిత్తన్ అన్నది అయన లేఖినీ నామం. పుదుమై అనగా నవ్యత. పిత్తన్ అనగా ఉన్మత్తుడు. కనుక ఆయన నవ్యతారాధకు డని

నిస్సంశయంగా చెప్పవచ్చు. ఈ లేఖినీ నామమే నేటికీ ప్రచారంలో ఉంది. కాని అసలుపేరు చొ. వృద్ధాచలం.

ఆయన 1906 ఏప్రిల్ 25 న తిరుపాదిరిప్పులియూర్ అనే గ్రామంలో జన్మించారు. పూర్వులు తిరునెల్వేలి జిల్లాకు చెందిన వారు. ఆయన చాలా కాలం జీవించలేదు; పెద్ద ఉద్యోగాలూ చెయ్యలేదు. 1948 జూన్ 30 న కన్ను మూశారు.

తిరునెల్వేలిలో పుదుమైప్పిత్తన్ విద్యాభ్యాసం జరిగింది. బి. ఏ. పట్టభద్రు లైనారు. జీవితంలో బాధలు చవి చూచినంతగా సుఖాలు చవి చూడలేదు. తోడి మానవులు పడే బాధలు చూసి పరితపించారు. ఇదంతా ఆయన కథానికలలో ప్రముఖంగా కనిపిస్తుంది. ఆ బాధల మధ్యే రచనా వ్యాసంగం చేశారు. కొంతకాలం 'దినమణి' అనే తమిళ దిన పత్రికలో సహాయ సంపాదకులుగా పని చేశారు.

ఆ రోజుల్లో-'మణిక్కొడి' అనే ప్రముఖ పత్రిక ఉండేది. ఇందులో కు. ప. రాజగోపాలన్, పిచ్చమూర్తి, బి. ఎస్ రామయ్య వంటి వైపు వాటము లెరిగిన రచయితలు తమ కథలు ప్రచురించేవారు. పుదుమైప్పిత్తన్ కథానికలు కూడా ఈ పత్రికలో ప్రచురితమైనాయి. అవి తమిళ పాఠక లోకంలో తీవ్ర సంచలనం కలిగించాయి. సంప్రదాయ విధేయులైన పాఠకులలో సైతం ఆలోచనలు రేకెత్తించాయి. కనుక పుదుమైప్పిత్తన్ కథానికలు ఉబుసుపోకకు వ్రాసినవి కావు. అవి ప్రధానంగా ఆలోచనాత్మకాలు, ముమ్మూర్తులా నవ్యతకు ఆటపట్టులు. ఆయనకి ఆ లేఖినీ నామం అన్ని విధాలా అన్వర్థ మయిం దనడం నిర్వివాదం. ఒక ఉదాహరణ :

1941 కి ముందు పుదుమైప్పిత్తన్ అహల్యను గురించి చక ని కథ వ్రాశారు. మనోనైర్మల్యమే సచ్ఛీలం. అదే పతివ్రతా ధర్మం శారీరక

నైర్మల్యం అంత ముఖ్యమయింది కాదు—అని ఇలా అనుకొని గౌతముడు మనశ్శాంతి పొందుతాడు. పాపకార్యం చేసిన ఇంద్రుణ్ణి మన్నిస్తాడు కూడా. ఈ కథ వెలువడినప్పుడు, తమిళ పాఠకలోకంలో గొప్ప సంచలనం కలిగింది

అహల్యను గురించి మొదట్లో ఇలా ఊహించిన పుదుమైప్పిత్తన్ ఆ తరువాత శాపవిమోచనం అనే మరో కథ వ్రాశారు ఇది కూడా అహల్యకు సంబంధించిందే. అయితే రచయిత దృక్పథంలో మార్పు వచ్చింది. ఈ కథ కూడా పాఠకుణ్ని ఆలోచించేటట్లు చేసింది.

శాపానికి విమోచనం లభించినా, చేసిన పాపకార్యానికి విమోచనం లభించ లేదే అని చింతించి, అహల్య మళ్ళీ శిలా రూపం ధరించింది. గౌతమ మహర్షి మళ్ళీ తపస్సు చేసుకోవడానికి వెడతాడు. శాపవిమోచనం కథను ఇలా పూర్తి చేశారు. ఆ భాగాన్ని యథాతథంగా ఉదాహరిస్తున్నాను

"గౌతముడు లోపలికి వచ్చాడు.

అహల్యకు ప్రజ్ఞ తప్పింది. మళ్ళీ ఇంద్ర నాటకం—మరిచి పోవలసిన ఇంద్ర నాటకం—ఆమె హృదయరంగస్థలం మీద ప్రదర్శిత మౌతూంది.

గౌతముడు ఆమెను స్పృశించాడు.

గౌతముని రూపంలో వచ్చిన ఇంద్రుని వేషం కనిపించిం దామెకు.

ఆమె గుండె రాయిగా మారింది. ఎంత ప్రశాంతత.

గౌతముని చేతుల్లో ఉన్నది శిలా ప్రతిమ.

అహల్య మళ్ళీ శిలగా మారింది.

మనోవేదన తగ్గింది.

కైలాసపర్వతం వైపుగా ఒక ఆకృతి, మంచు కప్పిన ఎడారి గుండా వేగంగా వెడుతూంది. విరక్తి రూపు గట్టిన ఆకృతి అది. ఆయనే గౌతముడు. ఆయన విరాగి."

'మగతనం' అనే మరొక కథను పరికిద్దాం. చిన్నతనంలోనే సీమా అనే అతనికి, రుక్కు అనే ఆమెకు పెళ్ళి అవుతుంది. కాని కట్నం కానుకల దగ్గర ఆ ఇరు కుటుంబాల మధ్య వైమనస్యం కలుగుతుంది. అందువల్ల రుక్కు పుట్టింట్లోనే ఉండవలసి వస్తుంది. పెద్దలకు తెలియకుండా సీమా తన భార్యను కలుసుకుంటూ ఉంటాడు. ఆమె గర్భవతి అవుతుంది. అప్పుడు ఆమెను చూసి ఊరంతా నవ్వుతుంది. ఆ అవమానాన్ని భరించలేక రుక్కు చెన్నపట్టణానికి వెడుతుంది. అక్కడ ఆమెకు పిచ్చి కూడా పడుతుంది. తలవని తలంపుగా ఒక రోజు ఆమెను సీమా చూస్తాడు. నువ్వు నా భార్యవు—అంటూ ఆమెను స్వీకరిస్తాడు. అంతవరకూ తండ్రి చాటు బిడ్డగా పెరిగిన సీమా తన భార్యను స్వీకరించిన ఆ ధైర్యాన్ని రచయిత మగతన మని ప్రశంసించాడు.

యథార్థ జీవితం నుంచే పుదుమైప్పిత్తన్ వస్తువును గ్రహించడం వల్ల, ఆయన కథానికలు వాస్తవిక జీవిత ప్రతిబింబాలుగా రూపొందాయి. అంతే కాని అభూత కల్పనలు చెయ్యలేదు. పైగా జీవితం ఇలా ఉండాలని కాని. ఫలానా లక్ష్యాలు కథానికలలో కనిపించాలని గాని ఆయన ఆశించలేదు. పుదుమైప్పిత్తన్ కథలు ఒక చట్రంలో బిగించేవిగా ఉండవు. జీవితంలో తాను చూచిన సంఘటనలను వీలయినంత వాస్తవికతతో చిత్రించడానికి ప్రయత్నించి కృతకృత్యులైనా రనవచ్చు.

హాస్యరస ప్రధానమైన కథలూ కొన్ని పుదుమైప్పిత్తన్ వ్రాశారు. వాటిలో వేర్కొనదగింది 'కడవుళుం కందస్వామి పిళ్ళైయుం' (దేవుడూ, కందస్వామి పిళ్ళై) ఇందులో దేవుడు భూలోకానికి దిగి వస్తాడు. నలుగురినీ పరిచయం చేసుకుంటాడు. నాలుగు చోటూ చూస్తాడు. ఎటుచూసినా పరిహాస ధోరణే కనిపిస్తుంది. 'దూరంగా నుంచుని వరాలు ఇవ్వవచ్చు. మీతో కలసి మాత్రం జీవించలేను' అనుకొని దేవుడు మళ్ళీ తన లోకానికి దారి తీస్తాడు.

పుదుమైప్పిత్తన్ చిన్నవి పెద్దవీ కథలు ఎన్నో వ్రాశారు. ప్రేత మనిదన్, దెయ్వం కొడుత్తవరం, ఉలగ అరంగు, కాంచనై మొదలైనవి కూడా ఆయన ప్రసిద్ధ రచనలు. కథానికా రచనలో ఆయన ప్రయోగాలు ఎన్నో చేశారు. కనుకనే రకరకాల కథలు వ్రాయగలిగారు. వాటిలో నవ్యత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఒక్క ఈ నవీనతా గుణం వల్లనే ఆయన కథలు ప్రచుర ప్రచారంలోకి వచ్చిన వని భావించడం సంపూర్ణ సత్యం కాదు. నవీనతకు తోడు వాస్తవికతను కూడా ప్రవేశపెట్టారు. అంతేకాక, వాడుక భాషకు ప్రాధాన్య మిచ్చారు. మరుగు పడిన మాటలను ఆయన ఉపయోగించ లేదు. అందువల్ల, పుదుమైప్పిత్తన్ శైలికి జిగి బిగి లభించాయి. ఆయన రచించిన కొన్ని కథలు ఉత్తమ కవితతో పోటీ పడేలా ఉన్న వన్నా అతిశయోక్తి కాదు

పుదుమైప్పిత్తన్ కథానికలు (కదైగళ్), కవితలు (కవితైగళ్), వ్యాసములు (కట్టురైగళ్) సంపుటాలుగా వెలువడినాయి. ఆయన్ని తమిళ కథానికకు మార్గదర్శిగా భావించే విమర్శకులు కొందరు లేకపోలేదు. అంత ఉన్నతస్థానం ఆయనకి లభించింది. ఆయన చేతిలో అన్ని అందాలూ సంతరించుకొని తమిళ కథానిక అందరినీ ఆకట్టుకునే ఒక సాహిత్య ప్రక్రియగా రూపొందినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు.

# పాత కొత్తల మధ్య వారధి వరదరాజన్

---

జననం : 3-4-1912; మరణం : 10-10-1974
ప్రధాన రచనలు : ఇలక్కియ ఆరాయ్చ్చి, అగళ్ విళక్కు మొ.

తమిళ అధ్యాపక పదవి నుంచి తమిళ సాహిత్యాచార్య పదవిని అందుకోగలగడం ప్రముఖ సంఘటనగా భావించవచ్చు. అలాగే గుమాస్తాగా జీవితం ప్రారంభించి విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుడుగా కన్ను మూయడం కూడా ప్రముఖ సంఘటనే. పాత కాలపు పండితులనూ, కొత్త తరం రచయితలనూ సరి సమానంగా అలరించగలగడం కూడా పేర్కొనదగిన సంఘటనే. ఈ అద్భుతాలను సాధించిన మహా మనీషి ము. వ. అని ఖ్యాతి కెక్కిన ము. వరదరాజన్. తమిళ సాహిత్య సౌరభం గుబాళించే ప్రతి ఇంట్లోనూ ము. వ. అంటే చాలు - 'ఆయనా ? ప్రముఖ పండితుడు, ఉత్తమ రచయిత' అనే మాటలు వెంటనే వినవస్తాయి. స్వయంకృషితో మెట్టు మెట్టుగా పైకి వచ్చి ఉన్నత శిఖరాలు చేరుకున్న ము. వ. ప్రసిద్ధ పండిత రచయిత అనడం అణుమాత్రమైనా అతిశయోక్తి కాదు,

ము. వ. ని మించిన రచయితలు కొందరు ఉండవచ్చు. కొమ్ములు తిరిగిన పండితులూ కొందరు ఉండవచ్చు—అని మాట వరసకి అనుకున్నా,

ఆయన వలె మంచి మనిషి. వెన్న వంటి సుతిమెత్తని మనస్సు గల మనిషి మరొకరు కనిపించ రన్నా అత్యుక్తి కాదు ఆయన రచనల్ని విమర్శించే వారికి పైతం ఆయన వ్యక్తిత్వం బహు విశిష్టంగా గోచరిస్తుంది. రచయితగా ఉన్నతుడైతే, వ్యక్తిగా ఆయన మహోన్నతుడు! పరుషోక్తు లాడి ఇతరుల మనస్సుని నొప్పించకుండా ఉండడం, పేద విద్యార్థులకు చేతనైన సహాయం చేయడం, తుది దాకా గాంధేయ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించడం, గర్వానికి కాని ఆడంబరానికి కాని ఎటువంటి పరిస్థితిలోనూ చోటివ్వక పోవడం మొదలైనవి ము వ. లో కొట్ట వచ్చినట్టుగా కనిపించే కొన్ని ముఖ్య గుణాలు. ఆయన చేసిన గుప్త దానాలు ఎన్నో! ఆయన రూపు గట్టిన సౌజన్యం!

ఉత్తరార్కాడు జిల్లాలోని తిరుప్పత్తూర్ అనే ఊరిలో 1912 ఏప్రిల్ 3 న వరదరాజన్ జన్మించారు. తండ్రి మునియప్పన్, తల్లి అమ్మాకణ్ణు. మధ్య తరగతి కుటుంబం.

వరదరాజన్ ఒక ఆఫీసులో గుమాస్తాగా చేరారు. ఎప్పుడూ ఆయన ఖద్దరే కట్టేవాడు. అది చూసి "ఖద్దరు కట్టడం మానెయ్యకూడదా ?" అని పై అధికారి అన్నాడు. అంతే! ఆ తరువాత ఆయన ఆ గుమాస్తా గిరికి స్వస్తి చెప్పారు.

వరదరాజన్ తమిళ విద్వాన్ పరీక్షకు కూర్చుని మదరాసు విశ్వ విద్యాలయంలో సర్వ ప్రథముడుగా ఉత్తీర్ణు లైనారు. తమిళభాషాభిమానం కల కాశీ తిరుప్పాణం దార్ మఠం వారు అలా సర్వ ప్రథముడుగా వచ్చిన వ్యక్తికి వెయ్యి రూపాయల బహుమతి ఇస్తా మని ప్రకటించారు. ఆ ఏడు ఆ బహుమతి వరదరాజన్‌కే లభించింది. తదనంతరం తమిళ అధ్యాపకుడుగా ఒక ఉన్నత పాఠశాలలో చేరిన వరదరాజన్ క్రమ క్రమంగా ఎం. ఏ.,

ఎం. ఓ. ఎల్.. పిహెచ్. డి. మొదలైన డిగ్రీలు పొందారు. మదరాసు పచ్చయప్ప కళాశాలలో చాలాకాలం తమిళ సాహిత్యాధ్యాపక పదవిని అలంకరించారు. కొంతకాలం మదరాసు విశ్వవిద్యాలయంలో తమిళ ఆచార్యుడుగా పని చేశారు. ఆ తరవాత మదురై విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులుగా పని చేసి, 1974 అక్టోబరు 10 న కాలధర్మం చెందారు.

వివిధ విశ్వవిద్యాలయాలతోనే కాక పెక్కు సాహిత్య సంస్థల తోనూ ఆయనకి సంబంధం ఉండేది ఆయన చాలా కాలం సాహిత్య అకాడమీ తమిళ సలహా సంఘ సభ్యుడుగా, కార్య నిర్వాహక వర్గ సభ్యుడుగా ఉండేవారు. అకాడమీ బహుమతి కూడా ఆయన వ్రాసిన 'అగల్ విళక్కు' అనే సాంఘిక నవలకు లభించింది. అంతకు ముందు మదరాసు ప్రభుత్వం వారి బహుమతులు ఆయన కొన్ని రచనలకు లభించాయి.

కవిత తప్ప కడమ సాహిత్య ప్రక్రియ లన్నిటిలోనూ వరదరాజన్ రచనలు చేసి, ఎనలేని పేరు పెంపులు గడించారు. ఆయన ప్రముఖ నవలా రచయిత, పేను మిగిలిన వ్యాసకర్త, ఉత్తమ విమర్శకుడు. తమిళ సాహిత్య చరిత్ర నిర్మాత. భాషాతత్త్వశాస్త్రం గురించి కూడా రచనలు చేశారు. ఆయన వ్రాసిన పుస్తకాలు చిన్నవీ పెద్దవీ అన్నీ కలిపి వంద దాకా ఉంటాయి.

సాంప్రదాయిక పద్ధతిలో తమిళం అభ్యసించినా, వరదరాజన్ నవ్య దృష్టి కల రచయిత. ఇదే ఆయనలోని విశిష్టత. ఈ గుణం ఆయన వివిధ రచనలలోనూ స్పష్టంగా గోచరిస్తుంది. ఆయన ఎంత పండితుడైనా, శైలి పాండిత్య ప్రకర్షకమయింది కాదు. అలా అని వ్యావహారిక భాషను ఉపయోగించనూ లేదు. వరదరాజన్ వాడిన భాష సులభ సుందరమైన సరళ గ్రాంధికం. ఇది వ్యావహారికానికి చేరువగా ఉంటుంది. అందువల్లనే, ఆయన అటు పండితులనీ, ఇటు రచయితలనూ ఆకర్షించ గలిగారు, అలరించ గలిగాడు. ఇటు

వంటి ఒక విశిష్టమైన శైలిని అవలంబించడంవల్ల ఆయన నవలలు 'విశ్వ విద్యాలయ పండితుల్ని కూడా ఆకట్టుకున్నాయి. కాగా, నవలా సాహిత్యానికి ప్రచారం కల్పించిన ప్రముఖులలో వరదరాజన్ ఒక రని నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఈ సందర్భంలో మరొక విషయాన్ని కూడా ముచ్చటించడం అవసరం. తమిళ వేదమైన తిరుక్కురళ్‌కి ప్రాచీన పండితులే ప్రశస్తములైన వ్యాఖ్యలు వెలయించారు. అయితే అవి కేవలం పండితులకే సుగ్రాహ్యములు. వరదరాజన్ మధుర మోహనమైన శైలిలో కురళ్‌కి ఒక లఘువ్యాఖ్య సంతరించారు. ఈ వ్యాఖ్య వెలువడినప్పటినుంచీ నేటి దాకా కొన్ని లక్షల ప్రతులు అమ్ముడు పోయాయి. బహుశః ఇంత ప్రచారం గడించుకున్న రచనలు ఇతర భాషలలో కూడా అట్టే ఉండ వనడం సత్య సన్నిహితం. ఈ తిరుక్కురళ్ వ్యాఖ్యానం వరదరాజన్ శైలికీ, నవ్య దృష్టికీ ఒక మచ్చు తునక.

వరదరాజన్ నవలలలో కరిత్తుండు, మలర్‌విళి, కళ్ళో కావియమో, అగల్‌విళక్కు మొదలైనవి ప్రసిద్ధములు. అగల్‌విళక్కులో స్వీయ చరిత్రాంశం కానవస్తున్నదని కొందరి అభిప్రాయం. కథా కథనమునకు ఇచ్చినంత ప్రాధాన్యం ఆయన పాత్ర పోషణకు ఇయ్యలేదని కొందరు విమర్శకుల తలంపు. విడుదలైయా అనే కథానికా సంపుటిని కూడా ఆయన ప్రకటించారు.

తమిళ పండితుడుగా ఉద్యోగం చేసిన వరదరాజన్ లేఖిని నుంచి ఇలక్కియ ఆరాయ్‌చ్చి (సాహిత్య పరిశోధన) వంటి ఉత్తమ పరిశోధన గ్రంథాలు వెలువడడంలో ఆశ్చర్యం లేదు. భాషా చరిత్రను గురించి ఆయన మొళి వరలాఱు అనే ప్రశస్త రచన చేశారు. భాషా తత్త్వ శాస్త్రం గురించి మొళినూల్ అనే ఉద్గ్రంథం వెలయించారు. కాని, ఆధునిక భాషాతత్త్వ శాస్త్రం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ప్రవర్ధమాన మౌతున్న ఈ రోజుల్లో ఈ గ్రంథానికి మునుముందు

అంత ప్రచారం లభించక పోవచ్చు. అయినప్పటికీ ఆయన ప్రయత్నం కొని యాడ దగింది.

అలాగే తమిళ సాహిత్య చరిత్రను సాధికారికంగా అభివర్ణిస్తూ తమిళ్ ఇలక్కియ వరలాఱు అనే 376 పుటల పుస్తకం వ్రాశారు. ఇది వెలువడిన నాలుగైదు నెలలకే ప్రతులన్నీ అమ్ముడు పోయాయి. ఆయన రచనకు ఎంత ప్రచారము కలదో వివరించడానికే ఈ అంశం పేర్కొంటున్నాను.

ప్రయాణ సాహిత్యం, లేఖా సాహిత్యం మొదలైన ప్రక్రియలలో కూడా వరదరాజన్ రచనలు చేసి పాఠకలోకాన్ని మైమరపింపజేశారు. కాదల్ ఎంగే, పచ్చై యప్పర్ అనే నాటకాలు వ్రాశారు. గాంధీజీ, ఠాకూరు, తిరు. వి. క. మొదలైన ప్రముఖుల జీవిత విశేషాలనూ, వారి ఆదర్శాలనూ వివరిస్తూ చక్కని రచనలు కావించారు.

తమిళ సాహిత్యం గురించి ము. వ. ఆంగ్లంలో కొన్ని వ్యాసాలు వ్రాశారు. తమిళ పంచ కావ్యాలలో ఒకటి అయిన సిలప్పదికార కావ్యకర్త ఇళంగోవి గురించి ఒక పుస్తకం ప్రకటించారు.

భక్త కవిశేఖరు డైన తాయు మానవర్ అంటే ము. వ. కి అనిర్వచనీయమైన అభిమానం. ఆ మహనీయుని పద్యాలను ఆయన తన కొన్ని నవలలలో సైతం ఉదాహరించారు. అంతే కాక, తాయుమానవర్ కవితల లోని భక్తిభావాన్నీ, మాధుర్యాన్నీ విశదీకరిస్తూ ఆకువుగా ఆయన ఒకగంట సేపు ఆకాశవాణిలో చేసిన సాహిత్యోపన్యాసం విస్మరించరానిది. తాయుమానవర్ గీతాలు ఆయనకి హృద్గతాలనడానికి ఇది ఒక నిదర్శనం. ఖలీల్ జిబ్రాన్ సూక్తులన్నా ము. వ. కి అవిరళమైన అభిమానం. వాటిని శ్రద్ధాసక్తులతో ఆయన అధ్యయనం చేసేవారు.

వరదరాజన్ రచనలను కాని, వ్యక్తిత్వమును కాని అవలోకగా పరిశీలించినా, ఆయన పాత కొత్తల మధ్య వెలసిన వారధి అనే అంశం తెలియవస్తుంది. సాహిత్య దృష్టితో చూస్తే, ఆయన ప్రాచీన సంప్రదాయాలను పరిహరించలేదు; నవ్య సంప్రదాయాలను నిరసించనూలేదు అనిపిస్తుంది. ప్రాచీన-నవీన సంప్రదాయాల లోని మంచిని ఆయన జీర్ణించుకున్నారు. వ్యక్తిపరంగా చూస్తే ఆయన అజాత శత్రువు.

# ప్రధాన తమిళ గ్రంథ లఘు వివరణ

---

**అగల్ విళక్కు (ప్రమిద దీపం) :** ము. వరదరాజన్ నవలలో ఇది ప్రశస్తమైనది. దీనికి 1961 లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. మానవుల విభిన్న ప్రకృతులు, జయాపజయాలు, కష్ట సుఖాలు మొదలైనవి ఈ నవలలో కళ్లకు కట్టేలా చిత్రించబడినవి. ఆరోగ్యకరమైన మనస్సు అన్ని సౌఖ్యాలకు సోపాన మనే సత్యం పుస్తక పఠనానంతరం పాఠకుడికి ప్రధానంగా స్ఫురిస్తుంది (చూ. పుట 46).

**అరుట్పా లేక తిరువరుట్పా :** వచన రచనకు మార్గదర్శి అయిన ప్రముఖ భక్త కవి జ్యోతి రామలింగస్వామి (1823-1874) రచన యిది. ఇందులోని గీతాలు దైవానుగ్రహంచే చెప్పబడినట్లు విజ్ఞుల విశ్వాసం. కాగా దీనికి తిరువరుట్పా అని పేరు వచ్చింది. అరుళ్ అనగా అనుగ్రహ మని అర్థం. రామలింగస్వామి గీతాలు కొన్నిటిని 'దైవత మణిమాల' అనే పేరుతో శ్రీ యం. పద్మనాభం తెలుగు చేశారు (1965) (చూ. పుట 35).

**అలై ఓసై :** అలల ఘోష అని అర్థ మిచ్చే యీ 828 పుటల సాంఘిక నవల కల్కి రచనలలో విశిష్ట మయింది. అని ఆయనే పేర్కొన్నారు. నవల పెద్దదే అయినప్పటికీ, వివిధ విషయాలు సజీవంగా వివరించడంవల్ల, చదువుతున్నప్పుడు పాఠకుడికి విసుగు కలగదు. అదే కల్కి రచనలలోని విశిష్టత. ముందు పుటలలో రచయిత ఏమి చెప్పనున్నాడో అనే ఔత్సుక్యం అడుగడుగునా కలుగుతుంది. ఈ నవలకు 1956 లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది (చూ. పుట 123).

**ఆరాయ్చ్చి త్తొగుది :** ము. రాఘవయ్యంగారి రచనలలో ఈ వ్యాస సంకలనం పేర్కొనదగింది. ఇందులో 35 భాషా చారిత్రక వ్యాసాలు

చోటు చేసుకున్నాయి. కేవల భాషా పండితులకు చారిత్రక జ్ఞానం తక్కువ అనే అభిప్రాయానికి రాఘవయ్యంగారు అపవాదం కల్పించారు. ఆయన వెల యించిన పెక్కు వ్యాసాలలో పాండిత్యమూ, చారిత్రక దృష్టి కనిపిస్తాయి. (చూ పుట 91).

**ఆసియ జోతి :** దేశిక వినాయకం పిళ్లె రచించిన ప్రశస్త కావ్యం ఆర్నాల్డ్ రచించిన 'లైట్ ఆఫ్ ఏషియా'ని అనుసరించి యిది సంతరించబడింది. కాని ఆసియ జోతిని చదివేటప్పుడు అనువాద కావ్యం చదువుతున్నా మనే అనుభూతి కలగదు స్వతంత్ర కావ్యపఠనానుభూతి కలుగుతుందన్నా అత్యుక్తి కాదు ఆయన సంతరించిన ఉమర్ ఖయాం రుబాయతులు కూడా ఈ కోవకు చెందిన రచనగానే భావించబడుతున్నది (చూ. పుట 77).

**ఉదయణన్ చరిత్తిరం (చరిత్ర):** 10 వ శతాబ్దిలో కొంగు వేళిర్ అనే కవి ఉదయనుని జీవిత విశేషాలను అభివర్ణిస్తూ పెరుం గదై (బృహత్కథ) అనే కావ్యం వెలయించాడు. ఈ కావ్య కథా సంగ్రహమును ఉదయణన్ చరిత్ర అనే పేరుతో ఉ. వే. సామినాదయ్యరు ప్రకటించారు. (చూ. పుట 21).

**ఉత్తైయూర్ పురాణం :** చోళుల ప్రాచీన రాజధాని నగరం ఉత్తై యూర్. ఇది ప్రస్తుతం తిరుచ్చిరాపల్లి నగరంలోని ఒక భాగం. ఈ స్థలపురాణం మీనాక్షిసుందరం పిళ్లెగారి రచనలలో పేర్కొన దగింది (చూ పుట 2).

**ఎట్టుత్తొగై :** తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన యుగం 'సంగకాలం'. ఈ యుగంలో వీర వదాన్యతలకూ (పురం), ప్రణయమున కూ (అగం) సంబంధించిన కృతులు వెలుగు చూశాయి. ఈ రెండు రకాల కృతుల సంకలనాన్ని ఎట్టుత్తొగై అని లాక్షణికులు వ్యవహరించారు (చూ. పుట 22). ఈ మాటకు ఎనిమిది కృతు లని అర్థం చెప్పవచ్చు.

**ఎన్ చరిత్తిరం :** 'తమిళ తాత' ఉ. వే. సామినాదయ్యరు గారి స్వీయచరిత్ర యిది. తమిళంలో వెలసిన యీ తొలి స్వీయచరిత్ర గ్రంథంలో 18, 19 శతాబ్దుల తమిళ సాహిత్య చరిత్రకు సంబంధించిన పెక్కు అంశాలు ఉదాహృతములు. 'ఎన్ చరిత్తిరం' సంక్షిప్తానువాదాన్ని కేంద్ర సాహిత్య అకాడెమీ తెలుగులో (నా చరిత్ర 1965 లో) ప్రకటించింది (చూ. పుట 21).

**కంద పురాణం :** స్కాందము నందలి శివరహస్య ఖండంలోని ఆరు కాండముల కిది తమిళ కావ్యానువరణ. శివుని కుమారుడైన మురుగ దేవునికి సంబంధించింది. ఇందులో 10,346 పద్యా లున్నాయి. కచ్చియప్ప శివాచారియర్ అనే కవి దీన్ని వెలయించారు. 11 వ శతాబ్దిలో కందపురాణం వ్రాయబడి వుండవచ్చు నని విజ్ఞుల విశ్వాసం (చూ పుట 10)

**కంబ రామాయణం :** దీని నామాంతరం రామావతారం. కవి చక్రవర్తి బిరుదాంచితుడైన కంబర్ (9 లేక 12 వ శతాబ్ది) దీని కర్త. వాల్మీకి రామాయణానికి తర్వాత మన దేశభాషలలో వెలిసిన తొలి రామాయణ మిది. దీనికి సాటివచ్చే రామాయణం తమిళంలో న భూతో న భవిష్యతి అన్నా సాహసం కాదు. కంబకవి చిత్రించిన సీతారాములు లక్ష్మీ నారాయణులు. ఇది ఆయన చేసిన ముఖ్యమైన మార్పు. శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి దీన్ని పద్యకావ్యంగా అనువదించారు (చూ. పుటలు 22, 86, 96, 107, 137).

**కణ్ణన్ కాట్టియ వళి :** శ్రీమద్భగవద్గీతా సారాన్ని తమిళ పాఠకులకు తెలియజేసే ఉద్దేశంతో రాజాజీ చేసిన రచన యిది. కణ్ణన్ కాట్టియ వళి అనగా కన్నయ్య చూపిన దోవ అని అర్థం. గీతను చదివేటప్పుడు భారత కథను విస్మరించడం మంచి దని ఆయన అభిప్రాయం. గీతోపదేశాలు సార్వ కాలికము లని ఆయన విశ్వసించారు (చూ. పుట 84).

**కమలాంబాళ్ చరిత్తిరం :** తమిళంలో వెలసిన (1897) రెండవ నవల యిది. ఇది నిజమైన తొలి తమిళ నవల అని భావించే విమర్శకులూ

కొందరు లేకపోలేదు. ఈ సాంఘిక నవలలో జీవితపు బాధలు పోయినప్పటికీ కాని ధైర్యంగా నిలిచిన భార్యాభర్తల కథ హృద్యంగా కట్టినట్లుగా చిత్రించబడింది. దీన్ని ఆధ్యాత్మిక నవల అనవచ్చు నని ఒక విమర్శకుని అభిప్రాయం. ఈ ప్రశస్త నవలను దక్షిణభాషాపుస్తకసంస్థవారు తెలుగులో 'సంసార సాగరం' అనే పేరుతో అనువదించి ప్రకటించారు. అనువాదకులు : శ్రీ శ్రీవాత్సవ (చూ. పుట 46).

**చక్రవర్తి త్తిరుమగన్ (చక్రవర్తి తనూజాడు)**. 1958 లో కేంద్ర సాహిత్య అకాదెమీ బహుమతి లభించిన ఈ గ్రంథం రాజాజీ రచనలలో ఒకటి. వాల్మీకమును ప్రధానంగా గ్రహించి రచన సాగించినా, కంబ రామాయణంలోని కొన్ని విషయాలను కూడా రాజాజీ ఈ రామాయణంలో చేర్చారు. ఈ రచన ఆబాలగోపాలాన్ని బహుధా ఆకర్షించిం దనడం సత్యసన్నిహితం. ఇది రాజాజీ రామాయణం అనే పేరుతో (1961) తెలుగులో వెలువడింది. అనువాదకులు శ్రీ కె. శ్రీనివాసాచార్యులు (చూ. పుట 63).

**జీవక చింతామణి :** తమిళ పంచ కావ్యాలలో ఒకటి. దీని కర్త తిరుత్తక్కదేవర్ అనే జైనముని. ఇందలి శైలి విశిష్టమైనది. పండిత లోకంలో దీనికి గల ప్రచారం నిరుపమానం. ఉ. వే. సామినాదయ్యరు కృషి ఫలితంగా ఇది 1887 లో మొదటి సారిగా ముద్రించ బడింది.

తిరుత్తక్కదేవుడు 5 వ శతాబ్దివా డని పండితులూ, 10 వ శతాబ్ది వాడని పరిశోధకులూ భావిస్తున్నారు. ఈ శృంగార రస ప్రధానమైన కావ్యానికి నచ్చినార్క్కినియార్ అనే ప్రాచీన పండితుడు చక్కని వ్యాఖ్యానం వెలయించాడు (చూ. పుట 19, 20).

**తిరుక్కురళ్ :** ధర్మార్థ కామములకు (త్రివర్గము) సంబంధించిన ప్రసిద్ధ నీత్యుద్బోధక గ్రంథం. కర్త తిరువళ్లువర్. 1330 కురళులు (ద్విపదలు) ఇందులో ఉన్నాయి. తమిళ వేద మని ప్రసిద్ధి కెక్కిన యీ గ్రంథం పెక్కు ప్రాచ్య పాశ్చాత్య భాషలలోకి అనూదిత మయింది. దీనికి వెలసిన వ్యాఖ్యా

నాలలో పరిమేళగర్ అనే ప్రాచీన పండితుడు వెలయించిన వ్యాఖ్య ప్రశస్త మని భావించబడుతున్నది. తెలుగులో తిరుక్కురళ్‌కి పెక్కు పద్యానువాదాలు వెలువడడం హర్షించదగిన అంశం (చూ. పుట 10, 85, 94, 114, 118).

**తిరువిళైయాడల్ పురాణం :** మధురలో వెలసిన సుందరేశ్వరుడు నెరపిన లీలా విశేషాదికాన్ని అభివర్ణించే పద్యకృతి యిది. దీనిని సంతరించినవారు పరంజ్యోతి ముని. ఆయన శైవ మత సంప్రదాయమునకు చెందిన వేళాళ కులంలో జన్మించారు (చూ. పుట 9).

**తేవారం :** శైవుల పారాయణ గ్రంథ మిది. తిరుజ్ఞాన సంబందర్ తిరునావుక్కరశర్, సుందరమూర్తి అనే భక్తకవుల గీతాలు ఇందులో చోటు చేసుకున్నాయి. వీరిని మూవర్ (ముగ్గురు, త్రయం) అనే సమష్టి నామంతో వ్యవహరించడం అలవాటు (చూ. పుట 22).

**దక్కయాగప్పరణి :** కవి చక్రవర్తి బిరుదాంకితుడైన ఒట్టక్కూత్తర్ వెలయించిన 814 పద్యాల కృతి యిది. కూత్తర్ అనగా నటరాజని అర్థం. దక్షుడు చేసిన యజ్ఞమునకు సంబంధించిన కథ యిందులోని విషయం. దీనిని సవ్యాఖ్యానంగా ఉ. వే. సామినాదయ్యరు 1960 లో ప్రచురించారు (చూ. పుట 23).

**నందనార్ కీర్తనై :** సుప్రసిద్ధ గేయ రచయిత గోపాలకృష్ణ భారతి రచన యిది. ప్రసిద్ధ శివభక్తుడు నందనారు జీవితానికి సంబంధించింది. ఈ రచన నేటికీ ప్రచారంలో ఉంది. ఇందులో లక్షణ విరుద్ధములైన ప్రయోగాలు కొన్ని కానవస్తున్నా, గేయాంశం ప్రధానంగా ఉండడంవల్ల వింటున్నప్పుడు అవి స్ఫురించవు (చూ. పుట 5).

**నాటక మేడై నినైవుగళ్ :** నాటకరంగ స్మృతులని దీని అర్థం. ఇది తమిళ నాటక పితామహుని రచన. ఇందులో ఒకచోట ఆయన యిలా

పేర్కొన్నారు: "నేను రంగస్థలం ప్రవేశించే సమయం వచ్చినప్పుడు నాలో ఒక విధమైన భయం ప్రవేశించింది. ఎనిమిదేళ్ల దున్నపోతు అనే ఒక సామెత ఉంది. అలాంటి దున్నపోతుకి అయిదింతలు వయస్సు కలిగి, సుమారు 40 యేళ్లు రంగస్థలంమీద నటించిన తర్వాత కూడా మన కేమిటి ఈ భీతి అని నవ్వుకుని, మనస్సుని గట్టిచేసుకొని, నేను ఔషధంగా గ్రహిస్తూవచ్చిన 'ప్రాణాయామం' అన్నదాన్ని అయిదారు సార్లు అభ్యసించి, రంగస్థలం ప్రవేశించేవాణ్ణి" (చూ. పుట 59).

**నాటక ఏయల్ :** భాషా చరిత్రకారు డైనా, సూర్యనారాయణ శాస్త్రిగారిని నాటక రచన బహుంధా ఆకర్షించిం దని చెప్పవచ్చు. ఆయన రోజుల్లో ఎన్నో నాటకాలు ప్రదర్శించేవారు. కాని అవి నాటక లక్షణ శాస్త్రమునకు విరుద్ధంగా ఉండడం చూచి, శాస్త్రిగారు 'నాటక వియల్' అనే గ్రంథం వ్రాశారు. ఈ కోవకు చెందిన రచనలలో ఇది మొదటిది. నాటక లక్షణాలను విద్యార్థులకు సైతం తెలిసేటట్లుగా ఆయన సూత్ర రచన చేశారు; దానికి వ్యాఖ్యానమూ సమకూర్చారు. ఈ లక్షణ శాస్త్రానికి తగినట్లుగా 'కలావతి' అనే నాటకమూ వ్రాశారు. అంతేకాదు; ఆ నాటకంలో కళావతి పాత్ర కూడా ధరించారు (చూ. పుట 42).

**పత్తుప్పాట్టు :** పది కృతు లని ఈ మాటకు అర్థం. ఇవి : ముల్లైప్పాట్టు, కురింజి ప్పాట్టు, పట్టిన ప్పాలై, తిరుమురుగాట్రుప్పడై, మొదలైనవి. ఆనాటి రాజుల వదాన్యత, ప్రజల గుణగణాలు, వారి ప్రకృత్యుపాసన, వ్యాపారం మొదలైన విషయాలకు సంబంధించిన పెక్కు విషయాలను ఈ కృతుల మూలంగా మనం గ్రహించవచ్చు (చూ. పుటలు 22, 30).

**పద్మావతి చరిత్రం :** తొలి తమిళ నవలా రచయితలలో ప్రముఖులైన అ. మాదవయ్య రచన యిది. ఇది మూడు భాగాల నవల. సమాజంలో కానవచ్చే లోటు పాట్లు, స్త్రీ విద్యకు గల ఆవశ్యకత, శిశు

ప్రాముఖ్యం. మొదలైన పెక్కు విషయాలను అభివర్ణించే యీ నవల ఆనాటి సామాజిక విషయాలకు అద్దం పడుతున్న దని చెప్పవచ్చు. మాదవయ్యా కారిండా వంటి చక్కని నవలలు ఆంగ్లంలోనూ వ్రాశారు (చూ. పుట 51, 53).

**పరమార్థ గురు కథై :** అధునిక తమిళ సాహిత్యమును పరిపుష్టం కావించిన పాశ్చాత్య పండితులలో ప్రముఖులైన వీరమామునివర్ (బెస్కి) రచన యిది. ఆయన కావ్యాలు, వచన రచనలు, లక్షణ గ్రంథములు, నిఘంటువులు మొదలైనవి వెలయించారు. తమిళంలో ఆ నాళ్లలో వచన రచనలు లేకపోవడాన్ని గమనించి, సామాన్యులకు సైతం అర్థమయ్యే శైలిలో పరమార్థ గురుకథను రచించారు. ఇది తెలుగు, కన్నడం, ఆంగ్లం మొదలైన భాషలలోకి అనువదించబడింది. 1861 లో తెలుగులో ముద్రితమైన పరమానంద గురువుల కథలు బహుశః పరమార్థ గురుకథైకి వెలసిన తెలుగు సేత యేమో ! (చూ. పుట 94).

**పాంచాలి శపథం :** తమిళ కవితలో అధునికతను ప్రవేశపెట్టిన సుబ్రహ్మణ్య భారతి రచించిన 308 పద్యాల కావ్య మిది. ధృతరాష్ట్రుడు ఉన్నత గుణములు కలవాడుగా ఇందులో వర్ణించడం జరిగింది. ఈ కృతిని వ్యాస భారత భాగానికి అనువాదంగా భావించ వచ్చు నని భారతి తమ ముమ్నుడిలో పేర్కొన్నాడు. రాబోయే మహా కవులకూ వారికి అండగా నిలిచే ప్రముఖులకూ దీన్ని ఆయన అంకితం చేశారు (పుట 103 .

**పార్థివన్ కనవు :** తమిళంలో చారిత్రక నవల అనగానే కలి—పేరు స్ఫురణకు వస్తుంది. నవలా రచయితగా ఆయన అంత ప్రసిద్ధి చెందారు. పల్లవ స్వర్ణయుగం నాటి కథను ఆధారంగా చేసుకుని ఆయన యీ నవల వ్రాశారు. ప్రేమ, కర్తవ్యం—ఈ రెంటికీ సంఘర్షణ యేర్పడుతుంది. కథ సుఖాంత మవుతుంది. ఈ నవల పార్థివ స్వప్నము అనే పేరుతో 1972 లో ప్రచురించ బడింది. తెలుగు చేసినవారు శ్రీ యన్. పి. వి. నరసింహాచార్యులు (చూ. పుట 122).

**పెరియ పురాణం:** పెరియ పురాణ మనగా పెద్ద పురాణ మని అర్థం. దీనికి తిరుత్తొండర్ పురాణం అనే నామంతరమూ వాడుకలో ఉంది. మహాభక్తుల పురాణ మని దీనికి అర్థం. అరవై ముగ్గురు నాయన్మారులను (శివ భక్తులు) గురించి ఈ పద్య కావ్యంలో మనోహరంగా అభివర్ణించబడింది. కర్త సేక్కిళార్ (12వ శతాబ్ది). దీనికి తమిళంలో వచనానువాదాలు వెలువడ్డాయి. తెలుగులో శ్రీ పొంగూరు సూర్యనారాయణ శర్మ దీనికి వచనానువాదం చేశారు (చూ. పుట 1,149).

**పెరున్దొగై:** ము. రాఘవయ్యంగారు నిర్విరామ కృషికి ఫలితంగా వెలుగుచూచిన యీ బృహత్ సంకలనంలో 2,200 చాటువులు అందాలు దిద్దుకున్నాయి. ఇది విమర్శకులయు, పండితులయు ఆదరాభిమానములను చూరగొన్నది (చూ. పుట 90).

**ప్రతాప ముదలియార్ చరిత్తిరం:** తమిళ వాఙ్మయంలో వెలసిన తొలి నవల యిది. తమిళంలో వచన కావ్యాలు లేని కొరతను తీర్చాలనే అభిలాషతో వేదనాయకం పిళ్లై ఈ రచన చేసినట్లు చెప్పవచ్చు. ఆయన రచనలో సంస్కృత శబ్దాలు కొంచెం ఎక్కువగానే కనిపిస్తాయి. నీత్యుద్బోధకంగా సంతరించబడిన యీ నవలలో మధ్య మధ్య హాస్యరసం కూడా చిప్పిలుతూ వుంటుంది (చూ. పుట 12).

**మణిమేకలై:** తమిళకావ్య పంచకంలో ఒకటి. కర్త చీత్తలై చాత్తనార్ (క్రీ. శ. 2 వ శతాబ్ది). సిలప్పదికార కావ్య నాయకుడైన కోవలుని కుమార్తె మణిమేకలై (మణిమేఖల) జీవిత విశేషాదికాన్ని అభివర్ణించే ప్రశస్త కావ్యమిది. బౌద్ధుల ఆచార వ్యవహారాలను అవగతం చేసుకునేందుకు ఈ కావ్యం ఎంతైనా ఉపకరిస్తుంది. శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి దీన్ని తెలుగులో ద్విపద కావ్యంగా అనువదించారు (చూ. పుట 21).

**మనోన్మణీయం :** తమిళ నాటక సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన వారిలో ఒకరు పె. సుందరం పిళ్లై. లార్డ్ లిట్టన్ రచించిన Lost Tales of Miletus నుంచి గ్రహించిన యితివృత్తంతో ఆయన యీ నాటక రచన చేశారు. పద్య రూపంలో సాగిన రచన యిది. ప్రదర్శన యోగ్యమైన రచన కాకున్నా, మనోన్మణీయం సాహిత్యపు విలువ కల మనోహర రచన అనడం నిస్సంశయం (చూ. పుట 25, 27).

**మనోహరా :** తమిళనాటక పితామహుడు పమ్మల్ సంబంధం ముదలియార్ రచించిన కాల్పనిక నాటక మిది. ఈ నాటకంలో ఆయన మనోహరన్ వేషం ధరించి వీరోత్సాహాలు ప్రదర్శించి ప్రేక్షకుల్ని మైమరపించే వారట. మనోహరన్ తండ్రి రాజా పురుషోత్తమన్‌గా కూడా ఆయన వేషధారణ చేసేవారు. ప్రధాన పాత్రలతో పాటు సేవకుడు మొదలైన సాధారణ పాత్రలను కూడా ఆయన అమిత సమర్థతతో నిర్వహించేవారు. (చూ. పుట 56).

**మీనాక్షి సుందరం పిళ్లై అవర్‌గళ్ చరిత్తిరం :** ఇది మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లైగారి జీవిత చరిత్ర. తమ గురువైన పిళ్లైగారిని గూర్చి సామినాదయ్యరు వ్రాసింది. తమిళంలో వెలసిన జీవిత చరిత్ర గ్రంథాలలో ఇది ప్రశస్తమైనది. 800 పుటల గ్రంథ మిది (చూ. పుట 21).

**వ్యాసర్ విరున్దు :** వ్యాస మహర్షి వెలయించిన భారతము ననుసరించి రాజాజీ తమిళంలో 'వ్యాసుని విందు' సంతరించారు. ఆయన రామాయణ రచన వలె ఇది కూడా పాఠక ప్రపంచాన్ని ఎంతగానో అలరించింది. రాజాజీ దృష్టిలో రామాయణ భారతాలు అందరూ చదువవలసిన రచనలు. 'రాజాజీ భారతం' అనే పేరుతో (1960) ఇది తెలుగులోకి అనువదించబడింది. అనువాదకులు: శ్రీ శ్రీవాత్సవ (చూ. పుట 63).

**సిలప్పదికారం :** మంజీర మహిమ అనే అర్థ మిచ్చే యీ కృతి తమిళ పంచకావ్యాలలో ద్వితీయ మైనా, అద్వితీయ కావ్య మని పండితుల విశ్వాసం. దీనిని ఇళంగో అడిగళ్ (క్రీ. శ. 100-130) అనే రాజకవి సంతరించారు. ఆయన జైన మతావలంబకుడు. కణ్ణకీ కోవలుల కథ 4,957 పంక్తులు కల యీ మనోహర కావ్యంలో వివరించబడింది (చూ. పుట 21).

**సీరా ప్పురాణం :** సుప్రసిద్ధ ముస్లిం తమిళ విద్యత్కవి అయిన ఉమరు పండితుని 5,027 పద్యాల బృహత్కావ్య మిది. మహమ్మదు నబి జీవిత విశేషాదికం ఈ కావ్యంలో అభివర్ణితం. దీన్ని పెయ్యగుత్తంబి పావలర్ వ్యాఖ్యాన సహితంగా ప్రకటించారు (చూ. పుట 34, 36).

**సుగుణ సుందరి :** తొలి తమిళ నవలా రచయిత అయిన వేదనాయకం పిళ్లై రచించిన నవల యిది. కాని దీనికి ఆయన తొలి రచన అయిన ప్రతాప ముదలియార్ చరిత్రమునకు వచ్చినంత ఖ్యాతి, ప్రచారమూ రాలేదు (చూ. పుట 10).

**సేక్కిళార్ పిళ్లై త్తమిళ్ :** భగవంతుణ్ణి గాని మహాపురుషుణ్ణి గాని బాలుడుగా భావించి చేయబడే రచనను పిళ్లైత్తమిళ్ అంటారు. ఈ కావ్య భేదాన్ని లాక్షణికులు సమ్మతించారు. ప్రస్తుత కృతిలో పెరియ పురాణకర్త అయిన సేక్కిళార్‌ని గురించీ, ఆయన ప్రదర్శించిన భక్తి భావం గురించీ, మనోజ్ఞంగా చెప్పబడింది (చూ. పుట 3).

---